సంపుటి -34, సంచిక - 2
398వ సంచిక, పేజీలు : 132
మార్చి 2011

# చతుర





**శో**భనం గదిలోకి భాను పాల గ్లాసుతో అడుగుపెట్టింది. ప్రసాదు ఆమెకోసం వేయి కళ్లతో ఎదురు చూస్తున్నాడు. భాను అపురూప సౌందర్యానికి ముగ్ధుడై చేసుకున్నా డతను. ఆమెను ఎంత తొందరగా తన కౌగిట్లో బంధించేద్దామా... అని ఆత్రంగా ఉన్నాడు.

భాను ముఖంలో నవ్వు లేదు. ఆమె ముభావంగా ఉంది.

'ఏం అలా ఉన్నావు భానూ? ఒంట్లో బాగాలేదా? ' అడిగాడు.

'ఏం లేదు. ఒంట్లో బానే ఉంది'

'మరెందుకలా ఉన్నావు?'

'నాకీ పెళ్లి ఇష్టం లేదు' ఠపీమని అనేసింది భాను.

ఆ తర్వాత వారి సంసారం ఎలాంటి మలుపులు తిరిగింది? ఆద్యంతం ఆసక్తిగా చదివించే **న్యాయపతి కమలారాంజీ** కౌటుంబిక నవల **గడ్డిపూలు** 6వ పేజీలో..

బొమ్మలు : **ఆనంద్**



# 2011లో ఇంప్రింట్‌వారి భారతదేశంలోని తీర్థయాత్రలు పుణ్యభూముల సందర్శనం



## శృంగేరి యాత్ర

గోకర్ణము, మురుదేశ్వర్, మూకాంబిక, ఉడిపి, ధర్మస్థల, హోరనాడు, శృంగేరి
4 రోజుల యాత్ర, రూ. 4000/- బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,11/2,11/3,8/4,13/5,10/6, 8/7,12/8,9/9,7/10,11/11,9/12

## తమిళనాడు దర్శన్

వెల్లూర్, తిరుత్తని, కంచి, పాండిచ్చేరి, నవగ్రహ దేవాలయాలు, తిరువెంకాడ్, తిరుచ్చి, మధురై, కుర్తాళం, రామేశ్వరం, కన్యాకుమారి, శుచేంద్రం, త్రివేండ్రం.
7 రోజుల యాత్ర, రూ.11500/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1, 18/2, 18/3, 15/4, 20/5, 17/6, 19/8,16/9,14/10,18/11,16/12

## మహారాష్ట్రా దర్శన్ అష్ట గణపతులు

షిరిడి, తుల్జాపూర్, కొల్హాపూర్, అక్కల్‌కోట్, 4 జ్యోతిర్లింగాలు
7 రోజుల యాత్ర, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 12500/-
యాత్ర తేదీలు : 21/1, 24/2, 25/3, 22/4, 27/5, 24/6, 22/7, 26/8, 23/9, 21/10, 26/11, 22/12

## హిమాలయ దర్శన్

బాగేశ్వర్, బైద్యనాథ్, పాతాళభువనేశ్వర్, బేరీనాగ్, జాగేశ్వర్, రాణీకేత్, నైనితాల్. ఈ క్షేత్రముల యందు సాక్షాత్తు దేవతలు ప్రత్యక్షమగును.
రైలు, బస్సు, 10 రోజుల యాత్ర, ఖర్చు రూ. 16000/-
యాత్ర తేదీలు : 11/1, 18/2, 18/3, 15/4, 20/4,17/5,15/6, 19/7, 16/8,23/9,21/10,26/11,16/12

## గుజరాత్ దర్శన్ సోమనాథ్, నాగేశ్వర్

పంచద్వారకలు, గోపితలావ, మాతృగయ, జామ్‌నగర్, పోరుబందర్
7 రోజుల యాత్ర, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 11000/-
రాజ్‌కోట్ వరకు రైలు అక్కడ నుండి బస్సు, యాత్ర తేదీలు :
11/1,25/1,22/2,8/3,22/3,5/4,19/4,10/5,24/5,7/6,21/6,5/7, 19/7,9/8,23/8,6/9,20/9,4/10,18/10,8/11,22/11,6/12,20/12

## కేరళ యాత్ర

కాలడి, చోటాకినారా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల దేవాలయాలు గురువాయూరు, అలిపి, మున్నార్, త్రివేండ్రం, కన్యాకుమారి
9 రోజుల యాత్ర, రైలు, బస్సు ఖర్చు రూ. 18000/-
యాత్ర తేదీలు : 28/1, 25/2, 25/3, 21/4, 26/5,28/6,28/7, 28/8, 28/9,19/10,23/11,22/12

## ఉజ్జయిని ఓంకారేశ్వర్ యాత్ర

ఉజ్జయిని, హర్షవర్ధినిదేవి (శక్తిపీఠం), ఓంకారేశ్వర్, మహేశ్వర్, జ్యోతిర్లింగములు, ఆంజనేయస్వామి దేవాలయం, పార్వతి దేవాలయం
4 రోజుల యాత్ర, రైలు, బస్సు ప్రయాణం. ఖర్చు రూ. 5500/-
యాత్ర తేదీలు : 22/1,12/2,26/2,12/3,26/3,9/4,23/4,14/5,28/5,11/6,25/6,9/7, 23/7,13/8,27/8,10/9,24/9,8/10,22/10,12/11,26/11,18/12,24/12

## సంపూర్ణ నేపాల్ యాత్ర

లుంబిని, పోక్రా, ముక్తినాథ్, మనోకామ్న, పశుపతినాథ్, దక్షిణకాశీ, జనక్‌పురి, చిన్నమస్త, కోసిదామ్, ఖాట్మండ్,
రూ. 42,000/- ఒక్కరికి
(ప్రయాణ భోజన వసతులతో సహా)

## ఒరిస్సా, బెంగాల్, అస్సాం దర్శన్

పూరీ, సాక్షిగోపాలం, కటక్, భువనేశ్వర్, గిరిజాదేవి, కాళీమాత దేవాలయం, గంగాసాగర్, చందాసాగర్, తారకేశ్వర్, పక్షేశ్వర్, శాంతినికేతన్, బ్రహ్మపుత్రానది, ఉమానందా దేవాలయం, ఏకాక్ ఐలాండ్, కామాఖ్యా దేవాలయం.
12 రోజుల యాత్ర, రూ. 18000/-, రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 21/1,25/2,25/3,22/4,27/5,24/6, 22/7,26/8,23/9,21/10,25/11,23/12

## కాశీ, గయ, ప్రయాగ

కాశీయందు పిండప్రదానం చేయు వారికి ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరి జిల్లాకు చెందిన ఋత్విక్కులచే తీర్థ కార్యక్రమాలు జరుపుకొనే సౌకర్యం కల్పించబడును. 6 రోజుల యాత్ర, రూ. 5,500/- (భోజనములు కాక) రైలు, బస్సుప్రయాణం. యాత్ర తేదీలు : ప్రతీరోజు

## చార్‌ధామ్ యాత్ర

హరిద్వార్, హృషీకేశ్, యమునోత్రి, గంగోత్రి, కేదార్‌నాథ్, బదరీనాథ్.
13 రోజుల యాత్ర. రూ. 20000/- రైలు, బస్సు ప్రయాణం.
యాత్ర తేదీలు : 3/5,20/5,27/5,3/6,17/6,24/6,1/7,22/7, 29/7,5/8,19/8,26/8,2/9,16/9,30/9

## ద్వాదశ జ్యోతిర్లింగ యాత్ర

శ్రీరామేశ్వరం, శ్రీశైలం, భీమాశంకర్, శ్రీ త్రయంబకేశ్వర్, ఘృష్ణేశ్వర్, పర్లీవైద్యనాథ్, శ్రీనాగేశ్వర్, శ్రీసోమనాథ్, ఉజ్జయిని, శ్రీ ఓంకారేశ్వర్, శ్రీ కేదార్‌నాథ్, వారణాసి. 23 రోజుల యాత్ర. రైలు, బస్సు ప్రయాణం.
రూ. 32000/- యాత్ర తేదీలు : 27/1,24/2,24/3,26/4, 23/5,21/6,25/7,22/8,20/924/10,24/11,22/12

వివరాలకు :




దంటు నాగార్జున శర్మ, ఇంప్రింట్ ట్రావెల్స్ & టూర్స్
ప్లాట్ నెం. 504, సంయుక్తా అపార్ట్‌మెంట్స్, అంబాలికా ఫర్నిచర్ పైన, రాజా డీలక్స్ ఎదురుగా, ముషీరాబాద్, హైదరాబాద్ - 20, ఫోన్ : 040 – 2754 7708/2754 7709, సెల్ : 98850 89092

జీవితమన్నాక ఎత్తుపల్లాలు సహజం. అయితే
కొందరి జీవితాల్లో కల్పితగాథల్లో కంటే ఎక్కువ
మలుపులు ఉంటాయి... విషాదాలుంటాయి.
జీవితంతో పోరాడలేని అనూహ్య పరిస్థితులు
వారిని చుట్టుముడతాయి. అశక్తుల్ని చేస్తాయి..
ఫలితం వారి జీవితాలు నిరుపయోగంగా
గడ్డిపూల్లా మిగిలిపోవడమే!
సమస్యలకు ఎదురొడ్డి నిలిచే శక్తిలేని ఇలాంటివాళ్లు
ఊపిరి ఉన్నన్నాళ్లూ జీవచ్ఛవాల్లా ఎలాగోలా
బతుకులీడుస్తారు.. ఆయుష్షు తీరాక నిశ్శబ్దంగా
కాలగర్భంలో కలిసిపోతారు..

వాస్తవికతకు అద్దంపట్టే నవల
శ్రీమతి న్యాయపతి కమలారాంజీ
గడ్డిపూలు
మార్చి చతుర మీకందిస్తున్న విశిష్ట కానుక!

శ్రీమతి న్యాయపతి కమలారాంజీ

# గడ్డిపూలు

కొందరి జీవితాలు గడ్డిపూలలాంటివి. గడ్డిపూలు దేవుడి పూజకు పనికి రావు. కొన్ని జీవితాలూ అంతే! ఎవరికీ పనికి రారు. అసమర్థులుగా మిగిలిపోతారు. తమలో తామే కుమిలిపోతారు తప్ప ఎదిరించలేరు.

వసుంధర, జానకి రామయ్య, ప్రసాదు, జ్యోతి, భారతి, శంకరం ఇలా ఎందరో...? పరిస్థితులకు తలవంచుతారు తప్ప జీవితంతో పోరాడలేరు.

వసుంధర విష్ణు సహస్రనామాలు గట్టిగా చదువుతోంటే జానకి రామయ్య విని చాలా సంతోషించేవారు.

ప్రతీరోజూ పొద్దున్నే ఐదుగంటలకి ఇద్దరూ నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకుని దేవుడికి పూజ పునస్కారం చేసి తీర్థ ప్రసాదాలు సేవించిన తర్వాత కాఫీ తాగుతారు.

ఆరోజు ఎప్పటిలాగే విష్ణు సహస్రనామాలు చదవడం పూర్తిచేసి ఆఖరి శ్లోకాలు చదువుతోంటే అప్పుడే గది తలుపు ధడ్ మని తీసిన చప్పుడైంది. భానుమతి తలుపు తీసుకుని విసవిసా నడుచుకుంటూ వాళ్ళున్న చోటుకి వచ్చింది.

"ఏమిటత్తయ్యా? పొద్దున్నే ఈ గోలేమిటి? మేం పడుకోవాలా? వద్దా? మీరే చెప్పండి. తెల్లవారకుండానే మొదలు పెడతారు మీ భాగోతం! నిద్రపట్టక ఛస్తున్నాను. గోల ఆపండి" అంది విసుగ్గా, చిరాగ్గా మొహం పెట్టి.

"అదేంటి భానూ? అలా అనేస్తావు. మీ అత్తయ్య గొంతు ఎంతో శ్రావ్యంగా ఉంటుంది. వింటోంటే ఇంకా వినాలనే అనిపిస్తుంది. నేను చదవమంటేనే తను చదవడం మొదలుపెట్టింది" జానకి రామయ్య భార్యని వేనకేసుకొచ్చి అన్నారు.

"రెండు పుస్తకాలు కొనుక్కుని వేరువేరుగా మనసులోనే చదువుకోండి. ఇంట్లోవాళ్ళకి ఎలాంటి డిస్టర్బెన్స్ ఉండదు" ఎలా వచ్చిందో అలాగేవెళ్ళి తలుపు పెద్ద శబ్దం వచ్చేలా ధడేలుమని వేసుకుంది భాను. కోడలి రుసరుసలు వాళ్ళకి అలవాటే!

వసుంధర వంట మొదలెట్టింది. భాను ఇంకా లేవలేదు. ప్రసాదు కొడుకులిద్దరికీ బ్రష్ చేయించి స్నానం చేయించాడు. వసుంధర కాంప్లాను కలిపి ఇచ్చింది. వాళ్ళ స్కూలు టైము అయిపోతున్నా భాను లేవలేదు. పెద్దవాడు వివేక్ ఎనిమిదేళ్ళవాడు. చిన్నవాడు సాత్విక్‌కి ఆరేళ్ళు. స్కూలు డ్రెస్ వేస్తుంటే పిల్లలు అల్లరి మొదలెట్టేరు.

"పొండర్రా, నేను ఈ పన్లు చెయ్యలేను. మీ అమ్మని లేపి చేయించుకోండి" అని పిల్లల్ని కసురుకున్నాడు ప్రసాదు.

"అమ్మా! అమ్మా!" అని అరుస్తూ గదిలోకి వెళ్ళి భానుని కుదిపి లేపాడు వివేక్. భాను నిద్రమత్తు కాస్త వదిలిపోయింది.

"అబ్బబ్బ. తెల్లవారితే చాలు ఒక్కొక్కరు ఒక్కొక్కలాగ విసిగించేస్తున్నారు. ఈ ఇల్లు ఒక నరకం అయిపోయింది నాకు. హాయిగా కంటినిండా నిద్రపోదామంటే ఈ గోల ఒకటి!" అంటూ లేచింది భాను. ఏ పనీ చెయ్యకుండా రాత్రి ఒంటిగంటదాకా టి.వి. సీరియల్స్ అన్నీ చూసి పడుకుంటుంది భాను. పొద్దున్న ఎనిమిది దాటినా నిద్రలేవదు. పిల్లలిద్దర్నీ స్కూలుకి పంపించే బాధ్యత ప్రసాద్, వసుంధరల మీద పడింది. అప్పటికీ వసుంధర సగం వంట పూర్తి చేసింది. ఆవిడ ఇంటిపని, వంటపని చేసుకోలేక అలసిపోతున్నది.

కోడలు ఇంటిపని వంటపనిలో తనకి సహాయం చేస్తే బాగుండును అని మనసులో అనుకుంటుంది. కాని పైకి అనడానికి ధైర్యం చాలదు.

"అత్తయ్యా! వంట అయిందా? పిల్లలకి అన్నాలు పెట్టి స్కూలుకి పంపించాలి. కేరేజీలు కట్టాలి కదా? " అంటూ హడావుడిగా

# లండన్‌లో మామిడి టెంకలు

నిన్నటి నిజం

ఇది ఓ యాభైఏళ్ల కిందటి మాట. అనంతపురం నడిబొడ్డున గడియార స్తంభానికి ఈశాన్య దిశలోని మైదానంలో బస్‌స్టాండు నిర్మాణంకోసం శంకుస్థాపన కార్యక్రమం జరుగుతోంది. ఆ స్థలం మున్సిపాలిటీది. దాని నిండా కంపచెట్లు. దానికితోడు ఒకపక్క కమలానగర్, మరోపక్క గుల్జార్‌పేటలోని జనాలకు బహిర్భూమి కూడా ఆ స్థలమే.

ఆ కార్యక్రమానికి నాటి రాష్ట్ర ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి, కోస్తాలో రాష్ట్ర కాంగ్రెస్ సీనియర్ నాయకులు అల్లూరి సత్యనారాయణరాజు ముఖ్య అతిథులు. సత్యనారాయణరాజు ఆనాడు చెప్పిన ఓ సంఘటన నేటికీ మరువలేనిది.



రాజుగారూ, రెడ్డిగారూ ఓసారి లండన్ సందర్శించారు. సాయంవేళ తమ విడిదికి దగ్గరలో బయట తిరిగిరావడానికి వెళ్లారు. తాము బస చేసిన హోటలుకు అనుబంధంగా ఉన్న షాపులో బంగరు రంగు మామిడిపళ్ళు కన్పించాయి. వెంటనే ఇద్దరూ చెరో పండు కొన్నారు. కొన్నదే తడవు నోటికి పని చెప్పారు. వాటిని ఆస్వాదిస్తూ ఫుట్‌పాత్‌పై వెళుతున్నారు. ఇంతలో పండ్లలోని గుజ్జు, రసమూ తరిగిపోయాయి. చేతిలో టెంక, తొక్కలు మాత్రమే మిగిలాయి. వాటిని ఎక్కడ పారేయాలోనని చుట్టూ చూశారు.

మామిడి పళ్లనేమో తిన్నారుకానీ ఈ టెంకను వదిలించుకొనే మార్గం ఎక్కడా కనబడకపోయేసరికి ఆందోళన మొదలయింది. దేశంకాని దేశంలో వాటిని ఎక్కడ పారేయాలోననే ఆలోచనలో పడ్డారు. ఆ ఏరియాలో ఎక్కడా చెత్తకుప్పగానీ, చిదుగుగానీ కనబడలేదు. తొక్కను కూడా తినేస్తే ఆ తర్వాత టెంకను ఎలాగోలా వదిలించుకోవచ్చని అనుకున్నారు. అయితే ఆ టెంకను వేయడానికి కూడా సరైన స్థలం కనిపించలేదు. కారణం లండన్‌లోని ఆ రోడ్లన్నీ నీళ్ళతో కడిగినట్లు అద్దంలా మెరుస్తున్నాయి. మామిడి టెంకలు వేయడానికి స్థలం వెదుక్కుంటూ చాలాదూరం వెళ్లారు. ఒకచోట కంచె నడుమ పెరిగిన చెట్టు బోదె చుట్టూ దుబ్బు ఉండటం చూశారు. ఇద్దరూ గబగబా వెళ్ళి టెంకలను ఆ దుబ్బులోనికి వేసి, పీడ వదిలిందన్నట్టు నిట్టూర్చారు. తర్వాత వెనుతిరిగితే ఒక ఆడమనిషి తమనే చూస్తుండటంతో గుండె గుభేలుమంది. ఆమె వారివైపు చూస్తూ 'ఇండియన్స్' అని అవహేళనగా ప్రశ్నించింది. వెంటనే ఆమె తన బ్యాగు నుంచి కర్చీఫ్ తీసి ఆ టెంకలను దాంట్లోకి వేసుకుంది. దాన్ని చుట్టచుట్టి బ్యాగులో వేసుకుని పోయింది. 'ఈ టెంకలతో ఆమెకేమి పని?' అని మొదట సంశయించి ఆమె వెంటే వెళ్లారు. దూరంగా ఉండే చెత్త కుండీలో ఆమె వాటిని కట్టిన రుమాలును పడవేయడం చూశారు. పరిసరాల పరిశుభ్రత కోసం తన కర్చీఫ్‌ను ఆమె త్యాగం చేసిందని అర్థమైంది.

అల్లూరి సత్యనారాయణరాజు ఈ సంఘటనను వివరిస్తూ - 'ఇదీ ఆ దేశపు పౌరుల బాధ్యతాయుత దృష్టి. తమ పరిసరాల పరిశుభ్రతకోసం వారు తమవంతుగా కృషి చేస్తారు. మున్సిపాలిటీలు ఏమి చేస్తున్నాయని ప్రశ్నిసామేగానీ మనవంతు పౌర బాధ్యతను మనం చేయం. ఇదెందుకు చెబుతున్నానంటే ఈ మున్సిపల్ మైదానాన్ని నేటివరకూ మరుగుదొడ్డి చేసుకున్నారు. బస్‌స్టాండు నిర్మాణం తరువాతైనా ఈ పాత అలవాటును మార్చుకొని దీన్ని పరిశుభ్రంగా ఉంచుకుంటారని ఆశిస్తున్నాను' అన్నారు.

వచ్చింది భాను.

"అవుతున్నాదమ్మా. ఇదుగో స్నానం చేసి దేవుడి పూజ చేసుకుని, మావయ్యగార్కి కాఫీ ఇచ్చి వంట మొదలెట్టేను. అవ్వాలికదా.. నేనేం చెయ్యను?" అంది వసుంధర.

'నువ్వొచ్చి కొంచెం సాయం చెయ్యొచ్చు కదా?' అని అందామనుకుంది ఆవిడ. కాని భాను జవాబు తెల్సు.

'అంత పొద్దున్నే నేను లేవలేను అత్తయ్యా!' అనేస్తుంది. లేకపోతే 'రాత్రి టి.వి. ప్రోగ్రాంలు చూసి పడుకునేసర్కి లేటయింది!' అంటుంది. అందుకే ఆవిడ ఊరుకుంది.

'టీవీ ప్రోగ్రాంలు రాత్రి చూడ్డం మానేసి తొందరగా పడుకుంటే పొద్దున్న తొందరగా లేవచ్చు కదా! పిల్లలిద్దరినీ రెడీ చెయ్యాలి కదా?' అందామనుకుంటుంది. కానీ ఈ సంభాషణ పెద్ద గొడవకి దారి తీస్తుందని భయపడి ఇక మాట్లాడదు.

"రాత్రి ఆలస్యంగా పడుకోవడం ఎందుకు? తొందరగా పడుకుంటే పొద్దున్న తొందరగా లేవచ్చు కదా అంటారేమో... నేనెందుకు ఆలస్యంగా లేస్తున్నానో మీ అబ్బాయినే అడగండి" కొంత దూరం వెళ్ళి మళ్ళీ వెనక్కి వచ్చి ఆ మాట అనేసి చక్కాపోయింది భాను.

నవ్వాలో, ఏడవాలో తెలియలేదు ఆవిడకి. మనసులో అనుకున్నవి కోడలు చదవగలదేమో అనిపించింది.

అంటే తప్పంతా ప్రసాదు మీదకి తోసేస్తున్నాదన్న మాట. మహా తెలివైనది. నవ్వు వచ్చింది ఆవిడకి.

ప్రసాదు కోర్టుకి వెళ్ళిపోయాడు. పిల్లలు స్కూలుకి వెళ్ళిపోయారు. భాను బాత్రూంలో దూరింది. స్నానం చేసి గదిలోకి వెళ్ళింది. బట్టలు మార్చుకుని, పౌడరు రాసుకుని వస్తుందేమోనని చూసింది ఆవిడ. భాను ఎంతసేపైనా గదిలోంచి ఇవతలకి రాలేదు. ఆమె వస్తే ముగ్గురూ కల్సి భోంచేద్దామని ఎంతోసేపు ఎదురు చూసారు. ఎంతసేపటికీ ఆమె రాకపోతే వసుంధర తలుపు కొట్టింది నెమ్మదిగా.

"ఎందుకు తలుపు కొట్టారు?" తలుపు తీసి అరిచినట్టుగా అడిగింది భాను. వాళ్ళిద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. జానకిరామయ్య తలుపు కొట్టొద్దని చెప్పినా ఆవిడ వినలేదు.

"మంచి సస్పెన్స్ నవల చదువుతున్నాను. తలుపు చప్పుడైతే హడలిపోయేను. ఎవరో అనుకున్నాను. మీరా!" అనేసి మళ్ళీ తలుపు వేసుకుంది భాను. దంపతులిద్దరికీ నోట మాట రాలేదు.

వాళ్ళిద్దరూ భోజనాలు చేసి, డైనింగు టేబుల్ సర్దేసి, భానుకోసం కంచం పెట్టి వచ్చేరు. మాత్రలు వేసుకుని, మంచినీళ్ళు తాగి తమ గదిలోకి వెళ్ళి పడుకుంది వసుంధర. భాను ఒంటిగంటకి ఇవతలకి వచ్చింది. అప్పుడు భోజనం చేసి టేబుల్ మీద తనుతిన్న కంచం కూడా ఎత్తకుండా టి.వి. వెళ్ళి ముందు కూర్చుంది. మధ్యాహ్నం ప్రసాదు ఇంటికొచ్చినా భాను టి.వి. ముందునించి లేవలేదు. వసుంధర ప్రసాదు కోసం టిఫిన్ రెడీ చెయ్యసాగింది. ప్రసాదు ఏ అవసరం వచ్చినా అమ్మనే అడుగుతాడు. అన్నింటికీ అమ్మ మీదే ఆధారపడతాడు.

"నీ పెళ్లాన్ని వడ్డించమని చెప్పరా!" అంటే ఉలకడు- పలకడు. జవాబు చెప్పడు.

'నువ్వు వడ్డిస్తావా? నన్ను వడ్డించుకోమంటావా?' అని అడుగుతాడు పైగా.

రాత్రి తండ్రితోపాటే ఈటీవీ2 న్యూస్, స్టార్ న్యూస్ చూస్తాడు. అది అయిపోయాక తండ్రీకొడుకులిద్దరూ ప్రస్తుతం ప్రపంచంలో జరుగుతున్న ఎన్నో రాజకీ

# కుందేలు తిండి అంటే..?

అమెరికాలో ఆరోగ్యాన్ని దృష్టిలో పెట్టుకుని శాకాహారాన్ని భుజించేవారు బాగా పెరిగారు. హాలీవుడ్‌లో కూడా శాకాహారులు అధికమయ్యారు. బిల్ క్లింటన్ కూతురు చెల్సియా క్లింటన్ కూడా శాకాహారిగా మారింది. జూలై 31, 2010న జరిగిన ఆమె పెళ్ళిరోజున శాకాహార విందునే ఇవ్వాలనుకుంది. కానీ చివరికి మాంసాహారం కూడా ఏర్పాటు చేయించాల్సి వచ్చింది. ఎందుకంటే మాంసాహారులు శాకాహారాన్ని 'కుందేలు భోజనం' అని వెక్కిరిస్తారు. కుందేలు పచ్చగడ్డి తింటుంది కదా!

'ఇటాలియన్ ఇంటికి భోజనానికి వెళితే ఇండియన్ భోజనం పెట్టరుగా? అలాగే అమెరికన్ మాజీ అధ్యక్షుడి కూతురి వివాహానికి వస్తే, మేం తినే మాంసాహారమే పెట్టాలి' అని ఆహ్వానితులు కోరుకుంటున్నారని చెల్సియాకి సన్నిహితులు నచ్చజెప్పడంతో మాంసాహారం ఏర్పాటు చేయక తప్పలేదట. అదీకాక కేవలం శాకాహారం సరఫరా చేసే కేటరర్స్ అమెరికాలో తక్కువ. రెండు వందల మందికి మించి ఆర్డర్ ఇస్తే వారు శాకాహారాన్ని చక్కగా వండలేరు.



కాలిఫోర్నియాలోని పేటలూమాకి చెందిన సిసీలియా కింజీ అనే ఆమె పెళ్ళిళ్లకి శాకాహారం సరఫరా చేస్తూ ఉత్తమ కేటరర్‌గా అమెరికాలో గుర్తింపు పొందింది. చెల్సియా పెళ్ళిలో శాకాహారం కోరుకునే వారికోసం ఈమె ప్రత్యేకంగా వండి వడ్డించింది.




# బతికి ఉన్నట్లు సర్టిఫికెట్!

అమెరికాలోని వెస్ట్ న్యూయార్క్‌కు చెందిన కార్ల్ హెస్ అనే 78 ఏళ్ళ వృద్ధుడు గత ఏడాది జులై 27న తన డాక్టర్ దగ్గరకి సంవత్సరాంతం చెకప్‌కి వెళ్ళాడు. అయితే అతని మెడికేర్ ఇన్సూరెన్స్ నెలక్రితం ఎక్స్‌పైరీ అయిపోయిందని, కాబట్టి తను చెకప్ చేయలేనని డాక్టర్ చెప్పాడు. వెంటనే మెడికేర్‌ని సంప్రదిస్తే అతనికి ఆశ్చర్యకరమైన విషయం తెలిసింది. జులై 5, 2010న అతను మరణించినట్టుగా ప్రభుత్వ రికార్డులన్నిటిలోనూ నమోదైంది. సోషల్ సెక్యూరిటీ ఆఫీస్, డ్రైవింగ్ లైసెన్స్ జారీచేసే ఆఫీస్‌లకు కూడా అతను మరణించినట్లుగా జనన మరణ కార్యాలయం నుంచి సమాచారం అందినట్లు తెలిసింది. వెంటనే అతను ఆ కార్యాలయాన్ని సంప్రదిస్తే ఈ పనిచేసిన జేన్‌జెంక అనే ఆఫీసర్ ఈ తప్పుకు సంజాయిషీ చెబుతూ, 'ఇలాంటి పొరపాట్లు అసాధారణమైనా, అరుదైనవి కావు. త్వరలో మీ సమస్యని పరిష్కరిస్తాం' అంది.




తను బతికే ఉన్నానని అప్లికేషన్ పెట్టుకుని, డాక్టర్ నుంచి ధ్రువీకరణ పత్రాన్ని పంపమని ఆమె కోరింది.

యాలమీద, అన్యాయాలు- అక్రమాల మీద చర్చించుకుంటారు. ప్రపంచంలో ఎక్కడేది జరిగినా తండ్రీకొడుకులు చాలా శ్రద్ధగా, ఆసక్తిగా విని అంతటితో వదలకుండా అదేదో తమ స్వంత కుటుంబ విషయం అన్నట్టు సుదీర్ఘంగా వాదించుకుంటారు. ఒక్కొక్కసారి వసుంధరకి వాళ్ళ సీరియస్ డిస్కషన్సు వింటూంటే భయం వేస్తుంది. చిలికి చిలికి గాలివాన అయినట్టు అది దేనికి దారి తీస్తుందోనని ఆమె భయం. అలాంటప్పుడు ఆవిడ అక్కడ ఉండదు. లేచి గదిలోకి వెళ్ళిపోతుంది.

తండ్రీకొడుకుల గురించి ఆలోచిస్తూనే టిఫిన్ తయారు చెయ్యడం పూర్తి చేసింది. డైనింగు టేబుల్ మీద ఎంగిలి కంచం కనిపించింది. అలాంటి పన్లు ఆమెకు నచ్చవు. ప్రసాదు చూసి కూడా చూడనట్టు ఊరుకుంటాడు. ఏదీ పట్టించుకోడు. ఏమన్నా అంటే కయ్యిమని అంతెత్తు లేస్తుంది భాను ఇరుగు-పొరుగు అందరికీ వినబడేలా! అందుకే ఆవిడే కంచాన్ని తీసి పెరట్లో పడేసి టేబుల్ శుభ్రం చేసింది. ప్రసాదు టిఫిన్ తిని కోర్టుకెళ్ళిపోయేడు.

"భానూ! టిఫిన్ తినడానికిరా. మావయ్యగారికి టిఫిన్ ప్లేటు తీసుకెళ్ళి ఇయ్యి" అందావిడ.

భాను టి.వి. ముందునించి లేచి మావగారికి టిఫిన్ తీసుకెళ్ళి ఇచ్చింది. "మంచి నీళ్లు ఇయ్యమ్మా" అన్న అతని మాటలకి అయిష్టంగానే ఒక గ్లాసుతో మంచినీళ్లు తెచ్చిచ్చి మళ్లీ టి.వి. ముందు కూర్చుంది.

వసుంధర అంతా చూస్తున్నది. ఆవిడ నిట్టూర్చింది. అన్నీ సహించి భరించగలగడం అలవాటు చేసుకుంది ఆవిడ.

'అయినా సహనానికీ ఒక హద్దు అంటూ ఉంటుంది కదా?' అని ఆయన అంటారు! ఏం చెయ్యడం?

ఆమె మనసు బాధగా మూలిగింది.

కోడలు వస్తే ఇంటి బాధ్యతలు, వంటింటి బాధ్యతలు కోడలు చూసుకుంటుంది అని, అత్తగారిని కూర్చోపెట్టి అన్నీ అమరుస్తుందని తనెన్నో కలలు కన్నది. తనేకాదు చాలామంది అత్తగార్లు అలాంటి కలలు కంటారేమో?! అత్తగార్లు ఎవరూ ఎప్పుడూ కూడా ఇహమీదట అలాంటి ఆశలు పెట్టుకోవద్దని చెప్పాలనిపించింది ఆవిడకి. వసుంధరకి ఎందుకో భానుమీద కోపం రాలేదు. భాను తల్లిమీద కోపం వచ్చింది. పిల్లలకి చదువుకొమ్మని చెప్తే సరిపోదు. రేపు అత్తవారింటికి వెళ్లాక అందరితో ఎలా మాట్లాడాలి, ఎలా మసలుకోవాలి, వాళ్లందరితో ఎలా ప్రవర్తించాలి? ... అత్తవారింటికి వెళ్లేక ఆ అమ్మాయి బాధ్యతలు ఏమిటి? హక్కులు ఏమిటి? ... ఇవన్నీ తల్లి నేర్పి పంపాలి! ఏదో పిల్లల్ని కనేసాం, పెంచేసాం, పెళ్లి చేసేసాం అంటే సరిపోదు. చదువుతో పాటు సభ్యత- సంస్కారం కూడా వాళ్లకి నేర్పాలి. భాను తల్లిలాంటివాళ్లు కొంత మంది ఉంటారు! అత్తవారిల్లు అంటే ఒక భయంకరమైన నరకమని, అత్తగారు బ్రహ్మరాక్షసి అని, మావగారు మాంత్రికుడిలాంటివాడని, ఆడబడుచు దయ్యమని, భర్త తప్ప అత్తవారి వైపు మిగతా వాళ్లంతా తమ శత్రువర్గంలోని వారేనని చిలక్కి చెప్పినట్టు చెప్పి, లేనిపోని చేదు ఊహల్ని తమ ఆడపిల్లల్లో కలిగిస్తారు! ఫలితాలు ఎంత దారుణంగా ఉంటాయో వాళ్లు ఊహించలేరు! ప్రేమతో, అభిమానంతో దగ్గరవుతే అది ఎంత సంతోషదాయకంగా ఉంటుంది! కాని చాలా కుటుంబాలలో అలా జరగడం లేదు. అత్తగారు, మావగారు అంటే జీతం లేని నౌకర్లు అనుకుంటారేమో కోడళ్లు!? ... వసుంధర ఆలోచనలు అలా సాగిపోతున్నాయి. ఎడతెగని ఆలోచనలతో ఆవిడ బుర్ర పాడయిపో

తోంది.

భాను మాత్రం ఎవరితో ఎటువంటి సంబంధం లేనట్టు టి.వి. చూస్తూ కూర్చుంది. వసుంధర ఆలోచనల్లోంచి తేరుకుని లేచింది. అప్పటికి సంధ్య చీకట్లు నలువైపులా కమ్ముకుంటున్నాయి. ఆవిడ స్నానం చేసి దేవుడి దగ్గర దీపాలు వెలిగించి, దేవుడి శ్లోకాలన్నీ చదివి పూజ పూర్తి చేసి, హారతిచ్చి లేచింది. తర్వాత వంట మొదలుపెట్టింది. భాను సాయం కోరాలనుకుంది.

"భానూ! ఫ్రిజ్‌లో వంకాయలున్నాయి. కొంచెం తరిగిపెట్టు" అందావిడ. భాను విసుగ్గా లేచి ఫ్రిజ్‌లోంచి వంకాయిలు తీసి తరగడం మొదలు పెట్టింది. ఒకముక్క పెద్దగా, ఒకముక్క చిన్నగా, పుచ్చులు కూడా చూసుకోకుండా తరిగేసింది. వసుంధర ఆ తరగడం చూసి కంగారుపడింది. ఇంకా నయం తను చూసింది కాబట్టి సరిపోయింది.

"భానూ...!" కంగారుగా పిలిచింది.

"ఏంటత్తయ్యా?"

"అదేంటమ్మా అలా తరిగేవు. అన్నీ పుచ్చులతో తరిగేసేవు. చూసుకోవద్దా!" నెమ్మదిగానే అంది ఆవిడ.

దాంతో భాను మూతిముడుచుకుని లేచింది.

"నేను ఏ పని చేసినా ఏదో ఒకవంక పెడతారు! అందుకే నాకు ఏ పని చెయ్యడానికి ఇష్టం ఉండదు. మీరు చేసిన పనుల్లో నేను వంకలు పెడుతున్నానా చెప్పండి? అయినా నాకు కూర తరగడం రాదు, మా ఇంట్లో మా అమ్మ నన్ను ఎంతో అపురూపంగా పెంచింది. ఏనాడూ ఇలాంటి పన్లు నాకు చెప్పలేదు!" అంది నిష్ఠూరంగా.

"నేను మాత్రం ఎప్పుడైనా చెప్పేనా? తొమ్మిది సంవత్సరాలైంది నీ పెళ్లయి! నేను నీకు ఏ పనీ చెప్పలేదు. ఇంటి పనంతా నేనే చేసుకుంటున్నాను. అయినా అందరికీ పుట్టుకతో ఏ పన్లూ రావమ్మా. అవసరం వచ్చినప్పుడు వాళ్లని, వీళ్లని చూసి నేర్చుకోవాలి. మాట్లాడ్డం కూడా..." అంటూ ఆగిపోయింది.

"అంటే నాకు మాట్లాడ్డం రాదనేకదా మీ ఉద్దేశం. నేను ఈ ఇంట్లో అడుగుపెట్టిన నాటినుంచి చూస్తున్నాను. అందరూ ఏదో విధంగా నన్ను ఆడిపోసుకుంటున్నవాళ్లే!" ఏడుపు మొదలెట్టింది భాను.

ఇంతలో ప్రసాదు వచ్చేడు. ఎవరితోనూ ఏమీ మాట్లాడకుండా తన గదిలోకి వెళ్లిపోయేడు.

భాను కూడా గదిలోకి వెళ్లిపోయింది.

**కొత్తగాలి...**

**అందలమెక్కిన**
**అవినీతి**
**అడ్రస్ లేని**
**నీతి, నిజాయితీ**

– పినిశెట్టి లక్ష్మీశారద, రాజమండ్రి

వసుంధరకి భయం పట్టుకుంది భాను ఏమైనా చెప్పేస్తుందేమోనని. ఆవిడకి ఒక్కసారిగా నీరసం, నిస్పృహ ఆవరించాయి!

★ ★ ★

భాను చాలా అందంగా ఉంటుందని ఏరికోరి చేసుకున్నాడు ప్రసాదు. బాహ్యా సౌందర్యంకన్నా హృదయసౌందర్యం ముఖ్యం అని ఎంత చెప్పినా ఆనాడు వినలేదు! ఇప్పుడు వాడితోసహా ఇంట్లో అందరూ అనుభవిస్తున్నారు! ప్రతీరోజూ ఇంట్లో క్షణమొకయుగంలా గడుస్తోంది!

కాని వాళ్లకి తెలియని విషయం,

ఊహించలేని విషయం ఒకటుంది. పెళ్ల యిన తర్వాత మొదటి రాత్రి అందంగా అలంకరించబడిన శోభనం గదిలోకి భాను పాల గ్లాసుతో అడుగుపెట్టింది. ప్రసాదు ఆమెకోసం వేయి కళ్లతో ఎదురుచూస్తు న్నాడు. భాను అపురూప సౌందర్యానికి ముగ్ధుడై చేసుకున్నాడతను. ఆమెను ఎంత తొందరగా తన కౌగిట్లో బంధించేద్దామా... ఎంత త్వరగా ఆమె ఎర్రటి పెదవుల్ని కొరి కేద్దామా... అని ఆత్రంగా ఉన్నాడు!

భాను లోపలికి వచ్చేక గభాలున వెళ్లి ఆమెను చేయి పట్టి తీసుకొచ్చి మంచం మీద తన పక్కనే కూర్చోబెట్టుకున్నాడు. భాను ముఖంలో నవ్వులేదు. ఆమె ముభా వంగా ఉంది.

"ఏం అలా ఉన్నావు భానూ? ఒంట్లో బాగాలేదా? " అడిగేడు.

"ఏంలేదు. ఒంట్లో బాగానే ఉంది."

"మరెందుకలా ఉన్నావు? " ఆమె ముఖంలోకి పరీక్షగా చూస్తూ అడిగేడు.

"నాకీ పెళ్లి ఇష్టంలేదు" రపీమని అనే సింది భాను.

"అదేంటి? ఆ విషయం పెళ్లి చూపుల ప్పుడు ఎందుకు చెప్పలేదు? " ఆశ్చర్య పోతూ అడిగేడు ప్రసాదు.

"అమ్మానాన్నగారు నన్ను చెప్పనివ్వ లేదు. మీకు బోలెడు ఆస్తులున్నాయని, మీ అమ్మానాన్నలకు మీరొక్కరే కొడుకని, ఆస్తంతా మీకే వస్తుందని నన్ను ఒప్పిం చేరు."

"అయితే నేనంటే ఇష్టంలేదా? " డీలాపడి పోతూ అడిగేడు ప్రసాదు.

"నాకు నచ్చినవాడిని ప్రేమించి పెళ్లి చేసుకుందామనుకున్నాను. మగాళ్లలో నాకు నచ్చినవాళ్లు నలుగురు ఉన్నారు. అరవింద్, మోహన్, చైతన్య, రాంబాబు. వీళ్లలో ఎవర్ని చేసుకోవాలా అని ఆలోచి స్తుంటే నాన్నగారు నా ఆలోచనలు పసిగ ట్టినట్టుగా నన్ను పిల్చి మెత్తగా చీవాట్లు పెట్టేరు.

ఈ సంబంధం వదులుకోవడం బుద్ధి తక్కువ. వాళ్ల ఆస్తంతా నీకు, నీ పిల్లలకే వస్తుందే! పెళ్లి చేసుకోవడమే కాదు, అత నితో కాపురం కూడా చెయ్యాలి నువ్వు. తెల్సిందా! మరేం మాట్లాడకు అన్నారు" భాను కళ్లు చక్రాల్లా తిప్పుతూ చెప్తుంటే ప్రసాదుకి గుండెలో రైళ్లు పరుగెడుతు న్నట్టు అయింది. ఆమె మనసులో ఉన్నదంతా ఏదీ దాచకుండా అంతా చెప్పే స్తుంటే ఆమె అజ్ఞానానికి, అమాయకత్వా నికి నవ్వాలో, ఏడవాలో తెలియలేదు అత నికి! ఆమెమీద ఎందుకో జాలి కలిగింది. తర్వాత ఆమెను తన స్వంతం చేసుకోవడా నికి అతనికి ఎక్కువ సమయం పట్టలేదు.

"నాకు ఈ మొగుడు నచ్చలేదు. ఏం చెయ్యాలి? " అని ఆమె ఆలోచిస్తుండగానే ఇద్దరు పిల్లలు పుట్టేసేరు. పెళ్లయి అప్పుడే తొమ్మిది సంవత్సరాలు గడిచిపోయేయి!

★ ★ ★

భానుతో ఏమాట అన్నా తప్పే! ప్రసాదు పిల్లలిద్దరూ బొద్దుగా, ముద్దొస్తూ అచ్చం తల్లిపోలికలతో ఉంటారు. పెద్ద కొడుక్కి ప్రసాదు తండ్రి జానకిరామయ్య పేరు పెట్టాలి అంటే భాను ఒప్పుకోలేదు. పెద్ద వాడికి వివేక్, రెండోవాడికి సాత్విక్ అని తనే పేర్లు పెట్టింది. తన మొగుడు తనిష్ట ప్రకారమే నడవాలి అంటుంది. కాని ప్రసాదు, భాను మాట వినడు. అందుకే మొగుడంటే కోపం ఆమెకి.

రాత్రి భోజనాలయ్యేక వివేక్ వసుంధర దగ్గరకొచ్చి, "మామ్మా! ఏదైనా కథ చెప్పవూ!" అన్నాడు.

పురాణాల్లోని ఒక పిట్ట కథ గుర్తొచ్చి చెప్పడం మొదలెట్టింది. ఇంతలో భాను గబగబా వచ్చి కొడుకుని లేవదీసి చెంప ఛెడేలుమనిపించింది. "ఏంట్రా! తిక్కవే

# బళ్లారి రాఘవ సమయస్ఫూర్తి

అస్మదీయ నిజం

బళ్లారి రాఘవ నటసార్వభౌముడు. నటనకు నిర్వచనం అంటే రాఘవ అనవచ్చు నటనను ఒక కావ్యంగా అభ్యసించిన మనిషి - కళగా తీర్చిది ద్దిన మనీషి. నాటకాల్లో నటించే సమయంలో పాత్రలో జీవించేవాడు. కాని తనను తాను మరచి ఇబ్బందులను కొనితెచ్చుకొనేవాడు కాదు.



విజయవాడలో 'చంద్రగుప్త' నాట ప్రదర్శనలో ఒక విచిత్రం జరిగింది. ఆరోజు నాటకంలో చంద్రగుప్తుని తల్లి 'ముర' వేషాన్ని స్థానం నరసింహరావు ధరించారు. అది తెలుసుకొన్న విజయవాడ ప్రజలు నాటక ప్రదర్శనశాలకు గుంపులు గుంపులుగా వచ్చారు. బళ్లారి రాఘవ చాణుక్యుడి పాత్ర ధరించారు. చంద్ర గుప్తుణ్ణి దీవించి యుద్ధానికి పంపే ఘట్టం వచ్చింది. చాణుక్యుడు చంద్రగుప్తునికి నుదుట తిలకం దిద్ది దీవించాలి. చాణక్య పాత్రధారి రాఘవ తిలకం భరణి కోసం తన చంకలోని జోలెలో చెయ్యివేసి వెదికాడు. కానీ దొరకలేదు. అతడెదుర్కొన్న పరిస్థితి ఆ దృశ్యంలో తోటి నటులకు ఇబ్బందిగా తోచింది. జనాలంతా ఉత్కంఠగా చూస్తున్నారు. కానీ చాణుక్యుని పాత్ర ధరించిన రాఘవ ఎంతమాత్రం తొణకలేదు. తన ముఖాన ఉన్న కుంకుమనే తన చేతితో తీసి చంద్రగుప్తునికి తిలకం దిద్ది దీవించాడు. రాఘవ ప్రదర్శించిన సమయస్ఫూర్తిని చూసి ఆనందంతో ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు.

షాలు? నిన్నెవడు రమ్మన్నాడిక్కడికి? " అంటూనే వసుంధరవైపు గుర్రుగా చూసింది.

"మీరు ఇలాంటి కాకమ్మ కథలు, పురాణ గాథలు వాడికి చెప్పకండి. ఇప్పుడు రోజులు మారిపోయాయి. ఇప్పటి పిల్లలకి అలాంటి కథలు ఏమాత్రం ఉపయోగం ఉండవు!" అనేసి తన గదిలోకి తీసుకెళ్లిపోయింది కొడుకుని తీసుకుని.

వసుంధర హతాశురాలైంది. కోడలి మాటలకి ఆవిడ ముఖం నల్లగా మాడిపోయింది. జానకిరామయ్యగారు అంతా గమనిస్తూనే ఉన్నారు. మర్నాడు యథాప్రకారం తెల్లవారింది. తెల్లవారుతుందంటే చాలు ఆవిడకి భయం పట్టుకుంటున్నది. శుక్రవారం వచ్చిందంటే లలితా సహస్రనామాలు గట్టిగా చదివితేగాని ఆమెకి తృప్తిగా ఉండదు. కాని ఇప్పుడు లక్ష్మి అష్టోత్తరం గాని, లలితా సహస్రనామాలుగాని, త్రిశతి స్తోత్రం గాని ఏమాత్రం గట్టిగా చదివినా, భాను వచ్చి గొడవచేసి వెళుతున్నది.

ఆ రోజునించి ఆవిడ నిశ్శబ్దంగానే పూజ ముగిస్తున్నది.

"వసుంధరా! లలితా సహస్రనామాలు చదవడం లేదేం? " ఒకరోజు ఆయన అడిగేరు.

"అన్నీ తెలిసి అలా అడుగుతారేంటండి? " అందావిడ నిట్టూరుస్తూ.

"ఛ. అన్నింటికీ అలా భయపడిపోతే ఎలాగే? ఇది మన ఇల్లు. అదెవర్తి మధ్యన మనల్ని అడ్డుకోవడానికి!"

"పోనీలెండి. తను మన కోడలే కదా.

మనమే సర్దుకుపోతే సరి. మళ్లీ లేని పోనివన్నీ ప్రసాదుకి చెప్తే ఇంట్లో గొడవల వుతాయని నా బాధ!"

"ఎందుకలా బాధపడతావు? ఈ దేహం ఒక సాధనం. బాడీ ఈజ్ ది ఇన్‌స్ట్రుమెంట్ టు ఎటయిన్ ముక్తి! గెట్ రిడ్ ఆఫ్ అహంకార!

నేను ఎవరు? అన్నది మనం అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలని రమణ మహర్షి చెప్పారు. జీవుడికి, పరబ్రహ్మ స్వరూపానికి అహంకారం అన్నది అడ్డుగోడలాంటిది. అహంకారం మనిషిని అంధకారంలోకి నెట్టేస్తుంది. దానిలో పడకముందే మనం జాగ్రత్తపడాలి. నేను ఎవరు? అన్నది మనం తెల్సుకోవాలి. అంటే ఆ ప్రశ్న మనకి మనమే వేసుకోవాలి..." ఇంకా ఆయన చెప్పవల్సింది పూర్తికాలేదు.

"నేను ఎవరు అని తెలుసుకోవాలా? నేను... వసుంధరని"

"పిచ్చి మొహమా అది కాదే. నీలో ఉన్న ఆత్మని పరిశోధించాలి. నిన్ను నువ్వు తెలుసుకోవాలి!"

"ఏమిటండీ తెలుసుకునేది! తెల్లవారింది మొదలు రాత్రి పడుకునేదాకా ఇంటెడు చాకిరీ చేస్తూ, భయం భయంగా బతుకీడుస్తూ, ఎదురు చెప్పలేక ఏడ్చుకుంటూ, ఏమీ చేతకానిదానిలా పనికిరాని దానిలా కుళ్లి కుళ్లి ఏడవడమే నాకు తెలుసు. మొక్కకి పూచిన గడ్డిపూలు వాడి రాలిపోయినట్టే మన జీవితాలు కూడా ఆశానిరాశల మధ్య కొట్టుమిట్టాడుతూ ఉండడమే!" ఏడుపు వచ్చేసింది వసుంధరకి.

జానకిరామయ్య ఆవిడ్ని ఓదార్చారు.

"జీవితం అన్నది తామరాకుమీద నీటిబొట్టులాంటిది వసుంధరా! మన చేతులు, కాళ్ళు ఆడుతున్నంత కాలం మనం పనిచేయ్యాలి! పనిచేస్తూవుంటేనే ఒంటికి ఆరోగ్యం. దేవుడి పిలుపు వచ్చినప్పుడు ఈ బంధాలన్నీ తెంచుకుని ఎలాగూ వెళ్లిపోక తప్పదు. ఎవర్నీ నిందించే స్వభావం మనిషికి ఉండకూడదు"

"ఇవన్నీ వినడానికి బాగానే ఉంటాయి" అంటూ లేచింది వసుంధర.

★ ★ ★

జానకిరామయ్యగారు వీధి చావిట్లో ఈజీఛైర్‌లో కూర్చుని పేపరు తిరగేస్తున్నారు. తలుపు చప్పుడైంది. తలెత్తి చూసే సరికీ జ్యోతి అక్కడ నించొని ఉంది. తమ్ముడి కూతుర్ని చూడగానే ఆయన ముఖంలో ఉత్సాహం తొంగిచూసింది.

"రామ్మా జ్యోతీ! ఎన్నాళ్లయింది నిన్ను చూసి!"

"మీరెలా ఉన్నారు పెదనాన్నా? బాగున్నారా? "

"బాగానే ఉన్నానమ్మా. నువ్వెలా ఉన్నావు? మీ ఆయన బాగున్నాడా? నువ్వేమిటి ఇంత చిక్కిపోయేవు? "

"ఆc బావున్నాను" అంది జ్యోతి ముక్తసరిగా, నవ్వడానికి ప్రయత్నిస్తూ. కాని ఆమె ముఖంలో నీలినీడలు స్పష్టంగా కనిపించేయి ఆయనకి.

ఆమె తలమీద చేయివేసి ఆప్యాయంగా నిమురుతూ అన్నారు "ఇలా నా కళ్లలోకి చూసి చెప్పు తల్లీ. నేను విన్నది నిజమేనా? ఆదిత్య... ఇప్పుడు... ఇంటికి సరిగ్గా రావటం లేదట కదా? "

"పెద్దనాన్నా!" బావురుమంది జ్యోతి.

"అన్నీ వాటంతటవే సర్దుకుంటాయి లేమ్మా. బాధపడకు. మన చేతుల్లో ఏదీ లేదమ్మా"

"మనం ఇలా చేతులు ముడుచుకు కూర్చోబట్టే అతని ఆటలు సాగుతున్నాయి"

"నేనొకసారి అతనితో మాట్లాడతాను. నువ్వు ధైర్యంగా ఉండు"

కొంతసేపుండి వసుంధరని పలకరించి కాఫీ తాగి వెళ్లిపోయింది జ్యోతి. జ్యోతి

గతమంతా ఆయన కళ్లముందు మెది లింది!




ఆదిత్య లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్‌లో పనిచేస్తూ ఉండేవాడు. అప్పుడు జ్యోతి బి.ఇడి చదువుతూ ఉండేది. ఆమెకి బి.ఇడి అయ్యేక గవర్నమెంట్ గర్ల్స్ హైస్కూలులో టీచరుగా ఉద్యోగం వచ్చింది. జ్యోతి బి.ఇడి చదువుతున్నప్పుడే ఆదిత్యతో పరిచయం. పూర్ణచంద్రబింబంలాంటి ముఖం జ్యోతిది. వెన్నెల వెదజల్లే ఆమె సోయగాలు ఆదిత్యను విపరీతంగా ఆకర్షించేయి. అతను ఆమె వెంటపడ్డాడు!

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను జ్యోతీ! నీ ప్రేమకోసం ఏమైనా చేస్తాను" అన్నాడు ఆదిత్య. మగాడు కొంచెం ప్రేమిస్తే చాలు ఆడది అతని చుట్టూ లతలా అల్లుకుపోతుంది. చామనఛాయ అయినా కండలు తిరిగిన శరీరం. విశాలమైన నుదురు, నల్లటి ఉంగరాల జుట్టు, మనసుని గిలిగింతలు పెట్టే ఆ చూపులు... జ్యోతి కూడా ఆదిత్యను గాఢంగా ప్రేమించింది.

"నిన్ను, నీ ఆలోచనలను నా మనసు నిండా నింపుకుని నీ మీద ఆశతో జీవిస్తున్నాను జ్యోతీ!" అన్నాడు పార్కులో కూర్చుని ఆమె చేతివేళ్లు సవరిస్తూ. జ్యోతి అందంగా నవ్వింది. ఆ రోజు పార్కులో చుట్టుపక్కల ఎవరూ లేరు. ఆదిత్య ఆమెని దగ్గరకు తీసుకుని నడుం చుట్టూ చేయివేసి గాఢంగా గుండెలకి అదుముకుని భయంతో అదురుతున్న ఆమె పెదవులను తన పెదవులతో చేర్చి ముద్దుపెట్టుకున్నాడు. అది వాళ్లిద్దరికీ మొదటి ముద్దు. ఆదిత్య శరీరంలో వేడి ఆవిర్లు వస్తున్నట్టు అయింది. జ్యోతి పరిస్థితి కూడా అలాగే ఉంది. సిగ్గుతో తలెత్తలేకపోయింది. వాళ్లిద్దరూ ప్రేమించుకున్నారు!

ప్రేమకి అర్థాలు ఎన్నో! ప్రేమ మానసికమైనదా? శారీరకమైనదా? శారీరకమైన ప్రేమని నిజంగా 'ప్రేమ' అని అంటారా? ఆకర్షణ అంటారా? అసలు నిజమైన ప్రేమికులు ఈ సమాజంలో ఎంతమంది ఉన్నారు? !

ప్రేమ రెండు హృదయాలకి సంబంధించినది. కాని 'ప్రేమ' పవిత్రమైన మానసిక అనుభూతి అని చాలామందికి తెలీదు!

జ్యోతి, ఆదిత్య ఒకర్నొకరు కావాలనుకున్నారు. ప్రేమించుకున్నారు. ఒకరితో ఒకరు జీవితం పంచుకోవాలనుకున్నారు. ఒకర్నొకరు ఇష్టపడ్డారు. ఆ ఇష్టం, ప్రేమ ఎలాంటివి అంటే చెప్పడం కష్టం. ఎందుకంటే పెళ్లికి ముందు ప్రేమ చాలా మధురంగా ఉంటుంది. ఆ 'ప్రేమ' తీపి పూత పూసిన చేదు మాత్రలాంటిది. పెళ్లయిన కొన్నాళ్లకి తీపి కరిగిపోయి చేదు మిగుల్తుంది!

జ్యోతి, ఆదిత్య పెళ్లయిన రెండేళ్లదాకా చాలా అన్యోన్యంగా ఉన్నారు. జ్యోతికి ప్రపంచమంతా రంగుల హరివిల్లులా కనిపించసాగింది. నీలాకాశంలో ఎగిరే పక్షులు, మబ్బుల్తో దోబూచులాడే చంద్రుడు, సముద్రం మీదనించి తేలి వచ్చే తరంగాలు అన్నీ మనోహరంగా కనిపించసాగేయి. ఆదిత్యతో ప్రేమ, పెళ్లి అంతా తన అదృష్టంగా భావించసాగింది. ఇద్దరికీ అమ్మ, నాన్నలు లేరు. బాధ్యతలు లేవు.

జీవితం చాలా రమణీయంగా వుంది. పెళ్లి చేసుకుని తప్పు చేసానేమో అన్న భావం ఏ క్షణాన కలగకుండా ఆమెను అపురూపంగా చూసుకుంటున్నాడతను. అనకాపల్లినుండి విశాఖపట్నంకి స్కూటరు మీద ఇద్దరూ సినిమాలు చూడ్డానికి వచ్చేసేవారు. అలాగే కైలాసగిరికి, ఉడా పార్కుకి, రామకృష్ణ బీచ్‌కి, తొట్లకొండకి, ఎర్రమట్టిదిబ్బలు.. చూడ్డానికి వారానికొకసారి వచ్చేవారు. ఎక్కడికి వెళ్లినా ఎవరూ లేనిచోట కూర్చుని ఒకరి కళ్లలోకి మరొకరు తమకంగా చూస్తూ గంటల్ని క్షణాల్లా గడిపేవారు!

## కొత్తగాలి...



**అరణ్యం**
**కంటున్న**
**పీడకల**
**నగరం**

– కందాళై రాఘవాచార్య,
నిజామాబాద్

రెండు సంవత్సరాలు రెండు రోజుల్లా గడిచిపోయినట్టుంది! ఆదిత్యకి విశాఖపట్నం ట్రాన్స్‌ఫర్ అయింది. జ్యోతిది గవర్నమెంటు ఉద్యోగం. మానెయ్యడం ఇష్టం లేదు. ఆదిత్యకి విశాఖపట్నం వెళ్లక తప్పలేదు. రోజూ అప్ అండ్ డౌన్ చెయ్యాలంటే చాలా స్ట్రెయిన్‌తో కూడుకున్నపని! అందుకే ఆదిత్య వైజాగ్‌లోనే చిన్నపోర్షన్ అద్దెకి తీసుకున్నాడు. వారానికొకసారి అనకాపల్లి వెళ్లేవాడు. లేదంటే జ్యోతి వారానికొకసారి వైజాగ్ వెళ్లేది. ఆరోజు రాత్రి డాబామీద జ్యోతి ఒళ్లో తలపెట్టుకుని పడుకున్నాడు ఆదిత్య.

నింగిలోని చుక్కలన్నీ నేలమీదకు జారుకున్నట్టుగా అనిపిస్తున్నాయి. వంగిన కొబ్బరాకుల సందుల్లోంచి, చంద్రుడు అందరికీ కనబడాలని విశ్వప్రయత్నం చేసి ఓడిపోతున్నాడు. మబ్బులు అతని ఆటలు సాగనివ్వడం లేదు. మేఘాలు, కొబ్బరాకులు అడ్డొచ్చినా కాస్సేపటికి విజయం సాధించి, 'నన్ను చూడు, నాఅందం చూడు' అన్నట్టు స్పష్టంగా కనిపిస్తూ విజయగర్వంతో ముందుకు సాగిపోతున్నాడు చంద్రుడు.

"జ్యోతీ!" ఆదిత్య గొంతులో ఏదో మత్తు వుంది.

జ్యోతి అతని జుట్టులోకి వేళ్లుపోనిచ్చి సవరిస్తూ "ఊ" అంది భర్తని మురిపెంగా చూసుకుంటూ.

"నువ్వు నాకు బాబుని ఎప్పుడిస్తావు?" అతను సరదాగా అడిగినా జ్యోతి ఎందుకో గతుక్కుమంది. ఇంత అందమైన ఆహ్లాదకరమైన వాతావరణంలో అతను ఆ ప్రస్తావన తేవడం ఆమె మనసులో ముల్లు గుచ్చుకున్నట్లయింది.

"పాల బుగ్గల పసిపాపలు బుడిబుడి అడుగులతో తప్పటడుగులువేస్తూ వచ్చీరాని ముద్దు ముద్దు మాటలతో మురిపిస్తూ ఉంటే ఆ ఆనందమే వేరు! కాదంటావా జ్యోతీ!"

"ఆఁ ఆఁ... అవును!" అంది తడబడుతూ.

"జ్యోతీ! ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"ఆహఁ. ఏం లేదు"

"మనం రేపు డాక్టరు దగ్గరకెళ్తున్నాం, పిల్లలు ఎప్పుడు పుడ్తారో కనుక్కోవడానికి!" జ్యోతి అయోమయంగా చూసింది.

"ఇప్పుడెందుకండీ టెస్టులు.. అవీను!" అంది ఏం చెయ్యాలో తెలీక.

ఆమెను మరి మాట్లాడనివ్వలేదు, ఆమెను ఊపిరిసలపనంతగా కౌగిట్లో బంధించి, తమకంతో ముద్దుల వర్షం కురి

పించి.. ఆపై ఇంకా ప్రాసీడైపోయేడతను!

ఆ సమయంలో జ్యోతికి ఈ సుఖం, సంతోషం తాత్కాలికం అన్న అనుమానమే కలగలేదు. మర్నాడు ఇద్దరూ వైజాగ్‌లో ఉన్న ప్రముఖ డాక్టరు దగ్గరకు వెళ్లేరు. హాస్పిటల్లో ఇద్దరికీ రకరకాల టెస్టులు చేసారు. మర్నాడు రిపోర్ట్సు ఇస్తామన్నారు. రెండు రోజుల తర్వాత ఆదిత్య హాస్పిటల్ కి వెళ్లేడు.

"సర్! మీ రిపోర్ట్సు అన్నీ నార్మల్ గా ఉన్నాయి. కాని మీ శ్రీమతికి సంతాన యోగం లేదని చెప్తున్నందుకు సారీ. ఆమె గర్భాశయం గర్భం దాల్చటానికి అనువుగా లేదు. అసలు ఆమె గర్భాశయం తొలగించడం మంచిదని నా అభిప్రాయం. ఆపైన మీ ఇష్టం. ఈ విషయం ఆమెకు నెమ్మదిగా చెప్పండి" అని డాక్టరు చెప్పగానే ఆదిత్య రెండు నిముషాలు అచేతనంగా ఉండిపోయేడు. మనసంతా అసంతృప్తితో నిండిపోయింది. అనకాపల్లి వెళ్లాలనిపించలేదు. తర్వాత రిపోర్ట్సు గురించి జ్యోతి ఎన్నిసార్లు అడిగినా అతను చెప్పలేదు.

అలా చూస్తూండగానే మూడు నెలలు గడిచిపోయేయి. అప్పుడే వాళ్ల జీవితాల్లో అనూహ్యమైన మార్పు జరిగింది!

ఒకరోజు జ్యోతి స్నేహితురాలు విజయ అనకాపల్లి వచ్చింది.

"జ్యోతీ! నీకీ విషయం ఎలా చెప్పాలో నాకర్థం కావడంలేదే!" అంది విజయ.

"ఏమిటి సంగతీ? " అంది జ్యోతి.

"ముందు నేనడిగిన జవాబు చెప్పు" మళ్లీ అంది విజయ.

"ఏ విషయమే! ఏమిటి నువ్వు వర్రీడ్‌గా ఉన్నావు? "

"ఆదిత్య ఇంటికి వస్తున్నాడా? నిజం చెప్పు? "

"లేదు. ఈ మధ్య రావడం లేదు. సెలవు లేదంటున్నాడు" అంది జ్యోతి.

"జ్యోతీ! నీకీ విషయం తెలీదు. తెలిస్తే బాధపడతావని నేను చెప్పలేదు. ఈమధ్య మీ ఆయన ఎవరో అమ్మాయిని వెంటేసుకుని తిరుగుతున్నాడు. పార్కుల్లో, సినిమా హాల్లో ఎక్కడ చూసినా వాళ్లే. నాకెలా తెల్సిందని అడుగుతావేమో? ! ఆదిత్య ఆఫీసులోనే మా నాన్నగారు పనిచేస్తున్నారు. కొత్తగా బదిలీ అయి వెళ్లడంవల్ల ఆదిత్యకి మా నాన్నగారు తెలియకపోవచ్చు. కాని నాన్నగార్కి ఆదిత్య బాగా తెలుసు. నీ సంసారనౌక మునిగిపోకుండా ఒడ్డుకి వచ్చేమార్గం ఆలోచించు, వస్తాను" విజయ వెళ్లిపోయింది.

ఆమె అబద్ధాలు చెప్పదు. ఉన్నవి, లేనివి కల్పించడం దానికి రాదు. ఆమె చెప్పింది విని జ్యోతికి నోటంట మాట రాలేదు. ఆదిత్య ఇలా చేస్తాడని ఆమె కలలో కూడా ఊహించలేదు. తర్వాత ఆదిత్య వచ్చాడు. జ్యోతికి అతని మీద చాలా కోపంగా ఉంది. ఆమె ఏమీ మాట్లాడలేదు.

ఆదిత్య ఆమె కళ్లలోకి పరీక్షగా చూస్తూ, "ఏంటి దేవిగారికి కోపమా నామీద? !" అన్నాడు కొంటెగా.

జ్యోతి మనసు ఒక్క నిముషం మెత్తబడింది. కాని ఆమె అతనితో సంభాషణ పెంచదల్చుకోలేదు. టి.వి. చూస్తూ కూర్చుంది.

"మౌనమే నీ భాష... ఓ మూగ మనసా..." పాట అందుకున్నాడు ఆమె దగ్గరగా చేరి. ఆరోజు చాలా సంతోషంగా కనిపించేడు ఆదిత్య. జ్యోతి మనసులో ఏదో చిన్న అనుమానం... విజయ చూసింది చెప్పింది... నిజం కాదేమో అనిపించింది. విజయగాని జోక్ చేసిందా? తను ఆదిత్యను ఎంతగా ప్రేమించిందో పరీక్షించడానికి అలా అందా? ఏమో!? అలాంటి ఆలోచన రాగానే ఇంకొంచెం మెత్తబడింది జ్యోతి.

మగవాడు ఆడదాన్ని లొంగదీసుకోవడానికి చాలా ట్రిక్కులు ప్లేచేస్తాడు! మేక కసాయివాడ్ని నమ్మినట్టు అమాయకురాలైన ఆడది ఎప్పుడూ మగాడి తియ్యని మాటలకి లొంగిపోతుంది.

"అది కాదండీ. మా విజయ చెప్పింది..."

"విజయ ఎవరూ? !"

"వాళ్ల నాన్నగారు మీ ఆఫీసులోనే పని చేస్తున్నారు!"

"ఓహ్ అదా సంగతి! విజయ మునుపటి విజయ కాదు. మారిపోయింది. నిన్ను ఆటపట్టించడానికి లేనిపోనివి చెప్పి ఉంటుంది. అయినా రోడ్డుమీద ఏనుగు వెళ్తూంటే వెనక నుండి ఎన్నో కుక్కలు మొరుగుతాయి. ఇదీ అలాంటిదే. ఎవరో అమ్మాయితో నేను తిరిగేస్తున్నానని చెప్పేస్తే నమ్మెయ్యడమేనా నువ్వు? నీలాంటి అందమైన అమ్మాయిని వదిలేసి మరొకరి వెంట పడతానని ఎలా అనుకుంటున్నావు? "

"పోనీ నేను ఉద్యోగం మానేసి మీ దగ్గరకి వచ్చేస్తాను" అంది జ్యోతి.

"వద్దు, అంతపని చెయ్యకు. గవర్నమెంటు ఉద్యోగం మానేస్తానంటావేమిటి? మనం హౌసింగ్ లోను తీసుకున్నాం. ఇక్కడ ఇల్లు కట్టిస్తున్నాం. నువ్వు ఇక్కడ ఉండడమే మంచిది జ్యోతీ! నా మాట విను. మా బంగారువి కదూ!"

పూర్తిగా కరిగిపోయింది జ్యోతి భర్త మాటలకి. ఒక్కరోజుండి అతను వెళ్ళిపోయేడు. కొత్త ఇల్లు గృహప్రవేశం కూడా అయిపోయింది.

★ ★ ★

"ఏమిటి... ఆలోచనల్లో పడిపోయారు! భోజనానికి లేవండి" వసుంధర మాటలకి జానకిరామయ్య వాలుకుర్చీలోంచి లేచేరు.

"మన జ్యోతి గురించి ఆలోచిస్తున్నానే!"

"అందరి సమస్యల గురించి ఆలోచిస్తున్నారు. మన ఇంటి సమస్య పట్టించుకోకపోతే ఎలా చెప్పండి? "

"మళ్ళీ ఏమొచ్చింది? "

"మీ కోడలుగారు ఇంకా లేవలేదు. ఇప్పుడు పదకొండయింది. ప్రసాదు పిల్లల్ని రెడీచేసి స్కూలుకి పంపించి తనూ రెడీ అయి కోర్టుకి వెళ్లిపోయేడు. అయినా ఆ అమ్మాయి ఇంకా లేవలేదు. బాగుంది వరస. పోనీ వాళ్ల అమ్మ నాన్నలని పిల్చి మాట్లాడితే? !"

"ఏమోనే. మన ప్రసాదు బాధపడతాడేమో? "

వాళ్ల భోజనాలయ్యేక భాను నిద్రలేచి గదిలోంచి ఇవతలకి వచ్చింది. ఆయన

## కొత్తగాలి...

**జీవితం బడిలో**
**అనుభవం గురువు**
**కాలం పరీక్ష**

– పి.సునీల్,
పెద్దకొట్టాల, నంద్యాల

విరక్తిగా నవ్వారు. జానకిరామయ్య రోజూ పేపరు చదువుతారు. ప్రపంచంలో ఎక్కడేం జరుగుతుందో ఆయనకు క్షుణ్ణంగా తెలుసు.

ప్రపంచంలో జరుగుతున్న నేరాలు, ఘోరాలు, అత్యాచారాలతో పోలిస్తే వాళ్లింట్లో జరుగుతున్న అంతర్యుద్ధం లెక్కలోకే రాదని ఆయన అభిప్రాయం.

"సమస్యని సమస్యగా తీసుకోకపోతే అది సమస్యే కాదు. సమస్యని భూతద్దంలో చూసినట్టుగా చూస్తే చాలా పెద్దదిగా కనబడుతుంది! సమస్యలకి భయపడి

పారిపోవడానికి ప్రయత్నిస్తారుకాని పరిష్కారమార్గం ఆలోచించరు!! అజ్ఞానమే దుఃఖహేతువు. ఆత్మచింతన లేకపోవడమే అశాంతికి కారణం" శూన్యంలోకి చూస్తూ అన్నారాయన.

"ఏమిటండీ ఏదేదో మాట్లాడుతున్నారు. నాకు భయంగా ఉంది. మీ ఒంట్లో బాగుందా? " అడిగింది వసుంధర దగ్గర కొచ్చి. అంతేకాదు వెంటనే భానుని పిల్చుకొచ్చింది.

"నాకిప్పుడేమీ కాలేదమ్మా. మీ అత్తయ్య పాపం పిచ్చిది. ప్రేమ, ఆప్యాయత తప్ప దాని మనసులో మరేమి ఉండవు. నాకేదైనా అయితే అది తట్టుకోలేదు. అందుకే అంత హడావుడి చేసి నిన్ను పిల్చేసింది" అన్నారాయన.

కొత్తగాలి... 

**మా అమ్మంటే ఏమిటో**
**మా ఆవిడకి**
**తను, అత్తగారయ్యాక తెలిసింది**

– పెన్మెత్స సూరిబాబు,
హైదరాబాద్

భాను లోపలికి వెళ్లిపోయింది. వసుంధర కళ్లు తుడుచుకుంటూ భర్త పక్కనే కూర్చుంది.

ప్రసాదు వచ్చేడు.

"నాన్నా! కోర్టు పనిమీద వైజాగ్ వెళ్తున్నాను. మీకేంపని లేదుకదా. మీరూ రండి, వెళ్దాం" అన్నాడు తండ్రితో.

"పదరా, ఇంట్లో బోరుకొడుతోంది" అంటూ ఉత్సాహంగా లేచారాయన.

"ఇప్పుడే కదా మీకు ఒంట్లో బాగోలేదని మేమంతా కంగారుపడ్డాం. రెస్టు తీసుకోకుండా ఏమిటండీ ఇది? "

"నాకు ఒంట్లో బాగోలేదని నీకెవరు చెప్పారే? " నవ్వుతూ ప్రశ్నించేరు.

"మరి ఏదో ఆత్మచింతన... అశాంతి... సమస్య... అంటూంటే భయపడిపోయేనండీ"

"సరేలే. అవన్నీ పట్టించుకోకు, ఆ ఛానెల్ వేరు. ఈ ఛానెల్ వేరులే". నవ్వుతూ గబగబా రెడీ అయ్యారు. వెళ్లిన పని పూర్తిచేసుకుని రాత్రికి ఇంటికి చేరుకున్నారు ఇద్దరూ. వెళ్లినప్పుడు ఎంతో ఉత్సాహంగా ఉన్న ప్రసాదు వస్తున్నప్పుడు చాలా డల్‌గా, విచారంగా, ఎందుకో బాధపడుతున్న వాడిలా కనిపించేడు.

"ఏంట్రా ప్రసాద్ ఏమైంది? ఆర్ యు ఆల్‌రైట్ మై సన్? " ఆత్రుతగా అడిగేరు జానకిరామయ్యగారు.

"ఈ ప్రపంచం రానురానూ పాడైపోతోంది. అన్నీ ఘోరాలు జరుగుతున్నాయి నాన్నా? "

"ప్రపంచం మునిగిపోతున్నదని ఎవరన్నా చెప్పేరా? నలుగురితోపాటు నారాయణ"

"మన శశిధర్ వాళ్ళ మేనేజింగ్ డైరెక్టరు కంప్యూటరులో డిజిటల్ స్కాన్ చెయ్యబడిన కొన్ని ఫొటోగ్రాఫ్‌లు ఇ-మెయిల్ ద్వారా వారికి పంపించేడు. అవి చూస్తే నరరూప రాక్షసులు ఇంకా ఉన్నారని అనిపిస్తుంది. ఆ మేనేజింగు డైరెక్టరు వాటితోపాటు ఒక మెసేజ్ కూడా పంపించేడు. హ్యూమన్ రైట్స్ ఎలా వైయిలేట్ అవుతున్నాయో చూడమని! తైవాన్‌లో హ్యూమన్ రైట్స్ వయొలేషన్ ఎక్కువగా అవుతున్నది. తైవాన్‌లో అబార్షన్ చేసిన పసిపిల్లల డెడ్ బాడీస్‌ని అంటే హ్యూమన్ ఎంబ్రియోస్‌ని 50-70 డాలర్లకి (ప్రిజర్వేటివ్‌లో పెట్టి) అక్కడ డిపార్టుమెంటల్ స్టోర్సులో అమ్ముతున్నారు. అవి అక్కడి

వాళ్లు కొనుక్కుని వండుకుని లేదా రోస్టు చేసుకుని తింటున్నారు!? ఆ కంట్రీవాళ్లకి అది టేస్టీఫుడ్‌ట! ఇటువంటి దారుణాలు ఇంకా చాలా జరుగుతున్నాయి అక్కడ. దీన్ని వరల్డ్‌లో మిగతా అందరూ ఖండిస్తున్నారు. ఇలాంటివన్నీ ప్రొటెస్టు చేస్తూ ఇతర దేశాలకి ఇవన్నీ తెలియజేసి అవేర్‌నెస్ ప్రోగ్రాం అని అందరూ కల్సి ఇక ఉద్యమం తలపెడుతున్నారు. హ్యూమన్ రైట్స్ ఏక్టివిస్టులు, యునిసెఫ్‌వాళ్లు, యునైటెడ్ నేషన్స్ దృష్టికి తేవడానికి ఇలాంటి ఘోరమైన కృత్యాలు జరక్కుండా ఉండడానికి ప్రయత్నిస్తున్నారు!"

"రామ! రామ! ఎంత భయంకరమైన విషయం చెప్పావురా. వింటేనే కడుపులో దేవినట్టు అవుతోంది. అయ్యో! ఎంత కసాయివాళ్లురా!? కంటనీరు తెప్పించే దారుణ కృత్యంరా ఇది" ఆయన ముఖం వివర్ణమై పోయింది.

"మన ఇండియాలో హ్యూమన్ రైట్స్ కమిషన్ ఉంది. వాళ్లే చర్యలు తీసుకోవాలి. తైవాన్ చాలా చిన్న కంట్రీ. తైవాన్‌కి దుబాయి నుండి పెట్రోలు, ఇండియా నుండి రైస్, ఫుడ్‌గ్రెయిన్స్, జపాను నుండి కార్లు, అమెరికా నుండి కంప్యూటర్లు, రష్యా నుండి మిలటరీ జెట్ ఫైటర్స్, టాంకర్స్ కావాలి. వాటికోసం మిగతా దేశాలమీద డిపెండయినట్టే లెక్క కదా. అప్పుడు మిగతా దేశాలు కొన్ని కండిషన్లు పెడితే బాగుంటుంది. అయితే ఇక్కడొక చిన్న ప్రాబ్లం ఉంది. తైవాన్ దేశం మిగతా దేశాలకి ఎలక్ట్రానిక్ గూడ్స్, సెమి-కండక్టర్స్, ఎలక్ట్రికల్ అప్లయన్సెస్, బల్క్ డ్రగ్స్, అంటే ముడిసరుకులు, పౌడరు లాంటివి సప్లయి చేస్తున్నది. ఏది ఏమైనా తైవాన్ దేశంలో జరుగుతున్న దారుణకాండని అందరూ కల్సి ఆపాలి!..."

ప్రసాదు ఆవేశంగా మాట్లాడుతుంటే ఏమయిపోయిందోనని పరుగెత్తుకొచ్చింది వసుంధర.

"ఏమైందిరా అంత గట్టిగా అరుస్తున్నావు? ఇది కోర్టు కాదురా, ఇల్లు"

జానకిరామయ్యగారు కలగజేసుకున్నారు.

"తెలియని విషయాల్లో తగుదునమ్మా అని దూరకు" భార్యను విసుక్కున్నారు.

"చెప్తే తెలుస్తుంది కదా" నిష్ఠూరం ధ్వనించింది ఆమె స్వరంలో.

"తెలిసి ఏం చేస్తావు? తిన్నదంతా కక్కుకుంటావు!"

"అయ్యో! అవేం మాటలండి!" అంది అసహ్యంగా ముఖం పెట్టి.

వాళ్లు మాట్లాడుకుంటున్నదేమిటో అంతు పట్టలేదు. అసలే సాయంత్రం నుంచి ఆవిడ మనసేమీ బాగులేదు.

సాయంత్రం భారతి ఫోన్ చేసింది.

"హలో! అమ్మా! నేను భారతిని. సునీత అల్లరి రోజురోజుకీ ఎక్కువై పోతున్నది. ఈమధ్య దాన్ని తీసుకుని ఒక పెళ్లికి వెళ్లేను. ఇంటికొచ్చిందగ్గర్నుంచి తనకి వెంటనే పెళ్లి చేసేయమని గొడవ మొదలెట్టింది. పట్టుపట్టి అన్నం కూడా తినడం మానేసింది. దానికి నచ్చజెప్పడం నా తరం కావడంలేదు. ఆ దేవుడికి నామీద దయలేదమ్మా. దేవుడు అందరికీ అన్నీ ఇవ్వడు. ఏ సమస్యా లేకుండా సుఖసంతోషాలతో జీవితం గడిపితే ఆ మనిషి దేవుడ్ని మర్చిపోతాడేమోనని అతని భయం! సమస్యల్ని సృష్టించేది ఆ దేవుడే. ఆ సమస్యల వలయంలో చిక్కుకుపోయి విలవిల్లాడిపోతూ 'దేవుడా! రక్షించు' అని ప్రార్థిస్తే కాపాడేది ఆ దేవుడే! సునీతతో ఎలా వేగాలో నాకు అర్థం కావడంలేదు. ఉంటానమ్మా. బై"

★ ★ ★

గృహప్రవేశం అయిన తర్వాత పూర్తిగా అనకాపల్లి రావడం మానేసాడు ఆదిత్య.

ఆదిత్యతో మాట్లాడకుండా ఇన్ని రోజులు ఉండడం జ్యోతికి ఇదే మొదటిసారి. ఆమెకి పిచ్చెక్కినట్టుగా ఉంది. ఎల్.ఐ.సి. ఆఫీసుకి ఫోన్ చేసింది.

"ఆదిత్యగారు రోజూ ఆఫీసుకి వస్తున్నారు. సెలవు పెట్టలేదు మేడమ్"

"ఆయన్నొకసారి పిలుస్తారా?"

"ఇప్పుడే బయటకు వెళ్లారు మేడమ్. వస్తే చెప్తాను"

జ్యోతికి ఏం చెయ్యాలో పాలుపోలేదు. ఇంటికి ఫోన్ చేసింది. ఎవరూ ఎత్తలేదు. ఆలోచిస్తుండగానే ఫోన్ రింగయింది.

## కొత్తగాలి...

**సూక్ష్మ రుణం**
**మెగా రణం**
**క్షణ క్షణం**
**భయం భయం**

– *నీహారిక దూసి,*
*బెంగళూరు*

"హలో! జ్యోతి!"

ఆదిత్య గొంతు వినగానే ఆమెకు ప్రాణం లేచివచ్చింది.

"నాకు ఆఫీసులో పెండింగ్ వర్క్ చాలా వుంది. నేను ఇప్పుడప్పుడే రావడానికి కుదరదు. చాలా బిజీగా ఉన్నాను. ఏమీ అనుకోకు. సీ యూ. బై" ఆదిత్య ఫోన్ పెట్టేసాడు.

'ఎలా ఉన్నావు? రాత్రుళ్లు నిద్రపడుతున్నదా? నేను గుర్తొస్తున్నానా? ఇక్కడ నా పరిస్థితి కూడా అలాగే ఉంది. త్వరగా వచ్చి దేవిగారి ముందు వాలతాను' అని ప్రేమగా మాట్లాడి ఉంటే...!

జ్యోతి మనసులో చిన్న బాధావీచిక చెలరేగింది. తను మాట్లాడ్డానికి అవకాశం ఇవ్వకుండా ఫోన్ పెట్టేసాడు. అంత బిజీనా? ఏమో అయివుంటుంది. అనుమానం అంత మంచి లక్షణం కాదని మనసు సరిపెట్టుకుంది, తర్వాత కొన్నిరోజులకు ఆదిత్య వచ్చేడు.

"నేను నిజంగా బిజీగా ఉన్నాను. ఆఫీసు వర్క్ ఎక్కువగా వుంది. నన్నేం చెయ్యమంటావు? నువ్వే చెప్పు. అయినా ప్రతీ చిన్న విషయానికి అలా బెంగ పెట్టేసుకుని లేనిపోనివి ఊహించుకుంటే ఎలాగ డియర్?" నవ్వుతూ అన్నాడు. అప్పటికి జ్యోతి కోపం కొంచెం చల్లారింది. భర్త కౌగిట్లో కరిగిపోతున్న ఆమెకి మిగిలిన కొంచెం కోపం కూడా పోయింది. తర్వాత మళ్లీ మామూలే. ఆదిత్య రావడం పూర్తిగా తగ్గించేశాడు. జ్యోతి రెండు మూడుసార్లు వైజాగ్‌లో ఉన్న ఆదిత్య ఇంటికి వచ్చింది. ఎప్పుడొచ్చినా అతనిల్లు తాళం వేసే ఉంటోంది. ఆ మనిషి దొరకడం లేదు.

ఫోన్లో దొరకడంలేదు. వెళ్తే ఉండడం లేదు. జ్యోతి గుండెని ఎవరో పిండేసినట్టయింది. ఆదిత్యను చూసి చాలా రోజులైంది. ఈమధ్య ఇంటికి రావడమే మానేశాడు.

★ ★ ★

"భారతి సాయంత్రం ఫోన్ చేసిందండి..." అంటూ విషయం అంతా వసుంధర ఆయనతో చెప్పింది. అంతా విని ఆయన నిట్టూర్చారు.

జానకిరామయ్య గారికి ఇద్దరు ఆడపిల్లల తర్వాత చాలాకాలానికి కొడుకు పుట్టేడు. దేవుడి వరంగా భావించి వాడికి వరప్రసాదు అని పేరు పెట్టుకున్నారు. ఆయన తహశీల్దారుగా చేసి రిటైరయ్యారు. ఆడపిల్లలిద్దరికీ ముందే పెళ్లిచేసేసేరు. పెద్దమ్మాయి భారతికి ఒక్కర్తే కూతురు సునీత. ఆమె కొంచెం మెంటల్లీ రిటార్టెడ్. భారతి భర్తకి పెద్ద గార్మెంట్ బిజినెస్

ఉంది. కూతురి పిచ్చిపోవడానికి ఎంతో మంది డాక్టర్లకి చూపించేరు. కానీ నయం కాలేదు. చిన్న కూతురు శైలజకి ఇద్దరు కొడుకులు. ఆమె భర్త హైదరాబాద్‌లో లెక్చరరుగా చేస్తున్నారు. ఆమె బాగానే వుంది. జానకిరామయ్యగారికి తాతలనాటి ఆస్తులు చాలా ఉన్నాయి. వాటిని పాడుచెయ్యకుండా, అమ్మేయకుండా ఉంచేరు. అంటే ఆస్తులు నిలబెట్టుకున్నారన్నమాట.

మూడు ఎకరాల పొలం, మామిడితోట, కొబ్బరితోట, లంకంత ఇల్లు. ఆయన వంతుకి వచ్చాయి. ఆ ఇంటికి చుట్టూ ఉన్న ఖాళీస్థలమే ఎక్కువ. ఇల్లు కూడా చాలా పెద్దది. ఇటు మూడు గదులు, అటు మూడు గదులు మధ్యలో పెద్ద హాలు, వీధిగుమ్మంలోంచి వస్తే పెద్ద వరండా, హాలు దాటేక అటువైపు వంట గది, ఇటు వైపు కొట్టు గది. పెరట్లో నుయ్యి, ఆ నుయ్యికి గిలక, నుయ్యి పక్కన మరొక చిన్న గది. అన్ని గదులకి పెద్ద పెద్ద కిటికీలు ఉన్నాయి. దేవుడి గది పక్కన ఉన్న గదిలో కొడుకూ-కోడలు ఉంటున్నారు. వంటింటికి ఆనుకుని వున్న గదిలో పెద్దవాళ్ళిద్దరూ ఉంటున్నారు. మిగతా గదులన్నీ ఖాళీగానే ఉన్నాయి. పెరట్లో రకరకాల చెట్లు ఉన్నాయి. పనస, జామ, సపోటా, సీతాఫలం, మామిడి, నిమ్మ, రాసవుసిరి, కరివేపాకు చెట్లు ఎన్నో అనుభవాలతో పండిపోయిన వృద్ధుల్లా ఉన్నాయి. నుయ్యికి ముందు నుంచి కాలువ ప్రారంభమై అలా చివరిదాకా సాగింది. ఆ పక్కనే అరటిచెట్లు బరువైన గెలలతో నిండు గర్భిణుల్లా ఉన్నాయి. ఇవి కాక అనేకరకాల పూల మొక్కలు ఉన్నాయి. మందారాలు, చేమంతులు, డిసెంబరాలు, నందివర్ధనం, కనకాంబరాలు, నిత్యమల్లి ఉన్నాయి. సన్నజాజి తీగలు ఇంటి కప్పుమీదకి పాకి గర్వంగా తలలూపుతూ ఉంటాయి. వీధి గేటుకి అటు-ఇటు రెండు కొబ్బరిచెట్లు ఉన్నాయి. గేటుకి వసారాకి మధ్య అటు-ఇటు అందమైన క్రోటన్స్ మొక్కలు ఆకర్షణీయంగా ఫ్యాషన్ పెరేడ్‌లో నించున్న అందాలభామల్లా తమ వయ్యారాలు ఒలకబోస్తూ ఉన్నాయి. ప్రతీరోజూ రెండుపూటలా ఆ చెట్లన్నింటికి జానకిరామయ్యగారే స్వయంగా నీళ్లు పోస్తూ ఉంటారు.

"ఎందుకండీ మీకింత శ్రమ, నడుం పట్టేస్తుంది. నూతిలో నీళ్లు తోడి పొయ్యడం అంటే మాటలు కాదు. ఎవరినన్నా కుర్రాణ్ణి పెట్టుకుందాం"

## కొత్తగాలి...

**కలకలం సృష్టించగలదు**
**'కలాం'లను అందించగలదు**
**కలం**

– డాక్‌యార్డ్ లక్ష్మీనాయుడు,
సింహాచలం

అని వసుంధర అంటే,

"నీకు తెలీదే. నూతిలో నీళ్లు తోడితే నా భుజాలకి, చేతులకి మంచి ఎక్సర్‌సైజు తెలిసిందా? అన్ని చెట్లకీ నీళ్లు పోస్తూంటే ప్రతిరోజూ పది మందికి అన్నదానం చేస్తున్న ఫీలింగు కలుగుతుందే. నా కాళ్లు-చేతులు ఆడుతున్నంత కాలం నన్ను అడ్డు పెట్టకు" అనేస్తారు నవ్వుతూ. మొక్క మొక్కనీ పరిశీలనగా చూసి ఎండిపోయిన ఆకుల్ని తీసిపారేస్తూ చెట్లకి నీళ్లుపోసే కార్యక్రమం పూర్తి చేస్తారు.

వసుంధర కూతుర్ని, మనమరాల్ని తల్చుకుని ఏడుస్తూనే ఉంది. మర్నాడు వసుంధర నిద్రనించి లేవలేదు. ఒళ్లంతా

నొప్పులుగా ఉండి జ్వరం వచ్చినట్టుగా ఉంది. లేవలేకపోతుంది.

"వంట ఎలాగండీ? " బెంగపట్టుకుంది ఆవిడకి.

"వసూ! నేనొకటి అంటాను ఏమీ అనుకోకు. నువ్వు ఈ మడీ ఆచారం అన్నది వదిలేయాలి. ఇవి మునుపటి రోజులు కావు. కాలంతోపాటు మనమూ మారాలి. ఎంతసేపూ లోకాన్ని నీ దృష్టిలోనే చూస్తే ఎలాగ? ఒక్కసారి ఎదుటివాళ్ల దృష్టితో చూడ్డం నేర్చుకో. అసలు మడి- ఆచారం అన్నది శుచి-శుభ్రం కోసం పెట్టారు మన పూర్వీకులు. కోడలికి వంట రాదు. నువ్వు చెయ్యలేవు. అలసిపోతున్నావు. అందుకే

## కొత్తగాలి...



**ఓటమి**
**చివరి మజిలీ కారాదు**
**గెలుపనే గమ్యాన్ని**
**చేరేవరకూ పోరాడు**

– శ్రేష్టి శేషగిరి,
*వారాశిగూడ, సికింద్రాబాద్*

నా మాట విను. మనం ఒక వంటవాడిని పెట్టుకుందాం. నీకు బాగా నచ్చితేనే ఆ వంటవాడిని పనిలో పెడదాం. నా మాట కాదనకు. అనవసరమైన చాదస్తాల వల్ల ఎవరికీ ఏమీ లాభం ఉండదు! ముఖ్యంగా నష్టం నీకే!"

"అయ్యో! మడీ-ఆచారం లేకపోతే ఎలాగండీ? మడిబట్ట కట్టుకుని వంట చెయ్యకపోతే పాపం చుట్టుకుంటుంది" లెంపలేసుకుంది వసుంధర.

"ఎవరు చెప్పారే? మీ అమ్మమ్మ చెప్పిందా అలాగని? " వ్యంగ్యంగా అన్నారాయన.

"అన్నీ అలా కొట్టిపారెయ్యకండి. మడీ-ఆచారం లేని కొంపలో అడుగుపెడితే పంచ మహాపాతకాలు చుట్టుకుంటాయిట!"

"అది కూడా మీ అమ్మమ్మే చెప్పిందా? " జానకిరామయ్యకి నవ్వాగడం లేదు.

"ఏదీ చూద్దాం. నేను పాచి బట్టలతో వంట చేస్తాను. ఏమవుతుందో చూస్తా".

"సరే, అయితే కామేశ్వరి వాళ్లింటికి కబురు పెట్టండి. వాళ్ల వంటవాడు కమ్మగా వండుతాడట. శుభ్రంగా ఉంటాడట. ఆవిడ కొడుకు, కోడలు ఈ మధ్య అమెరికా వెళ్లిపోయేరట. వాళ్లు కూడా అక్కడికి వెళ్లిపోతారట. వంటవాడిని మానిపించేస్తున్నారు. మనింట్లో చేస్తాడేమో కనుక్కోండి"

నీరసంగా ఉండి పడుకుంది వసుంధర. భాను ఆవిడకి టెంపరేచర్ చూసింది. నూటామూడు డిగ్రీల జ్వరం ఉంది. జానకిరామయ్యగారు వెంటనే బయలుదేరి కామేశ్వరి వాళ్లింటికి వెళ్లి వంటవాడ్ని పది నిమిషాల్లో తీసుకొచ్చేరు.

వంటవాడు శంకరం తెల్లగా, దృఢంగా, పెద్ద మీసాలతో గమ్మత్తుగా ఉన్నాడు. నిజానికి వంటవాడిలా లేడు. సినిమా హీరోలా ఉన్నాడు. వాడ్ని ఆరోజే పనిలో చేరమని చెప్పేరు. శంకరం మాటతీరు ఇంట్లో అందరికీ నచ్చింది.

వసుంధర శంకరాన్ని ఎగాదిగా చూస్తూ అంది. "నాకు మడీ - ఆచారం ఎక్కువ. అందుకే ఇన్నాళ్లూ నేనే వంటచేస్తూ వచ్చేను. ఇప్పుడు ఒంట్లో ఓపిక లేక ఇలా సర్దుకోవాల్సి వచ్చింది. నువ్వు స్నానం చేసి శుచిగా ఉండాలి, తెల్సిందా? " అందావిడ.

"అలాగేనండి. నేనిప్పుడు స్నానం చేసే వచ్చేనండీ" అన్నాడు శంకరం. లోపలికి వెళ్తూనే షర్టుని అక్కడ తలుపుకి తగిలించి లుంగీని సగానికి ఎత్తి కట్టేసి వంటకి

# అపస్వరానికి శిక్ష చెంపదెబ్బ!

అనగనగా నిజం

బిడారం కృష్ణప్ప మైసూరులో గొప్ప సంగీత విద్వాంసులు, గాన విశారదులు. ఆయన వీణ, ఫిడేలు వాయిద్యాలను కూడా చక్కగా వాయించేవారు. ప్రఖ్యాత ఫిడేలు కళాకారుడు మైసూరు చౌడయ్య వారి శిష్యుడే.



మైసూరు రామమందిరంలో ఒకనాడు కృష్ణప్ప గానకచ్చేరి. ఫిడేలు వాద్యసహకారం చౌడయ్యదే. కాని, మధ్యలో ఒకచోట ఫిడేలు వాయించడంలో పొరబాటున ఒక అపస్వరం దొర్లింది. కృష్ణప్ప కండ్లు ఎర్రబడ్డాయి. అపస్వరాన్ని సహించలేకపోయారు. 'అదొక బహిరంగ సభ. తను అక్కడ గాయకుడేకాని, పాఠాలు చెప్పే గురువు కాదు' అన్న సంగతి మరచి, తన చేత్తో చౌడయ్య చెంప చెళ్ళుమనిపించాడు. ఇది గమనించిన సభాసదులందరూ ఆశ్చర్యపోయారు. చౌడయ్య మాత్రం, 'ఇది నా గురువుగారు ప్రసాదించిన అనుగ్రహమే!' అని వినయంతో మౌనంగా ఉండిపోయాడు.

కచ్చేరి ముగించుకొని ఇంటికి వచ్చాక, పాఠాలు చెప్పే సమయంలో కృష్ణప్ప శిష్యుడిపై వాత్సల్యం కురిపిస్తూ 'నేను సభలో నీపట్ల దుడుకుగా వ్యవహరించి నీ మనస్సు నొప్పించాను. నిన్ను అవమానించాలని అట్లా చేయలేదు. నా స్వభావమే అది. అపస్వరాలు, అపలయలను ఏమాత్రమూ భరించలేను' అన్నారు.

అటువంటి గురువుకు ఫిడేలు చౌడయ్య శిష్యుడైనందువల్లనే తరువాతి కాలంలో ఆయన పేరు భారతదేశమంతటా మారుమ్రోగింది.

ఉపక్రమించేడు. ఏ వస్తువులు ఎక్కడున్నాయో అతనికి తెలీదు. వసుంధర మంచంమీంచి లేవలేకపోతోంది. భానుని పిల్చింది.

"భానూ! నా వంట్లో బాగులేదు. ఆ వంటవాడికి ఏవి ఎక్కడున్నాయో చూపించమ్మా. ఏవేం వండాలో ఒకటి రెండు రోజులు చెప్తే అతనికి ఆ తర్వాత అలవాటు అవుతుంది. ఒకసారి వంటింట్లోకి వెళ్లి చూడమ్మా!" అందావిడ.

భాను వంటింట్లోకి వెళ్ళింది. శంకరం వైపు చూడగానే దిగ్భ్రాంతి చెంది మాట పలుకు లేకుండా అలా ఉండిపోయింది. ఛాతిమీద దట్టమైన వెంట్రుకలతో, బొద్దు మీసాలతో, చిరునవ్వుతో ఉన్న శంకరాన్ని చూసి ఏ సినిమా హీరోనో మారువేషం వేసుకొచ్చినట్టున్నాడు అనుకుంది. లుంగీ కట్టుకున్న మన్మథుడిలా ఉన్నాడు శంకరం. భాను చూపు తిప్పుకోలేకపోయింది. ఆమెకి మతిపోయింది. ముఖ్యంగా అతని చూపు, ఎద లోతుల్లోకి చొచ్చుకు పోతున్నట్టున్న ఆ చూపుకి ఆమె కలవరపడింది. ఆమె మనసు చిత్రంగా ఆమె ఆధీనంలో లేదు. ఎప్పుడో ఎక్కడో పారేసుకున్న మధురమైన జ్ఞాపకాలు తిరిగి పొందబోతున్న అనుభూతి ఆమె మనసున నిండిపోయింది!

"ఏవి ఎక్కడ ఉన్నాయో, వంట ఏం చెయ్యాలో చెప్పేస్తే త్వరగా చేసేస్తాను" అన్న శంకరం మాటలతో భాను అనుభూతుల లోకం నుండి ఇవతలకి వచ్చింది.

"ఆఁ. అహఁ చెప్తాను. చెప్తాను"

అంటూనే బియ్యం, కందిపప్పు వగైరాలన్నీ ఏవి ఎక్కడున్నాయో చూపించింది భాను.

"మీ పేరేమిటండీ? " శంకరాన్నే తదేకంగా చూస్తున్న భాను అతని మాటకు గతుక్కుమంది.

"నా పేరా... నా పేరు భానుమతి. అందరూ భాను అని పిలుస్తారు. మరి నీ పేరేంటి? "

"నా పేరు శంకరం" అప్పుడే మరిగిపోయిన ఎసరులో బియ్యం కడిగిపోస్తూ అన్నాడు. వంట చెయ్యడం బాగా చెయ్యి తిరిగినవాడని అతని పని చూస్తేనే తెలుస్తున్నది!

అతన్ని చూడగానే తన మనసు ఎందుకిలా కోతిలా గెంతుతున్నది? తన శరీరం

## కొత్తగాలి...

**జీవితం**
**పెరుగుతుంది**
**జీతం**
**తరుగుతుంది**

*- కిలారు వెంకటేష్‌చౌదరి,*
హైదరాబాద్

వీణతీగలా ప్రకంపించడం, శరీరంలోంచి వెచ్చటి ఆవిర్లు రావడం మొదలవుతున్నాయి ఎందుచేత? తనకేమైపోతోంది? !

క్షణకాలం ఆమె భయపడింది. తన మనసు తన మాట వినడంలేదని స్పష్టంగా తెలిసిపోతూనే ఉంది. అయినా జాగ్రత్తగా ఉండాలి!

తను ఒక భర్తకి భార్య, ఇద్దరు కొడుకులకి తల్లి!

పరువు - ప్రతిష్ఠలు గల కుటుంబంలోని కోడలు!

తను అనుచితంగా ప్రవర్తిస్తే ఇంటిపరువు పోతుంది! శంకరాన్ని చూసినప్పుడల్లా ఆమె ఆలోచనలు అలా సాగిపోతూనే ఉన్నాయి.

శంకరం మాత్రం వంట అద్భుతంగా చేస్తున్నాడు. ప్రసాదు, జానకిరామయ్య శంకరం వంటని బాగా మెచ్చుకుంటున్నారు. ఫలహారాలు కూడ బాగా ప్రిపేరు చేస్తున్నాడు.

వసుంధరకి జ్వరం తగ్గింది. కాని ఇంకా నీరసంగా ఉంది. ఆ రోజు భారతి దగ్గర్నుంచి మళ్లీ ఫోన్ వచ్చింది. ఈసారి ఆమె జానకిరామయ్యతో మాట్లాడింది.

"హలో! నాన్నగారూ! సునీతతో నాకు పెద్ద సమస్య వచ్చి పడింది. ఎంతోమంది డాక్టర్లకి, సైకియాట్రిస్టులకి చూపించేం... పిల్లకి చిన్నప్పట్నుంచే మెదడు ఎదగలేదు. స్కిజోఫ్రీనియా అని, స్ప్లిట్ మైండ్ కావచ్చన్నారు. ఇది యంగ్ఏజ్‌లో స్టార్ట్ అవుతుంది. వాళ్లకి ఏవో వాయిస్‌లు వినబడుతూ ఉంటాయి. ఎవరో మాట్లాడుతున్నట్టు అనిపిస్తూ ఉంటుంది. వాళ్లు వాటికి తమలో తామే జవాబులు ఇస్తూ ఉంటారు. దీనికి ఫ్యూ సెకండ్స్ షాక్ ట్రీట్‌మెంటు ఇస్తారట! భయపడాల్సిన పనిలేదు. సైడు ఎఫెక్ట్స్ ఉండవు అన్నారు. ఎలక్ట్రో కన్‌వెల్సివ్ థెరపీ కూడా ఇవ్వొచ్చు అంటున్నారు. ఏం చెయ్యాలో పాలుపోకుండా ఉంది. ఒక్కర్తే కూతురు. బోలెడంత ఆస్తి ఉంది. ఆయన దీనికోసం బెంగ పెట్టేసుకుంటున్నారు. ఈ మధ్య నేను ఒక పెళ్ళివారింటికి సునీతను తీసుకెళ్లేను. వచ్చిన దగ్గర్నుంచి అది ఒకటే గోల, తనకి వెంటనే పెళ్లి చెయ్యమని. అన్నం, నీళ్లు ముట్టుకోకుండా పదే పదే 'పెళ్లి' జపం చేస్తున్నది. మీరొకసారి అమ్మని పంపించండి నాన్నగారూ! అమ్మ వస్తే సునీతకి ఏవో మంచి మాటలు చెప్పి మనసు మారుస్తుందేమోనని నా ఆశ. ఇక్కడికొచ్చి

కొన్నాళ్లు ఉంటుంది. అమ్మని పంపించండి" బాధపడుతూ చెప్పింది భారతి.

వసుంధర నీరసంగా ఉన్నా వెంటనే బట్టలు సర్దుకుని బయల్దేరింది. సమస్యని పరిష్కరించే శక్తి ఆమెకి లేదు. కాని కూతురి మనోవ్యధని కొంతైనా పంచుకోవాలని వెళ్లింది ఆవిడ! ఆవిడ వెళ్లేసరికి సునీత బాత్‌రూంలో స్నానం చేస్తోంది. కుళాయి అలా వదిలేసింది. కుళాయి నీళ్లన్నీ అలా కింద పడిపోతున్నాయి. సబ్బంతా కరిగిపోతోంది. బాత్‌రూం తలుపులు బార్లాతీసి ఉన్నాయి. వంటిమీద నూలుపోగు లేదు సునీతకు. పదహారేళ్ల వయసులో ఉండవల్సిన అందాలన్నీ బహిర్గతమవుతూనే ఉన్నాయి. భారతికి సిగ్గుగా ఉంది ఎవరైనా చూసేస్తారేమోనని. కానీ ఆ పిల్లకి 'సిగ్గు' అంటే ఏమిటో తెలియదు!

"పైడిరాజూ! నువ్వెక్కడ ఉన్నావురా? నేను చెప్పిందాకా ఇటువైపు రాకు. తెల్సిందా" అరిచింది భారతి.

"అలాగేనమ్మగారూ!" అన్నాడు ఎక్కడి నుంచో వాడు.

"ఇక చాలు సునీతా! తలంతా ఎలా తడిసిపోయిందో చూడు, తుడుస్తానురా" అని బలవంతంగా గదిలోకి ఈడ్చుకొచ్చింది సునీతని భారతి. సరిగ్గా ఆ టైముకే వసుంధర అక్కడికి వెళ్లింది. ఒంటిపై ఏ ఆచ్ఛాదనాలేని సునీతని చూడగానే ఆవిడ స్త్రీ హృదయం పరితపించిపోయింది.

'వయసొచ్చినా సిగ్గు అంటే ఏమిటో తెలియని పిచ్చిపిల్ల! ఈడొచ్చిన పసిపిల్ల!...' అనుకుంది ఆవిడ బాధగా నిట్టూరుస్తూ.

సునీత నడక కూడా సరిగ్గా ఉండదు. వంకరటింకరగా ఉంటుంది. మాటలు కూడా సరిగ్గా రావు. ముఖ్యంగా బ్రెయిన్ ఎదగలేదు. కోల్‌కతాలో కస్బాలో ఉన్న మనోవికాస కేంద్రానిక్కూడా తీసుకెళ్లేరు. అక్కడ సునీతనుంచడం ఇష్టంలేక తీసుకొచ్చేసేరు.

## మునిమాణిక్యం చతురోక్తులు



మునిమాణిక్యం నరసింహారావుగారి కాంతం కథల్లోని హాస్యం సంసారపక్షమైంది. కాంతం అచ్చమైన తెలుగు ఇల్లాలు. ఆమెది చాకలిపద్దు చదువైనా సంసార రథాన్ని అవలీలగా లాగివేయగల విజ్ఞురాలు. మార్చి 15న మునిమాణిక్యం వారి జయంతి సందర్భంగా ఆయన చతురోక్తులు కొన్ని..

### మూర్ఖులకు దారేది?

ఓసారి మునిమాణిక్యం-కాంతం సంసార సరిగమల్లో చిన్న ప్రణయ కలహంవల్ల మౌనరాగం రాజ్యమేలింది- రంజుగా. మేడ మీది గదిలో ఉన్న మునిమాణిక్యం కిందికి రావాలనుకుని మెట్లు దిగుతున్నారు. అవి ఇరుకుమెట్లు. కాంతం మెట్లెక్కి మేడమీది గదిలోకి రాబోతోందప్పుడే. ఇద్దరూ మధ్యలో ఎదురుపడ్డారు. ఎవరో ఒకరు తప్పుకోవాలి! 'ఊహు-మూర్ఖులకు నేను దోవ ఇవ్వను' అన్నారు మునిమాణిక్యం దర్పంగా. 'నేను ఇస్తాను' అన్నది కాంతం తప్పుకుంటూ. ఖంగుతినడం ఆయన వంతయింది. అదీ కాంతం వ్యక్తిత్వం.

"ఆయ్. అమ్మమ్మ వచ్చింది. నాకు... పెళ్ళి చేత్తుంది. ఊc. ఊc." అంటోంది సునీత. అంతేకాదు. వసుంధర పయిటంచు పట్టుకులాగేసి, గాజులు సవరించేసి, జుట్టుముడి పీకేసి అమ్మమ్మ చుట్టూ తిరుగుతూ చప్పట్లు కొడుతోంది 'పెళ్ళి చెయ్యి' అంటూ.

ఆ సమయంలో ఎవరన్నా కోప్పడితే ఆ పిచ్చిపిల్ల ఇంకా రెచ్చిపోతుంది. చేతిలో ఏదివుంటే అది విసిరేస్తుంది. అందుకే భారతి తన కోపాన్ని నిగ్రహించుకుని ఆ పిల్లకి నెమ్మదిగా నచ్చజెప్పి తల్లినిడిపిం

చింది. ఆవిడ బతుకుజీవుడా అనుకుని బయటపడింది. మరో అయిదు నిముషా లకి మళ్లీ 'పెళ్లి... పెళ్ళి' అంటూ గోల మొదలెట్టింది. ఆమె గోల భరించలేక రోజూ నిద్రమాత్ర ఇచ్చి పడుకోబెట్టడం అలవాటు చేసేరు వాళ్లు. సునీత పడు కుంటే తుపాను వెలిసినట్టయి ఇల్లు ప్రశాం తంగా ఉంటుంది. పాపం భారతి నవ్వు మర్చిపోయి చాలా సంవత్సరాలు అయింది.

వసుంధర ఆ రాత్రి భోజనాలయ్యాక కూతుర్ని దగ్గర కూర్చోబెట్టుకుని ఓదా ర్చింది. దట్టంగా కమ్ముకున్న నల్లటి మేఘం చల్లటిగాలి సోకితే వర్షించినట్టుగా తల్లి ఓదార్పుతో భారతి గుండె బద్దలైంది. ఆమె కళ్లు వర్షించడం మొదలెట్టేయి.

"నువ్వు ఆనందంగా వుండాలి భారతీ! ఆనందం ఒక మానసిక స్థితి. నువ్వు నీ గుండెని గట్టి చేసుకుంటే అంత ఆనందాన్ని పొందగలవు, అయినా భగవంతుడి దృష్టిలో 'న్యాయం' వేరేగా ఉంటుందమ్మా. గత జన్మ పాపపుణ్యాలను కూడా కలిపి లెక్కలు కట్టి సుఖదుఃఖాలు ఇస్తాడు ఆ దేవుడు!"

"అమ్మా! ఇప్పుడు నన్నేం చెయ్యమం టావు? " బాధపడుతూ అంది భారతి.

వసుంధర ఆలోచిస్తున్నది.

"ఈ చుట్టుపక్కల ఇళ్లవాళ్లకి మన సునీత గురించి తెలుసా? "

"తెలుసమ్మా. ఏం అలా అడుగుతు న్నావు? "

"అహఁ. ఏంలేదు. పెద్ద పెద్ద బట్టల షాపుల్లో, షోకేసుల్లో పెద్ద పెద్ద మగబొ మ్మల్ని పాంటు, షర్టు వేసి నించోపెడతారు చూసేవు కదా. అలాంటి బొమ్మని తీసు కొచ్చి సునీతనిచ్చి పెళ్లి చేస్తే... ఎలావుంది ఐడియా? !" కూతురి ముఖంలోకి ఆత్రంగా చూస్తూ అంది.

భారతి మొహం సంతోషంతో వెడల్పు యింది.

"ఐడియా బ్రహ్మాండంగా ఉందమ్మా. ఎలాగూ అల్లుడుగారిది గార్మెంట్ బిజినెస్ కదా. రేపే ఆయనకి ఒక పెద్ద మగబొమ్మ తెమ్మని చెప్తాను. రెండు పీటలు వేసి కూర్చోబెట్టి పదిమంది ముత్తయిదువుల్ని పిల్చి వాళ్లచేత అక్షింతలు వేయించేస్తాను. పెళ్లి క్యాసెట్ వేసేద్దాం. జ్యూలరీ షాపులో ఒక మంగళసూత్రం కొంటాను. ఇప్పుడు నా సమస్య తీరిపోయినట్టే అనిపిస్తోంది!" భారతి సంతోషంగా అంది.

అన్ని ఏర్పాట్లు పూర్తి చేసుకున్నారు వాళ్ళు.

రంగు రంగుల గాజులు కొని కూతురికి వేసింది భారతి. పువ్వులు కొని పువ్వుల జడ వేసారు. చేతులకి గోరింటాకు పెట్టారు. చేతులు ఎర్రగా పండాయి. తన చేతులు చూసుకుని మురిసిపోయింది సునీత. తనకి ఎక్కువ ఇంపార్టెన్స్ ఇచ్చేసి ఏమిటో చేసేస్తుంటే వింతగా చూస్తూ బుద్ధిగానే ఉంది సునీత. పాపం భారతికి కళ్లంట నీళ్లొచ్చేయి కూతుర్ని చూస్తోంటే. ఎంత పిచ్చిపిల్ల అయినా అన్ని అలంకా రాల మధ్య దాని ముఖంలోకి పెళ్లి కళ వచ్చేసింది! నిజం పెళ్ళికూతురిలాగే మెరిసి పోతున్నది సునీత. ఆమె పక్కనే పువ్వులు, అక్షింతలు, పసుపు, కుంకుమ, కొబ్బరికా యలు, అరటిపళ్లు, తియ్యగుమ్మడిపండు అన్నీ సిద్ధంచేసి వుంచేరు. ముత్తైదువులం దరూ వచ్చి కూర్చున్నారు. కొంతమంది వెక్కిరింపుగా మాట్లాడుకుంటూ చెవులు కొరుక్కుంటున్నారు. కొంతమంది పెద్ద ముత్తైదువులు మాత్రం వాళ్లని అలా వెక్కి రించ కూడదని మెల్లగానే మందలిస్తు న్నారు. ఒక పెద్ద ముత్తైదువు సునీత మెడలో మంగళసూత్రం కట్టేసింది. అందరూ అక్షింతలు వేసేరు. గబుక్కున

## ఇది ప్రార్థన కాదా?

గాంధీజీ ఒకసారి బెంగళూరు వెళ్ళారు. సి. రాజగోపాలాచారి ఆయన వెంట ఉన్నారు. గాంధీజీ రాకను పురస్కరించుకొని అక్కడి ఔత్సాహిక నాటక కళాకార్ల సంఘం పండిత తారానాథ రచించిన 'దీన బంధు కబీర్' నాటక ప్రదర్శన ఏర్పాటుచేశారు. ఈ నాటకానికి ప్రత్యేక ఆకర్షణ కబీర్ పాత్రలో బళ్ళారి రాఘవ. గాంధీజీ ఆ నాటకాన్ని చూసేందుకు సమయం దొరకదన్నారు. రాఘవ గురించి బాగా తెలిసిన రాజగోపాలాచారి అతని నటనాకౌశలాన్ని గాంధీజీకి వివరించి, నచ్చజెప్పారు.



నాటకం కోసం తాను ఇరవై నిమిషాలు ఉండగలనని చెప్పారు గాంధీజీ. అలా బళ్ళారి రాఘవ నాటకాభినయాన్ని చూసేందుకు ఆయన రాజాజీతో బాటు నాటకశాలకు వచ్చారు. నాటకం ప్రారంభమైంది. రాఘవ అభినయ కౌశలం గాంధీజీని బాగా ఆకట్టుకుంది. నాటకంలో పూర్తిగా తల్లీనుడైన ఆయన తన సమయం గడచిపోవడం గమనించలేదు.

'ప్రార్థన వేళ' దగ్గర పడిందని రాజాజీ గాంధీజీకి గుర్తుచేశారు. 'ఏం? ఇది ప్రార్థన కాదా?' అన్న గాంధీజీ నాటకం చూడడంలో పూర్తిగా నిమగ్నులయ్యారు.

రాజాజీ పదేపదే గాంధీజీకి సమయం గుర్తు చేసినా ఆయన దాని గురించి ఏమాత్రం పట్టించుకోలేదు. నాటక ప్రదర్శన పూర్తయింది. రాఘవ స్టేజీ దిగి గాంధీజీకి నమస్కరిస్తే, గాంధీజీ మాత్రం 'రాఘవ మహారాజ్‌కు జయము జయము' అని ప్రశంసించి తన బసకు వెళ్ళిపోయారు.

ఆ దినం ఆ నాటక ప్రదర్శనకు వసూలైన సొమ్మును రాఘవ గాంధీజీకి సమర్పించారు. దానిని గాంధీజీ హరిజన సేవా సంఘానికి అందజేశారు.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

వంగి పళ్లెం తీసుకుని తను కూడా అందరి మీద అక్షింతలు వెయ్యడం మొదలెట్టింది సునీత.

భారతి గబగబా వచ్చి "తప్పు. అలా చెయ్యకూడదు" అని కూతుర్ని కోప్పడింది.

సునీత తన మెడలో ధగ ధగ మెరుస్తున్న మంగళసూత్రాలు చూసుకుని కొంతసేపు ముచ్చటపడింది.

'నాకు పెళ్లయింది. నాకు పెళ్లయింది' అని అందరికీ గట్టిగా చెప్తున్నది.

మొత్తానికి అందరూ కల్సి సునీత పెళ్లి జరిపించేసేరు. అందరూ అక్షింతలు వేసి ఆశీర్వదించేరు.

కాని సమస్య అంతటితో తీరిపోలేదని, కొత్త సమస్య త్వరలోనే మొదలవబోతోందని, ఆ సమస్య సునీత జీవితాన్నే కబళించబోతున్నదని వాళ్లిద్దరూ ఆ నిముషంలో ఊహించలేకపోయేరు!

ప్రతిరోజూ సునీత బాత్‌రూం తలుపు వేసుకోకుండా నగ్నంగా స్నానం చేస్తున్నప్పుడు రెండుకళ్లు రహస్యంగా ఆమెనే పరీక్షించి చూస్తున్నాయని, అంతేకాకుండా ఆ కళ్లు అవకాశం కోసం పొంచి చూస్తున్నాయని అక్కడ ఎవరికీ తెలిసే అవకాశం లేదు.

★ ★ ★

వసుంధర మర్నాడు పొద్దున్నే అక్కడ్నుంచి బయల్దేరి వచ్చేసింది. ఆవిడ వచ్చే టప్పటికి భానులో ఏదో మార్పు కొట్టొచ్చినట్టుగా కనిపిస్తున్నది. ఆమెలో కొత్త

ఉత్సాహం తొంగిచూస్తున్నది. చక్కగా ముస్తాబై ఇంట్లో అటు-ఇటు హడావుడిగా తిరిగేస్తున్నది!

"ఏంటి భానూ! మంచి చీరకట్టుకు న్నావు. ఎక్కడికైనా వెళుతున్నావా? " అడి గింది వసుంధర కుతూహలంగా.

భాను ఈ మధ్యకాలంలో ఎప్పుడూ అంత చక్కగా ముస్తాబు చేసుకోవడం ఆవిడ చూడలేదు. అందుకే అడిగింది.

"ఏంలేదు అత్తయ్యా! ఊరికినే."

మరి సంభాషణ పెంచలేదు వసుంధర.

శంకరం వంటింట్లో ఉన్నాడు.

గోధుమపిండి డబ్బా ఎక్కడుందో అడగ డానికి వచ్చేడు. వసుంధర వంటింట్లోకి వెళ్లబోతుంటే భాను ఆపింది.

"నేను చూస్తాను అత్తయ్యా! మీరు కూర్చోండి" అని భాను వంటింట్లోకి వెళ్లింది.

"అమ్మో! నా కోడలికి నేనంటే ఎంత అభిమానం! ఇప్పుడు కొంచెం బాధ్యత తెలిసి వచ్చినట్టుంది. పోనీలే నాక్కావల్సిం దే అదేకదా" అని ఆవిడ సరదా పడింది.

కాని అసలు విషయం ఆవిడకి తెలీదు!?

భాను చిన్న స్టూల్ ఎక్కి గోధుమపిండి డబ్బా తియ్యబోతుంటే శంకరం అడ్డుపడి "ఉండండి. నేను తీస్తాను" అంటూ తన చేయి మీదకు చాపాడు. ఇద్దరి చేతులు, తలలు దగ్గరగా ఉండడం చేత గట్టిగా తగి లేయి. ఆమె నించున్న స్టూలు కదిలి జారిపడబోతుంటే శంకరం ఆమె నడుము మీద చేయివేసి పడిపోకుండా గట్టిగా పట్టు కున్నాడు. ఆమె ఎత్తులు అతనికి మెత్తగా తాకినప్పుడు కలిగిన అందమైన అను భవం... ఒక తీయని షాక్‌లా తగిలింది శంకరానికి! భానుకి అతని స్పర్శతో ఒళ్లు ఝల్లుమంది. గుండె తడబడి ఊపిరి పీల్చటం కష్టమైంది. చిరుచెమటలు ఆమె నుదుట మెరుస్తున్నాయి. గభాలున కిందికి దిగి వెళ్లిపోయింది. ఆమె గదిలోకి వచ్చే సినా ఆ మధురక్షణాలు ఆమెను ఇంకా వెంటాడుతూనే ఉన్నాయి.

...ఆమె ముఖానికి దగ్గరగా అతని ముఖం, అతని వెచ్చని శ్వాస ఆమె మెడ వంపుని తాకింది. అతని స్పర్శ ఆమె మేనిలో గిలిగింతలు కలిగిస్తున్నది. ఏమిటీ వింత!? భర్తతో ఇన్నాళ్లుగా కాపురం చేస్తున్నా తనెప్పుడూ ఇలాంటి అనుభవం పొందలేదు? !

శంకరం అదోలా నవ్వేడు.

భాను అందంగా సిగ్గుపడింది.

గబుక్కున అతన్ని వదిలించుకుని గది లోకి వచ్చేసినా ఆ క్షణాలు మరిచిపోవడం ఆమెకి సాధ్యం కావడం లేదు! రెండు జంతువులు శృంగారం చేస్తే వాటి ముఖాల్లో ఎలాంటి ఎక్స్‌ప్రెషన్స్ ఉండవు! ఆ విధంగా ఇన్నేళ్ల తన సంసార జీవి తంలో తను ప్రసాదు పక్కన పడుకుంటే ఏనాడూ తనకిలాంటి పులకింత కలగ లేదు. అలాంటిది శంకరం స్పర్శ మాత్రం చేతనే తన శరీరం ఇంతలా తన్మయత్వం చెందుతోందేమిటి? 'మగాడు' అంటే శంక రంలా ఉండాలి! ప్రసాద్ ఏనాడూ తనని సంతోషపెట్టడానికి ప్రయత్నించలేదు. అతను ఏదో యాంత్రికంగా మసలేవాడు తప్ప ఆ ముఖంలో ఆనందంగాని, సంతృ ప్తిగాని తను ఎప్పుడూ చూడలేదు!

శంకరం వచ్చాక ఆమె మనసు కొత్త ఉత్సాహంతో పరవళ్లు తొక్కుతున్నది. శంకరం అసలుసిసలైన మగాడు అన్న అభిప్రాయం ఆమె మనసులో బలంగా నాటుకుపోయింది.

వాళ్లిద్దరూ ఒకర్నొకరు కోరుకుంటున్నా రని ఇద్దరికీ స్పష్టంగా తెలిసిపోయింది. కోరికల్ని అదుపులో పెట్టుకోవడం భానుకి కష్టమైన పనిగా తోచింది.

శంకరం వచ్చిన తరువాత భాను ఉద యాన్నే తొందరగా లేచిపోవడం, పిల్లల్ని రెడీచేయడం, వెంటనే స్నానం చేసి మంచి చీర కట్టుకుని అందంగా ముస్తాబవడం, ఎప్పుడూ వంటింట్లోనే ఉండి శంకరానికి ఏదో ఒకటి అందిస్తూ, సాయంచేస్తూ కబుర్లు చెప్పడంతో మునిగిపోతున్నది!

ప్రసాదు ఇంట్లో ఏం జరుగుతున్నదో పట్టించుకోడు!

అతనికి అంత తీరిక, ఓపిక లేవు. అత నికి ఎంతసేపూ ప్రపంచ విషయాలు తెలు సుకోవడంతోటే సరిపోతున్నది.

జానకిరామయ్యగారు చెట్లన్నింటికీ నీళ్లు పొయ్యడంలో బిజీగా ఉంటున్నారు. శంకరం వచ్చాక వసుంధర ఎప్పుడూ దేవుడి గదిలో పూజలతోనే కాలక్షేపం చేస్తున్నది. అందుకే భాను అతితక్కువ కాలంలో శంకరానికి బాగా దగ్గరైపో యింది.

మనసు కోతిలాంటిది! అదిచ్చే అర్థం పర్థంలేని సలహాలను మనం పాటిస్తూ పోతే సమస్యల వలయంలో ఇరుక్కు పోతాం. ఆ సంగతి భానులాంటి వాళ్లకి తెలియదు. రహస్యంగా కలుసుకోవడం, రహస్యంగా మాట్లాడుకోవడం, ఎవరైనా చూస్తున్నారేమోనన్న టెన్షన్, ఎవరూ చూడకుండా ఎన్నో జాగ్రత్తలు తీసుకో వడం, ఇదంతా వాళ్లిద్దరికీ భలే థ్రిల్లింగ్‌గా ఉంటోంది!

దోర ముగ్గిన జామపండుని తెచ్చి ముక్కలుకోసి ప్లేటులో పెట్టి ఉప్పు, కారం అద్ది తినమని ఇస్తే అందులో పెద్ద ఆనందం ఏమీ ఉండదు! కాని అదే జామ పండుని తోటమాలి చూడకుండా తిన డంలో చెప్పలేనంత థ్రిల్ ఉంది. భాను, శంకరంల పరిస్థితి అలాగే ఉంది. ఇద్దరూ అవకాశం కోసం ఎదురుచూస్తూ ఇంట్లో ఎవరికీ ఎటువంటి అనుమానం రాకుండా జాగ్రత్త పడుతున్నారు!




**వా**రం రోజుల తర్వాత భారతి ఏడుస్తూ ఫోన్ చేసింది.

"హలో అమ్మా! నువ్వూ-నాన్న అర్జం టుగా రండి" అంది ఏడుస్తూనే.

"ఏమయిందే? ఏడవకుండా చెప్పు? " అంది వసుంధర.

"ఘోరం జరిగిపోయిందమ్మా. సునీత మనకి మరిలేదు"

"అయ్యో! ఎలా జరిగింది? " ఆదుర్దా ధ్వనించింది ఆవిడ గొంతులో.

"ఏవండీ! భారతి కూతురు పోయిం దండీ!" భర్తతో చెప్పి గొల్లుమంది.

"అదేమిటి? మొన్ననే కదా నువ్వొచ్చేవు. అక్కడ్నుంచి నువ్వు వచ్చేటప్పుడు అది బాగానే ఉందికదే? ఇంతలో ఏమైంది? "

అంత సడన్‌గా సునీత ఎలా చనిపో యిందో ఎంత ఆలోచించినా తెలీడం లేదు జానకిరామయ్యకు.

"భారతి ఫోన్‌లో ఏమీ చెప్పలేదు. ఇద్దర్నీ వెంటనే బయల్దేరి రమ్మంది" అంది వసుంధర ఏడుస్తూనే.

ఇద్దరూ విశాఖపట్నం బయలుదేరారు.

వాళ్లిద్దరూ వెళ్లేసరికి సునీతశవం దగ్గర భారతి కూర్చుని ఏడుస్తున్నది. కూతుర్ని, మనవరాల్ని అలా చూసేసరికి, వాళ్లిద్దరికీ కడుపు తరుక్కుపోయింది.

"ఏమైందమ్మా? ఇంతసడన్‌గా... మేం నమ్మలేకపోయాం" దగ్గర కూర్చుని ఓదారుస్తూ అందావిడ.

"అమ్మా! నువ్వు వెళ్లిపోయిన తర్వాత మరో కొత్త సమస్య మొదలైంది. తనకు పెళ్లయినా పిల్లలెందుకు పుట్టడం లేదంటూ గొడవ మొదలెట్టింది. పక్కింటి వాళ్లమ్మాయికి నెల రోజుల కిందట డెలివరీ అయింది. బాబు పుట్టాడు. ఎప్పుడు చూసిందో, ఎలా చూసిందో తెలీదుగాని మా కళ్లు గప్పి వాళ్లింటికి వెళ్లిపోయి ఆ బాబుని ఎత్తుకుని గిరగిరా తిప్పేసింది. సరిగ్గా ఎత్తుకోవడం చేతకాక ఆ పసిగుడ్డుని కింద పడేసింది. దాంతో ఆ చంటివాడు గుక్కపట్టాడు. ఊపిరి వదిలేసేడేమోనని వాళ్లు వెంటనే డాక్టరు దగ్గరికి తీసుకెళ్లారు. ఆ బాబు బతికాడు కాబట్టి సరిపోయింది. వాళ్లంతా మా ఇంటికొచ్చి కోపంగా 'మీ అమ్మాయిని అదుపులో పెట్టుకోండి, బయటకు వదలకండి' అని చీవాట్లు పెట్టివెళ్లారు. నాకు ఏడుపొచ్చింది.

'నాకు అలాంటి బాబు కావాలి. నాకు పిల్లలు ఎలా పుడతారు? నాకు పిల్లలు కావాలి' అంటూ ఇరవైనాలుగ్గంటలూ గోల మొదలెట్టింది.

రెండు రోజుల బట్టి సునీతకి వంట్లో బాగులేదు. బెంగ పెట్టుకుందేమో. జ్వరం వచ్చేసింది. పడుకుంది. పైడిరాజుకి ఇల్లు అప్పజెప్పి, నేను పక్కవాళ్లింటికి వాళ్ల చంటిబాబుని ఉయ్యాల్లో వేస్తున్నారంటే వెళ్లాను. తిరిగి వచ్చేసరికి ఇంకేముంది? గదిలో సునీత కిందపడిపోయి ఉంది. దాని బట్టలనిండా రక్తమే. అది వేసుకున్న బ్లవుజ్ పక్కన పడివుంది. ఆచ్ఛాదనలేని దాని గుండెల్ని నేను తువ్వాలుతో కప్పాను. పైడిరాజు కోసం చుట్టూ చూశాను. వాడు ఎక్కడా కనబడలేదు. సునీత పరిస్థితి అనుమానాస్పదంగా ఉంది. నాకెందుకో పైడిరాజుమీద అనుమానం వచ్చింది. వాడి కోసం చుట్టుపక్కలంతా వెతికాను. వాడెక్కడా లేడు! వెంటనే ఆయన వచ్చేరు. పోలీసులకి ఫోన్ చేసేరు. పోలీసులు వచ్చారు. అది మామూలు మరణం కాదని, హత్య అని వాళ్లు నిర్ధారించారు. డాక్టరు పరీక్షలో సునీతది రేప్ అని, హత్య అని తేలింది.

'అమ్మాయిని ఎవరో రేప్ చేసి హత్య చేసేరు. పీకనులిమి చంపేరు. మీకు ఎవరిమీదన్నా అనుమానం వుందా?' అని ప్రశ్నించారు పోలీసులు.."

వెక్కిళ్ల మధ్య జరిగినదంతా చెప్పుకొచ్చింది భారతి.

ఉన్నట్టుండి ఆమె ఆవేశంగా అరిచింది.

"ఇది ఆ వెధవ పనే! ఆ పైడిరాజుగాడి పనే! సందేహం లేదు. పిచ్చిపిల్ల అని వాడి అవసరం తీర్చుకుని, అది కేకలు వెయ్యగానే నలుగురికి తెలిసిపోతుందని పీక నులిమి చంపేసి పారిపోయాడు వెధవ! సునీత వెనక వెనకే తిరుగుతూ దాని అవసరాలు తీరుస్తూంటే ఎంత మంచివాడో అనుకున్నాం. కాని వాడి మనసులో ఇంత ఛండాలపు ఆలోచన ఉందని, తిన్న ఇంటికే వాసాలు లెక్కపెడతాడని, ఇంతకి తెగిస్తాడని ఊహించలేదు నేను. నేను పిచ్చిదాన్ని. పిల్లని కాపాడుకోలేకపోయాను" వెక్కివెక్కి ఏడుస్తోంది భారతి.

పోలీసులు పైడిరాజుని వెతికి పట్టుకొచ్చేరు. తలదించుకొని నించున్నాడు. భారతి భర్త వాడి దగ్గరకెళ్లి ఈడ్చితన్నాడు. పోలీసులు థర్డ్ డిగ్రీ అప్లయి చేశాక వాడు నిజం ఒప్పుకున్నాడు.

వాడు రోజూ సునీత బాత్‌రూం తలుపు తీసుకుని నగ్నంగా స్నానం చేస్తూంటే చొంగ కార్చుకుంటూ చూసేవాడు. ఆమె అవయవ సంపదని, వయసు తెచ్చిన

అందాలని అదేపనిగా చూస్తూ ఆమె వెనక వెనకే తిరుగుతూ అవకాశం కోసం ఎదురు చూసేడు. ఆరోజు భారతి పక్కింటికి వెళ్లి నప్పుడు పైడిరాజు మెల్లగా సునీత పక్కకి చేరేడు.

"పాపా! నీకు పిల్లలు కావాలి కదా. నేను చెప్పినట్టు చేస్తే నీకు పిల్లలు పుడతారు. ఎంచక్కా చంటిబాబు పుడితే వాడితో నువ్వు ఆడుకోవచ్చు" అన్నాడు ఆమెను కాంక్షతో చూస్తూ... పాపం ఆ పిచ్చిపిల్ల నమ్మేసింది.

'భలే. భలే. తెప్పు. ఏంతెయ్యాలి? వూఁ తెప్పు' అంటూ వాడిమీద పడిపోయి కొట్టేస్తూ, గిల్లేస్తూ గొడవ మొదలుపె ట్టింది. అలా మీద పడినప్పుడు ఆమె ఎద ఎత్తులు మెత్తగా వాడికి తగిలి కోరికతో వాడి ఒళ్లు రగిలిపోయింది.

'మనం ఇప్పుడు మొగుడు-పెళ్లాల ఆట ఆడుదాం. సరేనా? నేను మొగుడుట. నువ్వు పెళ్లాంట. నువ్వు నోరు మెదపకూ డదు. అరవకూడదు. తెలిసిందా?' హెచ్చ రికలు చెప్పాడు పైడిరాజు. 'అలాగే' అన్నట్టు తలూపింది. పిల్లలు కావాలన్న పిచ్చి కోరిక బుర్రలో దూరిన ఆ పిచ్చిపిల్లకి ముందు ఏమవుతోందో అర్థం కాలేదు. తర్వాత బాధకి ఓర్చుకోలేక అరవడం మొదలెట్టింది. వాడు బలాత్కారం చేస్తూంటే సునీత వాడి చేతిమీద కసితీరా కొరికింది. గట్టిగా అరిచింది. అందరికీ విని పిస్తుందని వాడు భయపడిపోయి సునీత పీక నులిమి చంపేసాడు. సరిగ్గా ఆ సమ యానికి వీధి తలుపు చప్పుడైంది. భారతి తలుపు కొడుతున్నది. వాడి గుండె జారి పోయింది. ఏం చెయ్యాలో తెలీక పెరటి తలుపు తీసుకుని పారిపోయేడు!! జరిగిన దంతా వాడినోట విన్న పోలీసులు వాణ్ణి నాలుగుతన్ని అరెస్టుచేసి తీసుకెళ్లిపో యారు!

నాలుగు రోజులు గడిచిపోయేయి. ఉన్న ఒక్క కూతురు... పిచ్చిపిల్ల అయినా తన పేగు తెంచుకుపుట్టింది. అమ్మా... అమ్మా... అని తనేపని చేస్తున్నా కాళ్లకడ్డం పడేది. పేగు బంధం అది! మర్చిపోలేని, మరువరాని అనురాగ బంధం!

"అమ్మా! నాకే ఎందుకిలా జరిగింది? నేనేం పాపం చేసేను? నిజంగా దేవుడే ఉంటే ఎందుకిలా చేస్తాడు? నిజంగా దేవుడు లేడమ్మా" తలకొట్టుకుంటూ పె ద్దగా ఏడ్చింది భారతి.

జానకిరామయ్య అంతా విన్నారు.

"అమ్మా భారతీ! దేవుడ్ని నిందించడం మంచిది కాదమ్మా. అభిమన్యుడు పద్మ వ్యూహంలోంచి బయటపడలేక యుద్ధరం గంలో వీరమరణం పొందినప్పుడు అర్జునుడు విలపిస్తూ కృష్ణుడ్ని నిందిం చాడు. ఆ కృష్ణభగవానుడు అభిమన్యుని గత జన్మ గురించి యథార్థాన్ని వివరిస్తూ నొసటిరాతను ఎవరూ తప్పించలేరని, జన్మ జన్మల కర్మలను, పాపపుణ్యాలను అనుస రించి సుఖదుఃఖాలు ప్రాప్తిస్తాయని చెప్తాడు. అంతా రుణానుబంధం! పునరపి జననం పునరపి మరణం! ఈ జీవితాలు శాశ్వతాలు కావు. ఈ జీవితం ఒక నాటక రంగం. మన పాత్ర అవగానే తెరమరుగ యిపోతాం. బంధాలు-బాధలు, కష్టాలు-కన్నీళ్లు, అనురాగాలు- ఆప్యాయ తలు అన్నీ మనిషిలో ఈ భూమ్మీద ఉన్నంత వరకే? ఏదీ మన చేతిలో లేదని తెలిసినా ఆశ-నిరాశల మధ్య వూగిసలా డుతూ ఆఖరి క్షణం వరకు బతుకీడుస్తూనే ఉంటాం!" అప్రయత్నంగానే ఆయన కళ్లంట నీళ్లూరేయి.

భారతి మనసు బాగా దెబ్బతింది. ఆమెకి ఓదార్పు కావాలి. అందుకే మరో వారం రోజులు అక్కడే ఉండాలని నిశ్చ యించుకున్నారు వాళ్లిద్దరూ.

# అరవై ఏళ్ల తర్వాత కలయిక




న్యూయార్క్‌కి చెందిన బార్బరారోల్(70) పదేళ్ళ అమ్మాయిగా ఉండగా, అరవై ఏళ్ల క్రితం ఆమె టీచర్, విద్యార్థులకి ఓ అసైన్‌మెంట్ ఇచ్చింది. అది కొరియాలోని ఓ అమెరికన్ సైనికుడికి ఉత్తరం రాయడం. బార్బరా రాసిన ఉత్తరం ఇరవై ఏళ్ళ ఆర్విల్ అనే సైనికుడికి చేరింది. 1950 నుంచి వారిద్దరి మధ్య ఎడతెగక ఉత్తర ప్రత్యుత్తరాలు సాగుతూనే ఉన్నాయి. యుద్ధానంతరం ఆర్విల్ అమెరికాక తిరిగి రావడమే కాక సైన్యం నించి పదవీ విరమణ పొందాడు కూడా. ఇటీవలే జూలై ఆఖరి వారంలో బార్బరారోల్ న్యూయార్క్ వచ్చిన తన కలం స్నేహితుడు ఆర్విల్‌ని తొలిసారిగా కలుసుకుంది. వారి కలయికని న్యూయార్క్ పోస్ట్, కొన్ని టీవీ ఛానల్స్ చక్కగా కవర్ చేసాయి.



# వృద్ధ ప్రేమికురాలి నిర్వాకం



అమెరికాలోని అట్లాంటాకి చెందిన లీనా బ్రిస్కెల్ (78)కి ఓ మునిమనవరాలుంది. విధవరాలైన లీనా సంవత్సరంపాటు హెర్మన్ విన్‌స్లో (85)తో ప్రేమలో పడింది. అయితే అతను మరో వృద్ధురాలితో అఫైర్ కలిగి ఉన్నాడని తెలుసుకుని, అత నుండే ఓల్డేజీ హోంకి వచ్చి ఓ పురాతన పిస్తోలుతో ఆమె అతన్ని బెదిరించింది. పోలీసులు ఆవిడని అరెస్ట్ చేశారు. ఇరవైఅయిదు వేల డాలర్ల బాండ్‌ను పూచీకత్తుగా పెట్టడంతో ఆమెకి బెయిల్ లభించింది.

★ ★ ★

ఆరోజు ప్రసాదు కోర్టుకి వెళ్లిపోయేడు. పిల్లలు ప్రసాదు కన్నా ముందే స్కూలు కెళ్లిపోయేరు. ఇంట్లో భాను, శంకరం తప్ప మరెవ్వరూ లేరు. ఇదే మంచి అవకాశం. శంకరం కూడా అదను కోసం ఎదురుచూస్తున్నాడు. అప్పటిదాకా ఎండగా ఉన్న వాతావరణం, కారు మబ్బులు కమ్ముకుని చల్లటి గాలి వీచడంతో చల్లబడిపోయింది. మరికొద్ది సేపట్లో వర్షం మొదలైంది. భాను తన గదిలో ఉంది. శంకరం మెల్లగా ఆమె గదిలో అడుగుపెట్టేడు. వెంటనే ఆకలిగొన్న పులి లేడిపిల్ల మీద ఉరికినట్టుగా అమాంతం ఆమెను వాటేసుకుని ఉక్కిరిబిక్కిరి చేసేడు. గాలి కూడా చొరబడలేనంతగా తన బిగికౌగిట్లో ఆమెను బంధించి నఖశిఖపర్యంతం ముద్దుల్తో ముంచెత్తాడు. ఆమె అతన్ని అల్లుకుపోయింది. ఆ గాఢ పరిష్వంగంలోని సుఖం వాళ్లిద్దరికీ అలవాటే. అయినా మొదటిసారి చవిచూస్తున్నదానిలా ఆమె తన్మయత్వంతో కళ్లు మూసుకుంది. వాళ్లిద్దరూ కొంతసేపు ఈ ప్రపంచాన్ని మర్చిపోయేరు. ఒకసారి నరమాంసం రుచి చూసిన పులి మళ్లీ మళ్లీ అదే కావాలని కోరుకుంటుంది! వీలు చిక్కినప్పుడల్లా వాళ్లిద్దరూ ఎవరికీ అనుమానం రాని విధంగా రహస్యంగా కలుసుకోవడం మొదలెట్టారు.

జానకిరామయ్య, వసుంధరలు ఇంటికి వచ్చేశారు. భాను ఇదివరకటికంటే ఇప్పుడు మరింత ఉత్సాహంగా ఉంటున్నది.

కారణం అంతుబట్టలేదు వసుంధరకి. కాని ఆమెలో ఏదో మార్పు వచ్చిందని మాత్రం గ్రహించింది ఆవిడ.

ఒకరోజు భాను శంకరం చేతికి డబ్బి స్తూంటే వసుంధర చూసింది.

శంకరం వెళ్లిపోయాక వసుంధర భానుని పిల్చి అడిగింది.

"భానూ! నువ్వు శంకరానికి డబ్బెందుకి చ్చేవు? " అంది.

భాను ఒక్క క్షణం తడబడింది.

"అదా, పాపం వాళ్లావిడకి ఒంట్లో బాగు లేదట. అయిదు వందలుంటే ఇమ్మన్నాడు. నా దగ్గరున్న డబ్బు తీసి ఇచ్చాను" అంది భాను.

వసుంధర ఏమీ మాట్లాడలేకపోయింది. కాని ఆ తర్వాత చీటికీ-మాటికీ శంకరం ఏదో కారణం చెప్పి డబ్బు అడగడం, భాను వాడి చేతికి డబ్బు ఇవ్వడం జరుగుతు న్నది. ఇదంతా చూసి వసుంధర ఊరుకో లేక భర్తతో చెప్పింది.

ఒకరోజు జానకిరామయ్యగారు శంక రాన్ని నిలదీసి అడిగేరు. "ఏమిటి శంకరం? మాటిమాటికి డబ్బు అడిగి పట్టుకెళ్తున్నావుట. అంత అవసరం ఏమొ చ్చింది? ఎక్కువ జీతానికే ఒప్పుకున్నాం కదా? !"

"మా ఆవిడ్ని వైజాగ్ హాస్పిటల్‌లో జాయిన్ చేసేనండి. డాక్టరు ఫీజులు, హాస్పిటల్ ఖర్చులు అవీ ఉంటాయి కదండీ. ఆమెకి పెద్ద ఆపరేషన్ చెయ్యాల న్నారు డాక్టర్లు. మందులకి-మాకులకి బోలెడు అవుతుంది కదా? అందుకే భానమ్మ గారిని అడిగి తీసుకున్నాను" చెప్పాడు శంకరం.

జానకిరామయ్యగారికి జాలేసింది. మరేం మాట్లాడలేకపోయేరు. వసుంధరకి మాత్రం అనుమానం వచ్చింది.

"వాడికి ఇంత డబ్బు ఇస్తున్నావు కదా? ఇదంతా ప్రసాద్‌కి తెలుసా? "

"ఇదంతా... అంటే ఏదంతా? " చురుగ్గా చూస్తూ అడిగింది భాను.

"అదే. నువ్వు శంకరానికి డబ్బు ఇస్తున్న సంగతి. ప్రసాదుకి చెప్పే ఇస్తున్నావా... అని!"

"ఇందులో ఆయనకి చెప్పాల్సిన అవ సరం ఏముంది? నా డబ్బు అది. నేను ఇస్తున్నాను. అయినా సాటి మనిషి కష్టాల్లో ఉంటే ఆదుకోవడం ధర్మం. మాన వత్వం అన్నది లేకుండా ఎంతసేపూ స్వార్థం కోసం పాకులాడ్డం చాలా తప్పు అత్తయ్యా!"

వసుంధరకి నోట మాట రాలేదు మాన వత్వం గురించి భాను నోటి వెంట వినాల్సి వచ్చినందుకూ. ఆమె అలా అంటూవుంటే దయ్యాలు వేదాలు వల్లించినట్టుగా ఉంది!

"సర్లే. కాని ప్రసాద్ ఎంతైనా నీ భర్త. వాడికి తెలియడం మంచిదని నా అభి ప్రాయం!" భాను స్వభావం ఆవిడకి తెలుసు. అందుకే ఎప్పుడు మాట్లాడినా జాగ్రత్తగా ఆచితూచి మాట్లాడుతుంది.

"ఈ విషయంలో ఇతరుల సలహాలు అనవసరం అని నా అభిప్రాయం. ఒక మంచిపని చెయ్యడానికి కూడా ఇన్ని అడ్డం కులుంటాయని నాకిప్పుడే తెలిసింది!" చురక అంటించినట్టుగా ఉన్నాయి భాను మాటలు. ఇదంతా జానకిరామయ్యగారు విన్నారు. తర్వాత ప్రసాదుకు జరుగుతున్న దంతా ఆయన చెప్పారు. అంతా విని ప్రసాదు తెల్లమొహం వేసాడు. అతనికివేవీ తెలియవు. భానుని నిలదీసి అడిగాడు.

"అంత డబ్బు వాడికెందుకిస్తున్నావు? "

"నా డబ్బు. నా ఇష్టం. అడగడానికి మీరెవరు? "

"ఆ డబ్బు నీకెలా వస్తున్నది? నేను నీకు ఇస్తున్న డబ్బేకదా."

"అయితే! ఒకసారి నాకిచ్చేసేక అది నా

డబ్బే అవుతుంది" మొండిగా జవాబిచ్చింది భాను.

"అంటే! శంకరానికి నువ్విచ్చిన డబ్బు కూడా శంకరందే అవుతుందా? చెప్పు!" అతను గట్టిగా అరిచేసరికి మాట్లాడలేక ఊరుకుంది భాను.

"ఇదంతా వాళ్లపనే. వాళ్లిద్దరూ నా మీద లేనిపోనివి నూరిపోస్తున్నారు!" అంది కోపంగా.

"తప్పులు నువ్వు చేస్తూ మధ్యన అమ్మ నాన్నలని ఆడిపోసుకుంటావు దేనికి? నీ హద్దుల్లో నువ్వుంటే మంచిది" అక్కడ్నుంచి వెళ్ళిపోయేడు ప్రసాదు.

ప్రసాదుకి ఎవరితోనూ గట్టిగా వాదించడం, గొడవ పడ్డం ఇష్టం ఉండదు. ఇంటి విషయాలు ఎప్పుడూ పట్టించుకోడు. అలా పట్టించుకోకపోవడం వల్ల కొన్ని అనర్థాలు జరుగుతాయని అతను ఊహించలేదు.




ఆ రోజు పనిమీద వసుంధర పెరటి వైపున్న కొట్టుగది వైపు వెళ్లింది ఆ గదిలో ఒక పరుపు, దిండు, ఆ పక్కనే టేబుల్ ఫ్యాను కనిపించేయి. ఆశ్చర్యపోయింది. వెంటనే ఆవిడ భానుని పిలిచింది. ఆవిడ ఎందుకు పిల్చారో భానుకి అర్థమైపోయింది.

తప్పు చెయ్యడంకన్నా తప్పు చేస్తూ దొరికిపోవడం చాలా బాధాకరం!

"భానూ! టేబుల్ఫ్యాను ఇక్కడికెలా వచ్చింది? మీ గదిలో ఉండే పరుపు, ఫ్యాను ఇక్కడ ఎవరు వేసేరు? " అనుమానంగా అడిగింది ఆవిడ.

భానుకి అప్పటికే చిరుచెమటలు పట్టేసాయి. అయినా బయటకు కంగారు కనబడనియ్యకుండా అంది, "అదా... అత్తయ్యా! అదీ... పాపం... శంకరం.. రెస్టు తీసుకుంటానంటేనూ మన పనిమనిషి రంగమ్మచేత నేనే ఇక్కడ వేయించేను!"

"అదేమిటి! వంటవాడికి రెస్టు ఏమిటి? వంట వండి వెళ్ళిపోతాడు కదా? "

"అదేమిటత్తయ్యా అలా అంటారు! వాడు మాత్రం మనిషి కాడా? "

ప్రతీ విషయంలోనూ శంకరాన్ని వెనకేసుకొచ్చి మాట్లాడ్డం, శంకరానికి మాటిమాటికి డబ్బివ్వడం, ఈ కొట్టు గదిలో వాడి కోసం పరుపు, ఫ్యాను వేయించడం... ఇవన్నీ చూస్తూంటే వసుంధరలో ఏవో అనుమానాలు కలగసాగాయి.

విషయం చాలా దూరం వెళ్ళిందని అనుభవజ్ఞురాలైన ఆవిడ గ్రహించడానికి ఎక్కువ సమయం పట్టలేదు. ప్రసాదు పిరికితనంవల్లే భాను ఇలా తయారయింది. పెళ్ళాన్ని అదుపులో పెట్టుకోవడం చేతకాని కొడుకు మీద పట్టరానంత కోపం వచ్చింది ఆవిడకి. భానుతో ఏం వాదించాలన్నా చిక్కే. గోడక్కొట్టిన బంతిలా తనకే తిరిగి మాటలు అప్పజెప్పేస్తుంది. అర్థం పర్థం లేకుండా వాగుతుంది.

ఏ చిన్న బాధనైనా భర్తతో పంచుకోవడం ఆవిడకి అలవాటు. జానకిరామయ్యగారికి జరిగిన విషయాలన్నీ చెప్పేసింది ఆవిడ. ఆయన వెంటనే పరుపు, ఫ్యాను అక్కడ్నించి తీయించేసేరు. ఆయన అలా చెయ్యడంతో భానుకి బాగా కోపం వచ్చింది.

తర్వాత కొన్ని రోజులకి శంకరం మళ్ళా డబ్బు అడిగేడు. పెరట్లో ఏవో గుసగుసలు వినిపించి వసుంధర అటు వెళ్లింది.

భాను శంకరంతో ఏదో మాట్లాడు తోంది.

"ఏమిటి భానూ? ఏమయింది? " నెమ్మ దిగానే అడిగింది.

కాని ఆ సమయంలో అక్కడ అనుకో కుండ అత్తగార్ని చూసేసరికి ఇద్దరి కాళ్ళూ వణికాయి. భాను సర్దుకుంది.

"పాపం. శంకరం భార్యకి సీరియస్‌గా ఉందట, అత్తయ్యా! అర్జంటుగా రెండువేలు కావాలంటున్నాడు. నా దగ్గరున్న డబ్బంతా అయిపోయింది. ఏంచెయ్యాలో తెలీడం లేదు."

'అసలు వాడికి డబ్బు ఇబ్బంది అయితే ఇంట్లో పెద్దాయన ఉండగా భానునే ఎందుకు అడగడం? '

వాడు చీటికి మాటికి భానుని డబ్బు ఇమ్మని వేధించడం, భాను డబ్బు సర్దు బాటు చెయ్యలేక సతసతమవడం వసుంధ రకి స్పష్టంగా తెలుస్తూనే వుంది.

"శంకరం! నీకు డబ్బుకి అంత ఇబ్బం దిగా ఉంటే అయ్యగారిని అడగాలి గాని ఆ అమ్మాయిని అడిగితే ఎక్కడ్నుంచి తెస్తుంది? " నిలదీసింది వసుంధర.

శంకరం ఏమీ మాట్లాడలేదు. తలవం చుకుని వెళ్ళిపోతూవుంటే భాను పిలిచింది. "నేను సాయంత్రంలోగా నీకు డబ్బు ఇస్తాను. నువ్వేం బెంగపెట్టుకోకు" అని శంకరంతో అని, వసుంధర వైపు తిరిగి, "పాపం! వాళ్లావిడ చావు బతుకుల మధ్య ఉందట. మీకింత ఆస్తి ఉంది. చచ్చిపోయే టప్పుడు మీరేం పట్టుకుపోతారా? సాటి మనిషికి సాయంచేస్తే తప్పేంటి? " అని ముఖాన్నే అడిగేసింది.

భాను నోటి ధాటి వసుంధరకు తెలుసు. భానుతో వాదనకు దిగడం అంత తెలివిత క్కువ పని మరొకటి ఉండదు. భాను సాయంత్రంలోగా తన నగల్ని తాకట్టు పెట్టి శంకరానికి డబ్బు రెడీ చేసింది. ఆ విషయం ప్రసాదుతో సహా ఇంట్లో అంద రికీ తెలిసిపోయింది. మధ్యాహ్నం ప్రసాదు రాగానే అందరూ కలిసి భానుని నిలదీసి అడిగేరు.

"వాడికీ-నీకూ ఏమిటి సంబంధం? వాడు నీకేమవుతాడు? వాడు అడిగినప్పు డల్లా నువ్వెందుకు లేదనకుండా డబ్బు యిస్తున్నావు? "

భాను బెదరలేదు. "శంకరం నాకు అన్నయ్య లాంటివాడు. నాకు అన్నయ్య లేనిలోటు తీరుస్తున్నాడు. చెల్లెలు అన్న య్యకు సాయం చెయ్యడం తప్పెలా అవు తుంది? ప్రతీ దానిని మీరు భూతద్దం లోంచి చూసినట్టుగా చూసి మాట్లాడితే నేనేం చెయ్యలేను" అంది ధుమధుమలా డుతూ.

"అమ్మా! వాదనలెందుకు? ఆ శంక రాన్ని పనిలోంచి తీసెయ్యండి. అప్పుడు ఏ సమస్యా ఉండదు" అని ప్రసాదు అక్క డ్నుంచి వెళ్లిపోయేడు.

కాని సమస్య అలా తీరిపోలేదు.

మర్నాడు వసుంధర, జానకిరామయ్యలు భోజనాలు చేసి ఏవో కబుర్లు చెప్పుకుంటు న్నారు. ఇంతలో భాను సూట్‌కేస్‌తో గది లోంచి ఇవతలకి వచ్చింది.

ఆమె ముభావంగా ఉంది.

"నేను మా పుట్టింటికి వెళ్తున్నాను" ముక్తసరిగా అంది.

"పిల్లల్ని తీసుకువెళ్లవా? "

ఆమె జవాబివ్వలేదు.

"భానూ!" ఆమె వెళ్లిపోతూంటే తోవకడ్డంగా నించుని అరిచేరు జానకిరా మయ్య.

"నువ్వు మరీ చిన్నపిల్లవేం కాదు. నువ్వు ఎందుకిలా తిక్కతిక్కగా ప్రవర్తిస్తున్నావో

అర్థం కావడం లేదు. నిజం చెప్పు. నువ్వెక్కడికి వెళ్తున్నావు? నిజంగా మీ పుట్టింటికేనా? "

"నేను ఏ పని చెయ్యాలన్నా, ఎక్కడికి వెళ్లాలన్నా నాకు స్వతంత్రం లేదు. నా మొగుడుకి నేనంటే లక్ష్యం లేదు. అత్తవారింట్లో ఇన్ని ఆంక్షల మధ్య బతకడం నా వల్ల కాదు..." విసురుగా ముందుకు నడవబోయింది.

వసుంధర గుమ్మానికి కడ్డంగా నించుని, "భానూ! పరువు-ప్రతిష్టలు గల కుటుంబం మనది. పరువు తక్కువ పనులు చెయ్యడం ఈ ఇంటి కోడలిగా నీకు సమంజసం కాదు. నా మాట విను. ప్రసాదుకి నువ్వంటే చాలా ఇష్టం. నిన్ను ఏరికోరి చేసుకున్నాడు" ప్రాధేయపడింది ఆవిడ.

ప్రసాద్ కూడా జరుగుతున్నదంతా చిత్తరువులా చూస్తుండిపోయాడు తప్ప భార్యను ఆపే ప్రయత్నం చేయలేదు.

"నాకు ఎవరూ ఏమీ చెప్పక్కర్లేదు" కోపంగా వసుంధరని నెట్టేసి మరీ వెళ్లిపోయింది భాను బయటకి.

ఆ దారుణాన్ని ఎలా ఆపాలో వాళ్లకి అర్థం కాలేదు. వీధిలోకొచ్చి చూసేరు. దూరంగా ఓ టాక్సీ ఉంది. అందులోంచి తల బయటకుపెట్టి చూస్తున్నాడు శంకరం .

ఇప్పుడు విషయం పూర్తిగా అర్థమైపోయింది!

పోయింది! ఇంటి పరువు కాస్త పోయింది!

'కామాతురాణాం... న భయం... న లజ్జ!' కామంతో కళ్లు మూసుకుపోయిన వాళ్లకి సిగ్గు, భయం, లజ్జ ఏవీ ఉండవు! ఆవేశం ఆలోచనని నశింపజేస్తుంది. అది ఎన్నో అనర్థాలకి హేతువు అవుతుంది!

వెళ్లొద్దని బతిమాలినా వినకుండా వెళ్లిపోయిన కోడల్ని చూసి వాళ్లిద్దరూ శిలాప్రతిమల్లా బిగుసుకుపోయారు.

వసుంధరకి కాళ్ల కింద భూమి కదిలిపోయి తను అందులో కూరుకుపోతున్నట్టు అనిపించింది!

'ఏమిటిది? ఎందుకిలా జరిగింది? ఇక్కడ ఆమెకి ఏం లోటు వచ్చింది? '

"వినాశకాలే విపరీత బుద్ధి అంటారు దీన్నే! అజ్ఞానం ఆమెచేత అలా ఆట లాడిస్తున్నది" జానకిరామయ్య నిట్టూర్చారు.

జీవితం తామరాకు మీద నీటి బొట్టు లాంటిది. ఎలాంటి క్లిష్ట సమస్య ఎదుర్కోవాల్సి వచ్చినా మానసిక స్థైర్యాన్ని కోల్పోకూడదనేది ఆయన సిద్ధాంతం. ఆమెను బలవంతంగా గదిలో పెట్టి బంధించవచ్చు. కాని అది అనుచిత చర్య అవు

## వెధవలెక్కలూ మీరూనూ..

ఒకసారి మునిమాణిక్యంవారు పిల్లలకు పని-కాలం లెక్కలు చెబుతున్నారు. 'అయిదు గేలన్ల నీళ్లు పట్టే తొట్టిలోకి పైనుండి పంపు నీళ్లు పడుతున్నాయి. అయితే ఆ తొట్టికి ఉన్న రంధ్రంలోనుండి అందులో పడిన నీళ్లు ఫలానా మొత్తంలో కారిపోతున్నాయి. పైనుండి పడేనీళ్లు గంటకు ఇరవై అయిదు గేలన్లయితే, ఆ తొట్టి ఎంతసేపట్లో నిండుతుంది? ' అనేది ప్రశ్న. పిల్లలు చేయలేకపోతే కోప్పడి మరీ చెబుతున్నారాయన. ఈ గొడవంతా కాంతం వింటూనే ఉంది. గదిలో నుంచి బయటికి వచ్చి 'ఆ తొట్టి నిండడం ఏవిటండీ? ఒక చెంపనీళ్లు కారిపోతుంటే ఎలా నిండుతుంది? వెధవ లెక్కలూ-మీరూనూ. అయినా చిల్లితొట్టిలో నీళ్లు నింపే ప్రయత్నమేమిటి? చిల్లికి కాస్తా మాటు వేయిస్తే పోయేదానికి ఇటువంటి పిచ్చి లెక్కలు చెప్పకపోతేనేం? ' అంది కాంతం





తుంది! అందుకే వాళ్లు ముగ్గురూ ఏమీ చెయ్యలేక నిస్సహాయంగా చూస్తుండిపోయేరు.

టాక్సీ వైజాగ్ వైపు వెళ్లడం వాళ్లు చూసేరు.

రెండు నెలల క్రితం ప్రసాదు వైజాగ్‌లో శివాజీపాలెంలో భాను పేరుమీద ఒక ఫ్లాటు తీసుకున్నాడు. ఇప్పుడు భాను శంకరంతో ఆ ఫ్లాటులో ఉండడానికి నిశ్చయించుకుంది.

పిల్లలిద్దరూ ఇంటికొచ్చి వాళ్ల మమ్మీ కోసం వెతుకుతున్నారు.

"అమ్మ వచ్చేస్తుంది. అమ్మమ్మ వాళ్లింటికి వెళ్లింది" అని మభ్యపెట్టి వాళ్లిద్దరికీ బిస్కట్లు యిచ్చి అవి తిన్నాక, కాంప్లాను ఇచ్చి బట్టలు మార్చింది వసుంధర. రాత్రి తొందరగా వంటచేసి ఇద్దరికీ అన్నం కలిపి ముద్దలు చేసి పెట్టింది.

జానకిరామయ్య వాళ్లచేత హోమ్‌వర్క్ చేయించి, మంచి కథలు చెప్తూ పడుకోబెట్టేరు.

ప్రసాదు సాయంత్రమే బయటకు వెళ్లేడు. రాత్రి పన్నెండయినా ఇంటికి రాలేదు. వసుంధర బెంబేలు పడిపోయింది.

"ఏవండీ. నాకేదో భయంగా ఉంది" నిబ్బరం కోల్పోయి భోరున ఏడ్చేసింది వసుంధర.



అన్నారు బాధగా జానకిరామయ్య.

★ ★ ★

జానకిరామయ్య గుండెని చిక్కబట్టుకోవడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ "ధైర్యంగా ఉండు వసూ!" అన్నారు. ఇద్దరూ ప్రసాదు కోసం ఆత్రంగా వీధి గుమ్మంవైపే ఎదురు చూస్తూ కూర్చున్నారు.

"ఇంతవరకు రానియ్యడం మన ప్రసాదు తప్పే. ఆ పిల్లని గదిలో పెట్టి నాలుగు తంతే దారిలోకి రావచ్చు. కాని కాలం మారిపోయింది. సానుభూతి అమ్మాయిల వైపే ఉంది. ఆడది తప్పు చేసినా అత్తగారు తనని సాధిస్తున్నారని, రాచిరంపాన పెడుతున్నారని, భర్త వేధిస్తున్నాడని ఆమె కోర్టులో కేసు బుక్ చేసిందంటే కోర్టువాళ్లు మరేం ఆలోచించరు. ఆమె మాటలు నమ్మి అత్తగారిని, మావగారిని, భర్తని ముందు జైల్లో పెడతారు! అందుకే కోడలు ఎన్ని రకాల వేషాలు వేసినా సహించి, భరించి, ఊరుకుంటున్నాం తెలిసిందా!"

కడుపులోకి జారిన విస్కీ క్రమంగా అతడి నరాలను మత్తెక్కిస్తూ అతడిలోని టెన్షన్నీ, అవమానాన్ని, బాధని మర్చిపోయేలా చేస్తోంది. అయినా స్వేద రంధ్రాల్లో సూదులు గుచ్చుతున్నట్టుగా ఏదో బాధ. తూలుతూనే లేచి నిలబడ్డాడు ప్రసాద్. మెదడు పని చేస్తూండడం వల్ల ఆలోచనలు గజిబిజిగా అల్లుకుపోతున్నాయి అతని మనసులో...

'భానుకి నేనంటే ఇష్టం లేదు. ఆ విషయం మొదటి రాత్రే స్పష్టంగా చెప్పింది. కానీ నాకు భాను అంటే ఇష్టమే. భానూ! ప్రేమని, ఇష్టాన్ని ఎలా వ్యక్తం చేయాలో నాకు తెలీదు. అలా వ్యక్తం చెయ్యడం అన్నది ఒక కళ... టాలెంట్. నువ్వు తప్పు చేసావు! తప్పు చేసావా? నేను తప్పు చేసానా? నాకే టాలెంట్ లేదేమో!'

ప్రసాద్ మనసు లోపలి పొరల్లో ఏదో అలజడి... చిత్రంగా ఆ రూపంలో బయటికొచ్చింది.

అరే... అదేమిటి తను అలా ఆలోచిస్తున్నాడు! తప్పు పూర్తిగా భానుదే. ఒక

హిందూ స్త్రీ చెయ్యవల్సిన విధంగా తను చెయ్యలేదు. తన ప్రవర్తన తప్పుదారిలో పడింది! తనతో ఇన్నాళ్లు కాపురం చేసి, తనని కాదనుకుని వాడితో లేచి వెళ్లిపోయింది. ఎంత ధైర్యంగా పిల్లల్ని, మొగుడ్ని, సంసారాన్ని అన్నింటిని కాదనుకుని ఎలా వెళ్లగల్గింది? పరువు, మర్యాద, కుటుంబ గౌరవం, సంస్కృతి, సంప్రదాయం అన్నీ కాలదన్నుకుని అన్నింటికీ తెగించి వెళ్లిపోయింది! పాపాత్మురాలు! ప్రసాద్ కోపంతో పళ్లు పటపట కొరికేడు!

మనసుని కోస్తూ, గుండెలని చీలుస్తూ, చావనీయకుండా, బతకనీయకుండా చుట్టూ పరిస్థితులు! అతని కళ్లలోంచి అప్రయత్నంగా అశ్రువులు జారిపడుతున్నాయి. తూలుతూ లోపలికి వచ్చిన ప్రసాదుని చూసి వసుంధర గుండె తరుక్కుపోయింది!

జానకిరామయ్య ప్రసాదు భుజంమీద చేయివేసి బెడ్‌రూం దాకా నడిపించి తీసుకువెళ్లారు. ప్రసాదు పరుపు మీద అడ్డంగా, అచేతనంగా పడిపోయేడు. ఆయన కొడుకుని ఆ స్థితిలో చూసి నిశ్శబ్దంగా కన్నీరు కార్చారు.

ఆయన జీవితంలో చాలా అలసిపోయారు. అలసిపోయిన, సున్నితమైన మనసుపైన విధి వాతలు పెడుతోంటే నిస్సత్తువుగా, నిస్సహాయంగా కొడుకువైపే చూస్తూ అలా నించుండిపోయారు. తర్వాత వసుంధర దగ్గరకొచ్చి కూర్చున్నారు. కాలం కష్టంగా కదులుతున్నది.

"వసుంధరా! ఏమిటిదంతా! తట్టుకునే శక్తి మరి ఈ గుండెకు లేదు వసూ!" ఆవేదన అతని మాటల్లో స్పష్టమవుతున్నది.

ఆవిడకి... ఆయన... ఆయనకి... ఆవిడ, ఒకర్నొకరు ఓదార్చుకున్నారు!

ముగింపు దగ్గరపడ్డ మన జీవితాలకు ఇంకా ఈ బాధ్యతలు, బాధలు, బంధాల సంకెళ్లు ఎందుకు? ఎందుకు? వాళ్లిద్దరి హృదయాలు మూగగా ఆక్రోశిస్తున్నాయి!

ఆ రోజు రాత్రి వాళ్లిద్దరికీ నిద్రపట్టలేదు. పక్షుల కిలకిలారావాలు, ఆకు కూరలమ్మే వాళ్ల కేకలతో తెల్లవారింది. పాలవాడు పాలపాకెట్లు గుమ్మం ముందు పెట్టి వెళ్లిపోయేడు. వసుంధరకి లేవక తప్పలేదు. పిల్లలకోసమైనా లేవాలి. తప్పదు. ఆవిడ లేచి పాల పాకెట్లు తెచ్చి కట్‌చేసి పాలు గిన్నెలో పోసింది. పిల్లలిద్దర్నీ లేపి బ్రష్ చేయించి కాంప్లాన్ కలిపి ఇచ్చింది. ఈ ఇంటికి, ఇంటిలోని వారికి ఎవరో శాపం పెట్టారేమో... ఎందుకో అలా అనిపించి ఆవిడకి కళ్లంట నీళ్లొచ్చాయి. ఆలోచనల్ని, ఆవేదనని అణుచుకుంటూ భర్తకి కాఫీ కలిపి తీసుకెళ్లి ఇచ్చింది.

"ఛ... ఎంతపని చేసింది భాను! మన ఇంటి పరువు మంట గలిపింది. మంచి తప్ప చెడు తెలియనివాళ్లు ఆమె గురించి వింటే అసహ్యించుకుంటారు" జానకిరామయ్య అన్నారు.

"అవన్నీ ఎందుకండి తవ్వుకోవడం? ! ప్రసాదు లేచి విన్నాడంటే బాధపడతాడు. ముందు కాఫీ తాగండి. చల్లారిపోతుంది" అని వసుంధర ప్రసాదుని లేపడానికి గది లోకి వెళ్లబోయింది.

## కొత్తగాలి...

**పరాయిపాలన పోయింది**
**పరాయీకరణ పెరిగింది**
**మనం కాని మనం ఇపుడున్నది**

– కాళిదాసు,
లక్ష్మీనగర్, కరీంనగర్

"ఇది అన్యాయం కాదా వసూ! మన ప్రసాదుకి చాలా అన్యాయం జరిగింది"

"ఏం చెయ్యమంటారు చెప్పండి. కోర్టు, కేసు ఇలాంటివన్నీ మనసు ముందు చాలా చిన్న విషయాలు. కోర్టుకీడిస్తే పోయేది మన పరువే" ఆవిడ మనసులో బాధ సుళ్లు తిరుగుతోంది.

"అవును. అన్యాయాన్ని ఎదరించలేని అసమర్థతని మంచితనంగా భావించే మధ్యతరగతి మనుషులం"

ప్రసాదు లేచాడు. అతని ముఖం బాగా పీక్కుపోయి ఉంది. భాను ప్రస్తావన తేవడం ఏమాత్రం ఇష్టం లేనివాడిలా కాఫీ గ్లాసు తీసుకుని తన గదిలోకి వెళ్లిపోయాడు. కోర్టుక్కూడా వెళ్లడం మానేసేడు. తన గదిలోంచి బయటకు రావడం లేదు.

తనకి మతిపోయిందా? పోయిందేమో? పిచ్చిపట్టింది తనకి. అలాంటి నీచ నిక్కష్టపు పనిచేసిన భార్యను ఏ భర్తా క్షమించడు. క్షమించలేడు. తను మాత్రం ఎలా క్షమిస్తాడు? అసలు ఎందుకు క్షమించాలి? తను బాగుండడు! అయితే లోకంలో ఉన్న భర్తలందరూ అందగాళ్లేనా? వాళ్ల భార్యలు వాళ్లతో కాపురాలు చేసుకోవడం లేదా? తను బాగుండడని పెళ్లిలోనే తెలుసు. తనకి బోలెడు ఆస్తులున్నాయని తెలిసి, తను మంచివాడని తెలిసి పెళ్లి చేసుకుంది! చంచలబుద్ధి! ఈనాడు తనకంటే అందమైన మగాడు కనిపిస్తే వాడితో లేచిపోయింది? అంటే తనకి 'మగాడు' కావాలి. మొగుడు అక్కర్లేదు. తనవల్ల ఇద్దరు కొడుకుల్ని కన్నది. వాళ్లమీదైనా జాలి వెయ్యడం లేదా దానికి! ఛీ! దాని విషయం తల్చుకోవడమే వేస్టు. దానికి తను అక్కర్లేకపోయాక తనకెందుకు దాని ఊసు! వెర్రి కాకపోతే! మరి పిల్లలిద్దరు ఉన్నారే.. వాళ్లని ఎవరు చూస్తారు? అది ఇంటి పరువుని గంగలో కలిపి వెళ్లిపోయింది. సంప్రదాయమైన తమ కుటుంబగౌరవాన్ని ఇప్పుడు బజారుకీడ్చింది. ఊర్లో అందరూ తమ గురించే మాట్లాడుకుంటున్నారేమో! ఫలానా ప్రసాదు పెళ్లాం... భాను వంటవాడితో లేచిపోయింది అని బుగ్గలు నొక్కుకుంటున్నారేమో! తనని చూసి అందరూ నవ్వుకుంటున్నట్టు, వాళ్లందరి దృష్టిలో తన విలువ పూర్తిగా పడిపోయినట్టు అనిపించసాగింది ప్రసాద్‌కి. తను వీధిలోకెలా వెళ్తాడు? పదిమందికి మొహం ఎలా చూపిస్తాడు? సిగ్గుతో చితికిపోతున్నాడు అతను. వాళ్లందరి దృష్టిలో తన విలువ పడిపోవడం మాట అటుంచి పెళ్లాం దృష్టిలోనే తనకి విలువ లేదు. దీనికంతటికీ కారణం తన అతి మంచితనమే. ఆమె తన మంచితనాన్ని చేతకానితనంగా భావించడం తన దురదృష్టం. అసలు అది ఏనాడు తనని సుఖపెట్టింది కనుక! ఏనాడు తన మంచిచెడ్డలు పట్టించుకుంది కనుక!

ప్రసాద్‌కి గుండె బరువెక్కింది. భానుకి ముందునించీ తనంటే ఇష్టంలేదు. ఏదో కాపురం చేసేం, పిల్లలు పుట్టేరు. అంతే. అది కనీసం ఒక్కరోజు కూడా దగ్గర కూర్చుని తనకి అప్యాయంగా భోజనం వడ్డించలేదు. అంత స్పష్టంగా తను నచ్చలేదని చెప్పినా కొన్నాళ్లు కాపురం చేస్తే అన్నీ అవే సర్దుకుపోతాయనుకున్నాడు. ఆమెను ఏమీ తెలియని పసిపిల్లలా, అమాయకురాలిలాగ చూసేడు. ఆమె తప్పుల్ని ఒక్కొక్కటిగా క్షమిస్తూనే వచ్చాడు ప్రసాద్.

ఒంటరితనాన్ని తన చుట్టూ అల్లుకుని సమాజానికి దూరంగా, విమర్శలకి, అపహాస్యాలకి దూరంగా గిరిగీసుకుని తన గదిలోనే తననుతాను బంధించుకున్నాడు ప్రసాద్.

★ ★ ★

రోజులు బరువుగా, భారంగా గడిచిపో తున్నాయి. జానకిరామయ్యగారు కొంచెం కొంచెం తేరుకుంటున్నారు.

ఏ బాధనైనా మనసులో పెట్టుకుని అన్నం, నీళ్లు మానేసి కృంగి కృశించిపో వడం ఆయన స్వభావానికి విరుద్ధం. ప్రసా దుక్కాడా అదే చెప్పి ఓదార్చారాయన. ఆయనకి జ్యోతి గుర్తొచ్చింది.

'అదెలా ఉందో పాపం? ' అనుకున్నారు.

'ఒకసారి జ్యోతి ఇంటికి వెళ్లిరావాలి. ఈ రోజు ఆదివారం. అది ఇంట్లో ఉంటుంది' అనుకున్నారు. చెప్పులు వేసుకుని జ్యోతి వాళ్లింటికి బయలుదేరారు. జ్యోతి ఉంది. కాని అశోకవనంలో సీతలా ఉంది. ఆమె ముఖంలో జీవకళ లేదు. కళ్లు లోతుకు పోయి చాలా నీరసంగా కనిపిస్తున్నది.

"జ్యోతీ! ఏం తల్లీ అలా ఉన్నావు" తెలి సినా అడిగేరు ఆప్యాయంగా. ఆ మాత్రం పలకరింపుకే ఆమె కళ్లు వర్షించసాగాయి.

"పెదనాన్నా! నేను భయపడినదంతా జరిగింది. నా జీవితం ముక్కలై పోయింది..."

"ఏమైందమ్మా? వివరంగా చెప్పు? "

"ఆదిత్య తన క్లోజ్ ఫ్రెండు సుధాకర్ లేడూ.. అతని చెల్లెలు వాసంతితో..." ఆపైన ఆమెకు నోరు పెగల్లేదు.

"ఆదిత్య ఈ ఊరు పూర్తిగా రావడం మానేసాడు. రోజూ సుధాకర్ ఇంటికి వెళ్లి కూర్చునేవాడు. వాళ్లింట్లో రాత్రుళ్లు భోజనా నికి ఉండిపోవటం. ఆదిత్య, వాసంతి కలిసి బీచ్‌లకి, సినిమాలకి, షికార్లకి వెళ్లడం మొదలెట్టారు. వాళ్లిద్దరి వ్యవ హారం చాలా దూరం వెళ్లింది. ఒకరోజు వాసంతి ఇంట్లో సత్యనారాయణ వ్రతం చేసేరు. అప్పుడు పీటలమీద ఆదిత్య, వాసంతి కూర్చున్నారు పక్కపక్కనే. ఆదిత్య ఆమె మెడలో మంగళసూత్రం కట్టేడు. ఇవన్నీ విజయ ద్వారా ఎప్పటిక ప్పుడు తెలుస్తూనే ఉన్నాయి. ప్రస్తుతం వాసంతి గర్భవతిట!"

వెక్కి వెక్కి ఏడవసాగింది జ్యోతి. కాని ఇక్కడ జ్యోతికి తెలియని విషయం ఒక టుంది.

జ్యోతికి పిల్లలు పుట్టే అవకాశంలేని కార ణంగా పిల్లల కోసం ఆదిత్య వాసంతిని పెళ్లిచేసుకున్నాడని ఆమెకి తెలిసే అవ కాశం లేదు. న్యాయంగా ఆదిత్య ఇదంతా జ్యోతికి విడమర్చి చెప్పి ఉండాల్సింది. అర్థం చేసుకునేటంత సంస్కారం జ్యోతి కుంది కదా. అనఫీషియల్‌గా జరిగిన ఆ పెళ్లి చెల్లదని ఎవరు క్లెయిమ్ చేస్తారు? జ్యోతి మనసు విరిగిపోయింది. ఆమె జీవ చ్ఛవంలా మారిపోయింది.

"మనసులేని మనిషితో బలవంతంగా కాపురం చెయ్యడం మనసున్న నాకు సాధ్యంకాదు పెదనాన్నా!" అంది జ్యోతి ఏడుస్తూ.

"ఆ తర్వాత ఆదిత్య వచ్చేడు ఒకరోజు!" అంది.

"మళ్లీ ఎందుకొచ్చినట్టు? "

"నన్ను వదిలి ఉండలేరట. నాకు నవ్వు వచ్చింది ఆయనామాట అన్నప్పుడు. రెండు పడవలమీద కాళ్లు పెట్టడం అంటే ఇదే. నేనూ కావాలి. ముఖ్యంగా నా జీతం డబ్బులు కావాలి. వాసంతి కూడా కావాలి. మగాడు ఎన్ని వేషాలైనా వెయ్యగలడు!"

"మీరు వాసంతిని పెళ్లి చేసుకున్నార్ట!" అన్నాను.

"నువ్వు ఇలాంటివన్నీ నమ్మేస్తున్నావా? ఇలాంటివన్నీ ఎవరు చెప్తున్నారు నీకు? "

"ఈసారి బుకాయించకండి. కళ్లతో చూసినవాళ్లు చెప్పేరు!"

అప్పుడు అతని మనసులోని 'నిజం' బయటపడింది.

"జ్యోతీ! నామాట నమ్ము. ఇందులో నా తప్పేం లేదు. ఆ అన్నాచెల్లెళ్లిద్దరూ కల్సి

నన్ను గదిలో నిర్బంధించారు. వాసంతి నన్ను ప్రేమించిందట. నేను పెళ్లి చేసుకోకపోతే నిద్రమాత్రలు మింగి చచ్చిపోతుందట. ఏం చెయ్యమంటావు? తప్పని పరిస్థితుల్లో అలా చెయ్యవల్సి వచ్చింది! ట్రై టు అండర్‌స్టాండ్ మి అండ్ కోఆపరేట్ విత్ మి!"

పిచ్చిగా నవ్వుకున్నాను నేను!

"అండర్‌స్టాండింగ్.. కో ఆపరేషన్! ఎంత తియ్యని మాటలు. మగాడు ఆడదాన్ని ఎంత అందంగా మోసం చెయ్యగలడు! బాధపడుతూ కూర్చుంటే బాధే మిగులుతుంది పెదనాన్నా! నాలో మొండి ధైర్యం ప్రవేశించింది. నన్ను అక్కర్లేదనుకున్నవాళ్లు నాకూ అక్కర్లేదు! నాకు గవర్నమెంటు ఉద్యోగం ఉంది. నా పేరున ఇల్లు ఉంది. నేనెందుకు ఎవరికైనా భయపడాలి. తోడు కోసం ఒక బాబుని పెంచుకుందామనుకుంటున్నాను!" ఆమె మాటల్లో చెప్పలేనంత నైరాశ్యం గూడు కట్టుకుని ఉంది. ఎంత ఆపుకుందామని ప్రయత్నించినా ఆమెకు కన్నీళ్లు ఆగడంలేదు!

"అమ్మా జ్యోతీ! తరతరాలుగా మగవాడు ఆడదాన్ని మోసం చేస్తున్నాడు. నిజమే కాదనను. కాని మోసం చెయ్యడానికి మగాడే కానక్కర్లేదు. ఆడది కూడా అందంగా మోసం చెయ్యగలదు!" శూన్యంలోకి చూస్తూ అన్నారు జానకిరామయ్య.

జ్యోతి మనసు చలించిపోయింది. పెదనాన్న మాటల్లో ఎప్పుడూ అంత వైరాగ్యం గోచరించలేదు.

"ఏమైంది పెదనాన్నా?"

అప్పుడు జరిగినవన్నీ చెప్పుకొచ్చారు ఆయన.

"అయ్యో! ప్రసాదన్నయ్యకి అంత కష్టం వచ్చిందా?" నొచ్చుకుంటూ అంది జ్యోతి.

"జీవితం అందరికీ వడ్డించిన విస్తరి కాదు. 'నా జీవితం ఎందుకిలా అయింది?' అని ప్రశ్నించుకునేకంటే జీవితంలో ఎన్ని అడ్డంకులొచ్చినా ధైర్యంగా ముందుకు సాగిపోవడమే ఉత్తమమని నా అభిప్రాయం. జీవితాలు నీటిబుడగల్లాంటివి! ఈ జీవి

## 'చతుర'లో రావడం సంతోషం



**న్యాయపతి కమలారాంజీ**

'చతుర'లో నా నవల 'గడ్డిపూలు' ఎంపికైనందుకు సంతోషంగా ఉంది. గడ్డిపూలు పూస్తాయి, రాలిపోతాయి కానీ దేవుని పూజకు పనికి రావు. కొందరి జీవితాలు అలాగే ఉంటాయని నా అభిప్రాయం. నేను రాసిన రెండువందలకు పైగా కథలు ప్రముఖ వార, మాస పత్రికల్లో వచ్చాయి. 'సంకుచిత హృదయాలు', 'శాపగ్రస్తులు' అనే నవలలు ఆంధ్రభూమి మాసపత్రికలో ప్రచురితమయ్యాయి. 'ప్రేమరాగాలు' నవల ఆంధ్రప్రభ దినపత్రికలో సీరియల్‌గా వచ్చింది. నేను రాసిన కొన్ని నాటికలు, కవితలు, కథానికలు హైదరాబాదు, విశాఖపట్నం ఆకాశవాణిలో ప్రసారం అయ్యాయి. ఆంధ్రయూనివర్సిటీ నుండి బీఏ పాసయ్యాను. మావారు వేంకట రమణమూర్తి (రాంజీ) యు.కో. బ్యాంకు మేనేజరుగా రిటైరయ్యారు. మాకు ఇద్దరబ్బాయిలు, ఒకమ్మాయి. నా రచనలను ప్రోత్సహిస్తున్న వారందరికీ ధన్యవాదాలు.

చిరునామా:
న్యాయపతి కమలారాంజీ
49-26-53, ఎస్-3, ప్రసీధ రెసిడెన్సీ,
1st లేన్-మధురానగర్,
విశాఖపట్నం-530016

తాలే శాశ్వతం కానప్పుడు ఇహ ఇందులో కష్టాలు-కన్నీళ్లు ఏమిటి? సమస్యలు ఏమిటి? నువ్వు ధైర్యంగా ఉండు జ్యోతీ! మరి నేను వెళ్లొస్తాను" ఆయన వెళ్లడానికి లేచారు.

★ ★ ★

వసుంధర ఏడుపు మొహంతో ఎదురొచ్చింది.

"ఏవండీ. పొద్దున్న మీరు వెళ్లిన దగ్గర్నుంచి సాత్విక్ కనబడ్డంలేదండి. మీరు వెళ్లేటప్పుడు పిల్లలిద్దరూ పెరట్లో చెట్ల మధ్య ఆడుకుంటున్నారు. తర్వాత చూసే సరికి వివేక్ లోపలికి వచ్చేడు.

"తమ్ముడు ఏడిరా? " అని అడిగేను.

"మమ్మీ.. మమ్మీ.. నేను మమ్మీ దగ్గరకి వెళ్లిపోతాను అంటూ పరుగెత్తి పెరటివైపు నుండి వెళ్లిపోయేడు. తర్వాత వాడికోసం ఎంత వెతికినా కనిపించలేదు. భయంవేసి నీకు చెప్దామని వచ్చేను నాన్నమ్మా! అన్నాడు వాడు."

"అప్పట్నించి అందరం వెతుకుతున్నాం. వాడెక్కడా కనిపించలేదు" దిగులుగా చెప్పింది.

"ప్రసాదు ఏడీ? ప్రసాదు లేడా? వాడికి చెప్పలేదా? "

"నా మొహం. వాడు ఈ ప్రపంచంలో ఉంటేకదా. వాడు ఆ గది నాలుగు గోడల మధ్యే మగ్గిపోతున్నాడు. బయటి ప్రపంచం గురించి ధ్యాసే లేదు వాడికి"

జానకిరామయ్య పరుగెడ్తున్నట్టుగా నడిచి ప్రసాదు గది తలుపు కొట్టేరు.

"ప్రసాదు! ప్రసాదు! సాత్విక్ కనబడ్డంలేదురా. నేను జ్యోతి వాళ్లింటికి వెళ్లినప్పుడు పిల్లలు పెరట్లో ఆడుకుంటున్నారు. ఇప్పుడు చూస్తే సాత్విక్ లేడు. పోలీసు రిపోర్టు యిద్దాం పద".

"ఎందుకు నాన్నా? వాడే వస్తాడు? ఎక్కడికి పోతాడు!" ఏమాత్రం ఆసక్తి లేనట్టుగా అన్నాడు ప్రసాదు.

జానకిరామయ్య ఇంటికొచ్చిన పదినిముషాలకే నాలుగు వైపులనించీ మేఘాలు దట్టంగా కమ్ముకు రాసాగాయి. శత్రుసైనికుల్లా ఈదురుగాలి వీచడంతోపాటు పెద్ద పెద్ద వర్షం మొదలైంది. గుండెని పిండేసే సంఘటనలు భరించడం వాళ్ల శక్యం కావడంలేదు! ఆవిడ ఏడుస్తోంది. బయటి ఆకాశం కూడా ఆవిడ మనసులాగే భోరున ఏడుస్తోంది.

వాన వెలిశాక జానకిరామయ్యగారు వెళ్లి స్వయంగా పోలీసు రిపోర్టు ఇచ్చేరు. ఒక రోజు, రెండు రోజులు, వారం రోజులు గడిచినా సాత్విక్ జాడలేదు. పులిమీద పుట్రలాగ కష్టాలు కల్గివస్తున్నాయి. దెబ్బమీద దెబ్బ పడ్తూనే ఉంది. నాలుగు వైపులా అందర్నీ పంపించి వెతికించేరు. అయినా ఫలితం లేకపోయింది. విధి విలాసం అంటే ఇదే! శని పట్టుకోవడం అంటే ఇదే! ఒకటి తర్వాత ఒకటి అనుకోని దుర్ఘటనలు ఎదురవుతూనే ఉన్నాయి!!

★ ★ ★

మొదటిరాత్రి భార్య 'నువ్వు నాకు నచ్చలేదు' అని తనతో చెప్పినప్పుడే అతని సున్నితమైన మనసు దెబ్బతింది. అయినా ఆమెను స్వీకరించాడు. తన భావాలను స్పష్టంగా వ్యక్తపర్చలేని అశక్తత ప్రసాదుది. భాను తనని కాదని వెళ్లిపోవడం అతనిలో భరింపరాని వేదనని మిగిల్చింది! ఈత రాని మనిషి నీటిలో మునిగిపోతున్నప్పటి నిస్సహాయత అతని మనసును ఆక్రమించుకుంది. అతను వేళకి భోజనం చెయ్యడు. ప్రతీ రాత్రీ కాళరాత్రే అతనికి. బాగా నీరసించిపోయాడు. జలుబు, దగ్గు పట్టుకున్నాయి. వర్షంలో తడిసిపోయి అలా వచ్చిందేమో అనుకుంది వసుంధర. ఒకరోజు దగ్గుతూంటే కొంచెం రక్తం పడింది కూడా. ప్రసాదు భయపడ్డాడు.

అటు-ఇటు చూసి వాష్ బేసిన్‌లోని కొళాయి జోరుగా తిప్పాడు. రక్తం కొట్టుకు పోయింది. కాని తరచూ అలా రక్తం పడుతూ ఉండడంతో తప్పనిసరై డాక్టరు దగ్గరికి వెళ్లేడు ప్రసాదు.

డాక్టరు కొన్ని ప్రత్యేకమైన పరీక్షలు జరి పారు. డాక్టరు అనుమానం నిజమైంది.

"మిస్టర్ ప్రసాద్! ఈ విషయం మీకు చెప్పడానికి నాకు నోరు రావడంలేదు. కాని చెప్పక తప్పదు. చెప్పేక మీరు మాత్రం ధైర్యాన్ని కోల్పోకూడదు. ఇప్పుడు సైన్స్ బాగా డెవలప్ అయింది. సైంటిస్టులు కొత్త కొత్త పరిశోధనలు జరుపుతున్నారు. దీనిక్కూడా త్వరలోనే మంచి మందు కని పెట్టవచ్చు. మీరేం వర్రీ అవకండి!"

"ఇంతకీ అసలు విషయం ఏమిటి చెప్పండి డాక్టర్!" ప్రసాదు ఆతృతగా అడి గాడు.

"మీకు... మీకు.. లంగ్ కేన్సర్! ఫర్లేదు. తగ్గిపోతుంది. దీన్ని క్యూర్ చెయ్యడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. డోంట్ వర్రీ ఎటాల్! డిప్రెస్ అవకండి. విష్ యు ఆల్ ది బెస్ట్!"

డాక్టరు చెప్పింది వినగానే షాక్ తగిలిన ట్టయింది.

"కష్టాలు కలిసికట్టుగా వస్తాయంటారు!" ఇదేనేమో!

తనకి జీవితం మీద ఏమాత్రం ఆశ లేదు. కాని తనని చూసుకుని బతుకుతున్న తన తల్లిదండ్రుల మాటేమిటి? మిగిలిన బాధలన్నీ మనసులోంచి దూరం చేసుకుని కేవలం తన సంతోషం కోసం తాపత్రయ పడుతున్న వాళ్లిద్దరికీ ఈ విషాదమైన వార్త ఎలా చెప్పడం? నో... తను చెప్పడు. చెప్పలేడు. శివుడు గరళాన్ని తన కంఠంలో దాచుకున్నట్టు దారుణమైన ఈ వాస్తవాన్ని తన గుండెలోనే దాచుకుంటాడు.

ప్రసాదుకి జీవితం నాలుగువైపులా మూసుకుపోయి అంతా అంధకారమే కని పించసాగింది. రోజురోజుకీ కృశించిపో తున్న కొడుకుని చూసి జానకిరామయ్యకి కడుపు తరుక్కుపోయింది. అసలు విషయం తెలియని వాళ్లిద్దరూ భాను వల్లనే ఇదంతా జరిగిందని రోజూ ఆమెను తిట్టి పొయ్యసాగారు. కాని తన గురించిన ఆ చేదునిజం తెలిస్తే ఆ ముసలాళ్ల గుండెలు పగిలిపోతాయేమో అనిపించింది ప్రసాదుకి. అమ్మ-నాన్నలని చూస్తే జాలే స్తున్నది అతనికి.

'మిమ్మల్ని ఓదార్చడానికి నా దగ్గర కన్నీళ్లు లేవు. బాధాకరమైన ఆలోచనలతో ఎడారిగా మారిపోయిన నా హృదయం వాటిని పీల్చేసింది. ఏం చెయ్యను?' అను

**కొత్తగాలి...**

**కూలీ రెక్కలు కూల్చిన**
**మైక్రో భూతం**
**నోట్లు దిగమింగి నిద్రపోతోంది**
**అచ్చం ప్రభుత్వంలాగానే**

– ఆర్. శ్రీనివాసరావు,
శ్రీకాకుళం

కుని బాధపడ్డాడతను.

ఈ వయసులో వాళ్ళకెన్ని కష్టాలు!

అలా రెండు నెలలు గడిచిపోయేయి.

ఒకరోజు ఉన్నట్టుండి భాను వచ్చింది. ఆమె ముఖం చాలా ఉదాసీనంగా ఉంది. శాపం తగిలిన శోకదేవతలా ఉంది ఆమె! ఆమెను చూసి అత్తమామలిద్దరూ ఆశ్చర్య పోయారు. తరువాత అసహ్యంగా ముఖాలు పెట్టారు. భాను గబగబా వచ్చి వాళ్ళ కాళ్ళమీద పడిపోయింది.

'చిన్నపిల్ల! ఏదో తెలియక తప్పు చేసింది. అదే కూతురైతే కడుపున పెట్టు

కోమా!' అనుకున్నారు ఇద్దరూ ఒకేసారి.

ఆమెని లేపాలని ప్రయత్నిస్తే లేవలేదు.

"మీరు నన్ను క్షమించామంటేనే నేను మీ పాదాలు వదులుతాను."

అక్కడ్నుంచి కదలలేదు, వాళ్ళ పాదాలు వదల్లేదు భాను.

ఇద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"మనలో మనకి క్షమార్పణలేమిటమ్మా? లే."

అప్పటిదాకా ఆమెలో ఉగ్గపట్టుకున్న దుఃఖమంతా కన్నీటి రూపంలో వరదలై బయటకు వచ్చింది.

"మేమెవరం నిన్ను క్షమించడానికి!?

## కొత్తగాలి...



**కాంతుల్లేని సంక్రాంతి**
**ఇప్పటి హీరోయిన్ల**
**దేహం మీద**
**బట్ట ఉన్న భ్రాంతి**

– మాధవీ సనారా,
అనకాపల్లి

క్షమించాల్సినవాడు నీ భర్త. వెళ్లి వాడి కాళ్లమీద పడు" అన్నారు.

వాళ్లిద్దరి మంచితనం ఆమెని తలవంచుకునేలా చేసింది.

ప్రసాదు గదిలోపల్నుంచి వచ్చాడు. అతనికి భాను గొంతు వినిపించింది. ముందు భ్రమేమో అనుకున్నాడు.

'భాను రావడం ఏమిటి? ఏ మొహం పెట్టుకుని వస్తుంది? అది చేసిన తప్పు సామాన్యమైనది కాదు. ఏ తప్పూ చెయ్యని సీతామహాసాధ్వినే ఆనాడు శ్రీరామచంద్రుడు క్షమించి స్వీకరించలేకపోయాడు! అలాంటిది కామంతో కళ్లు కప్పుకుపోయిన ఈ రాక్షసి, తనని ఇంత మోసంచేసి వెళ్లిపోయిన రాక్షసి.... దానిని క్షమించడమా?!' నెవ్వర్ అని అనుకున్నాడు.

భాను వెళ్ళి ప్రసాద్ కాళ్లమీద అమాంతం పడిపోయింది.

ప్రసాదు ఒక్కక్షణం తల్లిదండ్రుల వైపు చూసేడు. వాళ్లిద్దరి ముఖాల్లో ఎలాంటి భావమూ వ్యక్తం కావడంలేదు.

"లే. ఏమిటిది?" దూరంగా జరిగాడు ప్రసాదు.

తన జీవితం పరిసమాప్తం కావడానికి ఇంకా కొన్ని రోజులే మిగిలివున్నాయి. ఆ తర్వాత ఎవరికి ఎవరో? క్షమార్పణ కోరేదెవరు? క్షమించేదెవరు? అంతా మిథ్య! బంధాలన్నీ తెంచుకుని ఈ ప్రపంచాన్ని వదిలి వెళ్లిపోవడానికి సిద్ధంగా ఉన్న తనకి ఇంకా క్షమాపణలు, పంతాలు-పట్టింపులు, కోపాలు-తాపాలు, పగలు-ప్రతీకారాలు... ఇవన్నీ ఎందుకు?... పేలవంగా నవ్వుకున్నాడు ప్రసాదు.

భానుకి సిగ్గు, లజ్జ లేదు. పైగా మొండిది. లేచి తన గదిలోకి వెళ్లిపోయింది. పిల్లల గురించి మాటవరసకైనా అడగలేదు.

వసుంధరకి తర్వాత తెలిసింది. ఆమె దగ్గర నగలు, డబ్బు ఉన్నంతవరకు ఏదో కారణం చెప్పి అవన్నీ స్వంతం చేసుకున్న శంకరం తర్వాత భాను దగ్గర ఏమీ మిగల్లేదని తెలిసాక, ఆమెమీద మోజు తీరిపోయాక ఇంక ఆ ఫ్లాటుకు రావడం మానుకున్నాడు. ఆమెలోని బలహీనతని ఆ విధంగా ఉపయోగించుకున్నాడు అతను.

భాను తను చేసిన తప్పు తెలిసివచ్చి మొదట ఇక్కడికి రావడానికి మొహం చెల్లక తన పుట్టింటికి వెళ్లింది. ఆమె తండ్రి బాగా చీవాట్లు పెట్టేడు. ఆమెను మెడపట్టి గెంటినంత పనిచేసాడు.

"నువ్వు పిచ్చిదానివి. తెలివితక్కువ దానివి కనుకే ఇలాంటి అప్రాచ్యపు పని చేసి ఇరువైపుల వాళ్లకి అప్రతిష్ఠ తెచ్చిపెట్టావు! ఎప్పటికైనా నువ్వు మీ అత్తవారింట్లోనే ఉండవల్సినదానివి. నీ భర్త, అత్తగారు, మావగారు నిజంగా దేవుళ్లు! క్షమించాలన్నా, శిక్షించాలన్నా వాళ్ళ చేతుల్లోనే ఉంది. వెళ్లి వాళ్ల కాళ్లమీద పడు. చేసిన తప్పుకి క్షమించమని వేడుకో" అని హితబోధ చేశాడు.

వాళ్లు ఆమెను క్షమించినా భాను ఎందుకో తనను తాను క్షమించుకోలేకపోయింది. మనం చేసిన తప్పులకి ఎదుటివారు క్షమించడమే పెద్ద శిక్ష! ఎందుకంటే మనసు మనల్ని క్షమించదు కదా? !

ప్రతీ నిముషం 'నువ్వు తప్పు చేసావు! నువ్వు తప్పు చేసావు!' అనే బాధ.

'నువ్వు సిగ్గులేకుండా ఏ మొహం పెట్టుకుని మళ్లీ ఇక్కడికి వచ్చావు? నీలాంటి వాళ్లు ఈ భూమ్మీద ఉండకూడదు. నువ్వు మళ్ళీ వచ్చి వాళ్లందరికీ మనశ్శాంతి లేకుండా చేసావు. నీ భర్త ఉత్తముడు. నువ్వు అతన్ని ముట్టుకుంటే అతను అపవిత్రుడైపోతాడు! ఈ భూమ్మీద ఎక్కడున్నా నీ చరిత్ర నిన్ను వెంటాడుతూనే ఉంటుంది. నీలాంటిది బతకకూడదు. నువ్వు సమాజానికి తలవంపులు తెచ్చే పని చేసావు! నువ్వు వెళ్లిపో. శాశ్వతంగా వెళ్లిపో!' అని అనుక్షణం ఆమె అంతరాత్మ ఆమెను చిత్రవధ చేస్తుంటే తట్టుకోలేకపోయింది. రాత్రంతా ఆలోచించి ఆమె ఒక నిర్ణయానికి వచ్చింది.

భానుతో ఇంట్లో ఎవరూ పెద్దగా మాట్లాడ్డంలేదు. ప్రసాదు అయితే అసలు అటువైపే చూడ్డంలేదు. భాను వంటింట్లోకెళ్లి వంట మొదలుపెట్టబోతే వసుంధర ఆమెని వారించింది.

"నువ్వు వంట చెయ్యొద్దు. నీ చేత్తో వండితే మేమెవ్వరం తినం. నిన్ను నా కొడుక్కిచ్చి కట్టబెట్టిన నేరానికి నిన్ను ఇంట్లో ఉండనిస్తున్నాం. ఫలానావాళ్లు కోడల్ని ఇంట్లోంచి వెళ్లగొట్టేరన్న చెడ్డపేరు రాకుండా ఉండడానికి నిన్ను ఇంట్లోకి రానిచ్చాం. అంతేగాని నువ్వు మమ్మల్నందర్నీ మోసంచేసి మా గుండెల మీదనుంచి నిర్దాక్షిణ్యంగా నడుచుకుపోయి తర్వాత తప్పు తెలుసుకుని ఈ రోజు క్షమించమని నువ్వు వచ్చి కాళ్లు పట్టుకుని బతిమాలితే నిన్ను క్షమించేంతటి గొప్ప మనసులు మాకు లేవమ్మా!" అంది వసుంధర గొణుక్కుంటున్నట్టుగా.

'క్షమించాం' అని పైకి అనేసినా ఎవరి మనసుల్లో వారు ఆమెను క్షమించలేకపోయేరు. చుట్టంచూపుగా ఇంటికొచ్చిన వాళ్లు కూడా ఆమెని చూసి ఏ దయ్యాన్నో, భూతాన్నో చూసినట్టుగా తప్పించుకు వెళ్లిపోతున్నారు. వాళ్లందరి ప్రవర్తన భానును విపరీతంగా బాధించసాగింది. దీనినిబట్టి ఆమె చేసింది చిన్న తప్పు కాదని, ముందు వెనుకలు ఆలోచించకుండా కళ్లు మూసుకుపోయి చేసిన పని వల్ల వీళ్లందరూ ఎంత బాధపడుతున్నారో అర్థమయింది. ఈ దూరం దగ్గరవడానికి ఈ జన్మ సరిపోదు. భర్తకి, అత్త-మామలకి ఎలాంటి ఆప్యాయతనందించని తను వాళ్ల దగ్గర్నుండి ఆప్యాయతని ఆశించడంలో ఏమాత్రం అర్థం లేదనిపించింది. మధ్యాహ్నం అందరూ విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో భాను గదిలో దూరి లోపల్నుంచి తలుపు గడియ పెట్టుకుంది. నిద్రమాత్రలు పక్కన పెట్టుకుని ఒక్కొక్కటీ వేసుకుంటూ మంచినీళ్లు తాగింది.

'తన చావుకి ఎవరూ బాధ్యులు కారు. జీవితంమీద విరక్తి కలిగి నేనే నిద్రమాత్రలు వేసుకున్నాను' అని ఒక ఉత్తరం రాసి టేబుల్‌మీద అందరికీ కనబడేలా

పెట్టింది. అప్పటికి నిద్రమాత్రలు మింగడం పూర్తిచేసింది. ఆమె కళ్లు తేలిపో తున్నాయి. ఒళ్లంతా ఏదో చెప్పలేని హాయితో పైకి ఎగిరిపోతున్నట్టుగా అనిపిం చింది. అంతే! ఆ తర్వాత ఆమె కళ్లు శాశ్వ తంగా మూతలు పడిపోయాయి!

విషయం తెల్సి అందరూ గొల్లుమ న్నారు. ప్రసాదు భార్య శవంవైపు నిర్వికా రంగా చూసాడు. పోలీసులు రావడం, శవ పంచనామా జరగడం పూర్తయింది.

'ఈ భూమ్మీద ఏ మనిషీ ఉండిపోడు. ఒకరు ముందు, ఒకరు వెనుక అంతే' అను కున్నాడు ప్రసాదు విరక్తిగా. అతని ఆలోచ నలు పరి పరివిధాల పోతున్నాయి. సిగ రెట్ల మీద సిగరెట్లు కాలుస్తూ సిగరెట్టు పీకల్ని యాష్ట్రేలో గుచ్చుతూ కూర్చు న్నాడు. డాక్టరు సిగరెట్లు కాల్చవద్దని, చాలా ప్రమాదమని చెప్పేడు. డాక్టరు ఏవేవి చెయ్యొద్దన్నాడో అవన్నీ ప్రత్యేకంగా చెయ్యడం మొదలెట్టాడు ప్రసాదు.

ఈ జీవితం ముక్కలైపోయేక ఇంకెం దుకు? శరీరం ఎలాగూ నశించిపోతోంది. దానిని సంరక్షించుకుని చేసేదేముంది? డాక్టరు చెప్పినట్టు చేసినా తన ఆయువు పెరగదు. కనుక బతకాలనే లేనప్పుడు చావుకి భయపడ్డం దేనికి? ! ఆస్తిని, ఐశ్వ ర్యాన్ని, అంతస్తుని పెంచుకోవచ్చుగానీ ఆ యష్షుని మాత్రం పెంచుకోలేం!

ఎక్కడో సుదూరంగా... భాను ఏడుపు వినిపిస్తోంది!

'క్షమించండి! క్షమించండి!' అంటూ ఆమె ఆత్మ ఆక్రోశిస్తున్నది! నిజంగా భాను ఏడుస్తోందా? భాను ఏడుపు తనకి వినిపి స్తోందా? లేక ఇదంతా తన భ్రమేనా? !

క్షణికావేశాలకిలోనై జీవితాన్ని చేజేతులా నాశనం చేసుకున్న భానులాంటి వాళ్ల జీవి తాలు అలాంటి తప్పులు చేసే స్త్రీలకు కను విప్పు కావాలి! భాను ఎక్కడో అగాధం లోంచి పిలుస్తున్నట్టుగా ఉంది.

"ఏవండీ!"

తను ఎందుకు పలకాలి? పలకడు!

భాను వెక్కి వెక్కి... ఏడుస్తున్నది? !!

భాను చనిపోయింది. చనిపోవడం అన్నది నిజం.

భాను చనిపోయిన తర్వాత ఇంట్లో అందరూ మాటలు రాని మూగవాళ్లలా ఎవరి పనులు వాళ్లు యాంత్రికంగా చేసు కోవడం మొదలుపెట్టారు. ఒకరితో ఒకరు మాట్లాడుకోవడంలేదు. మాట్లాడితే గుండె లోని వేదన బయటకు వచ్చేస్తుంది. అందుకే ఎవరిమటుకు వారు మనసులో బాధని బయటకు రానివ్వకుండా మర్చిపో వడానికి ప్రయత్నిస్తున్నారు.

ప్రసాదు పూర్తిగా భగవధ్యానంలోముని గిపోయాడు. రోజూ తల్లి పూజచేస్తుంటే పక్కనే వచ్చి కూర్చుంటున్నాడు.

ఒకరోజు దేవుడి గదిలో దేవుడి మందిరం పక్కన కూర్చున్నాడు. కళ్లు మూసుకుని ధ్యాననిమగ్నుడై ఉన్నాడు. వసుంధర వెలిగించిన అగరువత్తుల పరి మళం ఆ గదంతా వ్యాపించింది. ఆ అగ రువత్తుల పొగకి ఉక్కిరిబిక్కిరి అయిన ప్రసాదుకి దగ్గు వచ్చింది. దగ్గుని ఆపుకోలే కపోయాడు. దగ్గుతున్నప్పుడు నోటికి చేయి ఎంత అడ్డుపెట్టుకున్నా కొంచెం రక్తం కిందపడింది. ఇటు తిరిగి చూసిన వసుంధర కొడుకుని ఆ పరిస్థితిలో చూసి కంగారు పడిపోయింది.

"అయ్యో! అయ్యో! ఈ రక్తం ఏమిట్రా ప్రసాద్? ఏమయింది నీకు? " అంటూ భర్తని కేకేసి పిలిచింది. ఆయన గాబరాప డుతూ వచ్చారు.

"ఏవండీ మన ప్రసాదుకి దగ్గితే రక్తం పడిందండీ"

"ఏమిట్రా ప్రసాద్! ఎన్నాళ్లయింది. ఇలా రక్తం పడుతోంది. డాక్టరుకి చూపించుకు

న్నావా? "

ప్రసాదు మాట్లాడలేదు.

"మాట్లాడవేంటిరా? నువ్వు అర్జంటుగా డాక్టరుకి చూపించుకోవాలి. పద నేనూ వస్తాను" అన్నారాయన.

"వద్దు, నాన్నగారూ! కోర్టులో బల్లగుద్ది వాదించేటప్పుడు గొంతులో రప్చర్ అయి వుంటుంది. అంతే. మీరేం వర్రీ అవ కండి" అనేశాడు ప్రసాదు.

కాని జానకిరామయ్యగారు ఊరుకోలేదు. పట్టుపట్టి కొడుకుని డాక్టరు దగ్గరకి తీసుకె ళ్లేరు. ఆ డాక్టరుకి ప్రసాదు కండిషను ఇది వరకే బాగా తెలుసు. ప్రసాదు ముందే ఆ డాక్టరుకి ఫోన్‌చేసి చెప్పడంవల్ల ఆ పెద్దా యనకి మరింత వేదన కలిగించడం ఇష్టంలేక, "ఏం ఫర్వాలేదండీ. గొంతు రప్చర్ అవడంవల్ల రక్తం పడింది. నో ప్రాబ్లం. ప్లీజ్ డోంట్‌వర్రీ సర్!" అని చెప్పాడు డాక్టరు.

దాంతో జానకిరామయ్య కొంచెం స్థిమిత పడ్డారు.

డాక్టరు కీమోథెరపీ చేయిస్తానంటే ప్రసాదు వద్దన్నాడు. కొద్దిరోజుల్లో ముగిసి పోయే జీవితానికి ఎందుకిదంతా? నాటకం అయిపోయి తెరపడుతున్న సమ యానికి తెర ఎత్తడం పిచ్చిపని!

దగ్గినప్పుడల్లా విపరీతమైన రక్తం పడ్డం, బాధతో, నొప్పితో ప్రసాదు విలవిల్లాడిపో వడం చూసి జానకిరామయ్య అన్నారు.

"ప్రసాద్! నువ్వు కొన్నాళ్ళు కోర్టుకెళ్ళడం మానెయ్యి. ఇంట్లో రెస్టు తీసుకో".

"ఇంక అంతా రెస్టే నాన్నా! కంప్లీట్ రెస్ట్" గొణిగాడు ప్రసాదు.

కొడుకు అలా అనారోగ్యంతో బాధపడు తూంటే వసుంధర చూడలేకపోతున్నది.

'భగవంతుడా! మేం ఏం పాపం చేసేం. మాకెందుకిన్ని పరీక్షలు పెడుతున్నావు!' బాధగా అనుకుంది ఆవిడ.

తర్వాత కొన్ని రోజులకే ప్రసాదుని హాస్పిటల్లో అడ్మిట్ చేసారు. విషయం తెలిసి ఓదార్చడానికి జ్యోతి వచ్చింది. వసుంధర కొడుకు ఆరోగ్యం కోసం అన్ని దేవుళ్ళకి మొక్కుకుంటున్నది. శ్రీ వేంకటే శ్వరస్వామికి ముడుపులు కడుతున్నది.

కొడుకు ఆరోగ్యవంతుడై తొందరగా తిరి గివచ్చేస్తే తిరుపతి కొండకి మెట్లెక్కి వస్తా నని, తలనీలాలు ఇస్తానని మొక్కుకుంది. కీమోథెరపీ ఇవ్వడం స్టార్ట్ చేసేరు.

ప్రసాదుకి వచ్చే ప్రాణం పోయే ప్రాణం అన్నట్టు ఉంది. వసుంధర ఎన్ని మొక్కులు మొక్కుకున్నా ఏ దేవుడూ ఆమె మొర ఆలకించలేదు. ఏ దేవుడికీ ఆవిడ మీద దయ కలగలేదు. కొద్దిరోజులకే ప్రసాదు పంచప్రాణాలు అనంత విశ్వంలో కలసిపోయాయి. అతను తిరిగిరాని లోకా లకు వెళ్ళిపోయాడు!

జానకిరామయ్య, వసుంధరలు గుండెలు పగిలేలా ఏడ్చేరు. బంధువులంతా వచ్చేరు. కర్మ చెయ్యడం పూర్తయింది. వాళ్ళ కడుపు శోకం ఎవరూ తీర్చలేనిది! ఎంత ఏడ్చినా పోయిన కొడుకు తిరిగిరాడని, రాలేదని వాళ్లకు తెలుసు. అయినా ఆ బాధ అలాం టిది! ఏడ్చి ఏడ్చి అలసిపోయారు. అన్నం, నీళ్ళు మానేసి పిచ్చివాళ్ళలా శూన్యంలోకి చూస్తూ కూర్చుంటున్నారు. వసుంధర

## కొత్తగాలి...

**ఉద్యమాలు**
**గాంధీయిజం**
**విధ్వంసాలు మాత్రం**
**గాడ్సేవే నిజం**

– బద్ది నాగేశ్వరరావు,
అనకాపల్లి

ఏడ్చి ఏడ్చి శోష వచ్చి పడిపోయింది. బంధువులందరూ వచ్చి ఓదార్చారు.

జానకిరామయ్యగారు జీవిత సత్యాలను ఎంత తెలిసినవారైనా మనో నిబ్బరం కోల్పోయి భోరున ఏడ్చేసారు.

ఎవరి ఓదార్పుకీ లొంగని కష్టాలు వాళ్లిద్దరివీ!

ఎవరైనా ఎన్నాళ్లు ఓదారుస్తారు? ఎలా ఓదారుస్తారు!

ఎవరి సంసారాలు వాళ్లవి!

ఎవరి సమస్యలు వాళ్లవి!

ఎవరి పనులు వాళ్లకుంటాయి!

వచ్చిన వాళ్లందరూ ఎన్నాళ్లుంటారు? ఎన్నాళ్లుండగలరు? !

వచ్చిన బంధువులంతా ఒక్కొక్కరుగా వెళ్లిపోయారు! ఇల్లంతా బోసిపోయి, శూన్యంగా మిగిలిపోయింది.

ఆ పెద్దవాళ్లిద్దర్నీ ఆ స్థితిలో వదిలేసి జ్యోతి అందరిలా వెళ్లిపోలేకపోయింది.

వసుంధర చేత బలవంతంగా కాఫీ తాగించడం, ఆవిడకి అన్ని సపర్యలు చేస్తూ కనిపెట్టుకుని వుంటున్నది. ముఖ్యంగా వివేక్‌ని చూసుకోవాల్సిన బాధ్యత ఆమె మీద పడింది. సాత్విక్ ఎక్కడికి వెళ్లిపోయేడో, ఏమైపోయేడో తెలియనేలేదు. ముక్కుపచ్చలారని పసివాడు! ఎంత వెతికించినా దొరకలేదు. వివేక్ తమ్ముడికోసం బెంగపెట్టుకున్నాడు.

"ఆంటీ! తమ్ముడు మమ్మీకోసం వెళ్లిపోయేడు. మమ్మీ ఎక్కడుందని వెతుకుతాడు? " ఏడుస్తూ అన్నాడు.

వాడిని మాటల్లో పెట్టి మరిపించడం పెద్ద కష్టమైపోయింది జ్యోతికి. వివేక్‌ని పొద్దున్నే లేపి బ్రష్ చేయించడం, కాంప్లాను కలిపి ఇవ్వడం, తర్వాత స్నానం చేయించడం, స్కూలు యూనిఫామ్ వెయ్యడం, తలదువ్వి, పౌడరు రాసి, పెరుగన్నం తినిపించడం, స్కూలుబేగ్ సర్ది స్కూలుకి పంపించడం, సాయంత్రం వాడు స్కూలునించి ఇంటికి వచ్చేక వాడిచేత హోమ్‌వర్క్ చేయించడం, రాత్రి కథలు చెప్పి వాడిని నిద్రపుచ్చడం... లాంటి పనులన్నీ జ్యోతి ఎంతో శ్రద్ధగా చేస్తున్నది. వివేక్ కూడా 'ఆంటీ... ఆంటీ' అంటూ ఇంట్లో వున్నంతసేపూ ఒక్క నిముషం కూడా ఆమెను వదలడం లేదు. ఆమె పరిస్థితి కూడా అంతే. వివేక్ మీద అవ్యాజమైన అనురాగాన్ని, ప్రేమని పెంచుకుంది ఆమె.

వివేక్‌ని తను... పెంచుకుంటే... తనకి తోడు కావాలి. ఈ శూన్యమైన ఒంటరి జీవితానికి వెలుగుని నింపే చిన్న బాబుని పెంచుకోవాలని తను ఎప్పుడో అనుకుంది! బాబుని తను పెంచి పెద్దవాడ్ని చేసి ప్రయోజకుడ్ని చేసి అందరూ వాడిని చూసి అసూయపడేలా వాడిని తయారు చేయాలని ఆమె ఆలోచించింది.

"పెదనాన్నా!" జానకిరామయ్యగారి దగ్గరకొచ్చి నెమ్మదిగా పిలిచింది.

"ఏమిటమ్మా జ్యోతీ! చెప్పు" అన్నారాయన ఆమె ముఖంలోకి చూస్తూ.

"ఏంలేదు పెదనాన్నా! మీకొచ్చిన కష్టం ఎవ్వరం తీర్చలేనిది! సమస్యలన్నవి జీవన తరంగాల వంటివి! సంసార సాగరంలో ఈదుతూ, మునుగుతూ, తేలుతూ గమ్యం లేని విధంగా కొట్టుకుపోతున్న గడ్డి పోచల్లాంటి వాళ్లం మనం! ఆశల్ని చంపుకోలేక ఆశ-నిరాశల మధ్య కొట్టుమిట్టాడుతూ ఆశయాల కోసం పాకులాడుతున్న ఆశాజీవులం!"

"అవునమ్మా నువ్వు చెప్పేవన్నీ వాస్తవాలే" అన్నారాయన.

"నాదొక చిన్న కోరిక పెదనాన్నా!"

"ఏమిటమ్మా అది? " ఏది వినడానికైనా సిద్ధంగా వున్నట్టుందా మొహం.

"వివేక్‌ని నాకివ్వండి పెదనాన్నా! నేను



పెంచుకుంటాను. తోడులేని నాకు వీడే తోడు అవుతాడు. వాడ్ని దేవుడిచ్చిన వరంగా భావిస్తాను. కాదనకండి పెద నాన్నా!" ఏమైనా తప్పుగా మాట్లాడేమోనని ఆమెకి టెన్షన్‌గా వుంది!

జానకిరామయ్యగారు జ్యోతి ముఖంలోకి పరీక్షగా చూసారు. నిముషం ఆలోచించేరు.

"నీ ఆలోచన బాగానే వుందమ్మా జ్యోతీ! మేం పెద్దవాళ్లం అయిపోయేం. నీ పెంపకంలో వాడు సుఖంగా, హాయిగా వుంటాడన్న నమ్మకం నాకుంది. అలాగేనమ్మా!" అన్నారు వసుంధర వైపు చూస్తూ.

ఆవిడ సరేనన్నట్టు తలూపింది.

జ్యోతి చాలా సంతోషించింది. ఆ దంపతుల పాదాలకి నమస్కరించింది. ఆమె వివేక్ చేతిని పట్టుకుని ముందుకు సాగిపోతుంటే నిర్వికారంగా చూస్తుండిపోయారు

ఆ వృద్ధ దంపతులిద్దరూ.




**ఇ**ల్లు నిశ్శబ్దంగా ఉంది.

చీమ చిటుక్కుమన్నా వినిపించేటంతటి నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దానికి కొంచెం అలవాటు పడ్డారు వాళ్లు. ఇదివరకు వసుంధర ప్రతీ రోజూ ఉదయాన్నే లేచి దేవదేవుడికి షోడ శోపచార పూజ చేసేది. లలితా సహస్రనా మాలు, విష్ణు సహస్రనామాలు, లక్ష్మీ అష్టోత్తరం, హనుమాన్ చాలీసా అన్నీ గొంతెత్తి శ్రావ్యంగా చదివేది. అన్ని దేవుడి పటాలకి బొట్టుపెట్టి, పువ్వు పెట్టి ఆయా దేవునికి సంబంధించిన శ్లోకాలు చదువు తుంది ఆవిడ. ఏ దేవుడికి పూజ చెయ్యక పోతే ఆ దేవునికి కోపం వచ్చేస్తుందేమోనని ఆవిడ భయం!?

కాని ఇన్ని దేముళ్లకి నిత్యం పూజలు చేస్తున్న ఆవిడ్ని ఏ దేవుడు రక్షించేడు? తన వాళ్లందర్నీ కాపాడమని రోజూ దేవుడ్ని వేడుకునేది ఆవిడ! కాని ఏ దేవు డు ఆవిడ మొర ఆలకించాడు? అయినా ఆమె దేవుడ్ని నిందించలేదు.

'నా పూజలోనే ఏదో లోపం ఉంది. అందుకే ఆ దేవుడికి నా ప్రార్థనలు వినిపిం చడంలేదు. నా పూజలు ఫలించడం లేదు' అనుకుంది.

ఈ భక్తులంతా ఇంతే! ఎన్ని కష్ట-నష్టాలు అనుభవిస్తున్నా 'ఆ దేవుడు ఈ కష్టాలన్నీ మనల్ని పరీక్షించడానికే ఇస్తు న్నాడు! ఏం చేస్తాం? మంచివాళ్లకే కష్టా లన్నీ!' అని తమ మనసును సమాధానప ర్చుకుంటారు. ఎవరి మనసునైనా మార్చడం కొంచెం కష్టమైన పనే. ఇప్పుడు ఇన్ని కష్టాలు ఎదురైన తర్వాత కూడా జానకిరామయ్య భార్యని పూజలు చెయ్యొ ద్దనలేదు. ఎవరి తృప్తికోసం వాళ్లు చేస్తున్న కార్యక్రమం ఇది!

ఈ పూజల్ని చెయ్యొద్దని తను ఎప్పుడు అనలేదు, అనడు. వసుంధర పూజలు చేసి దేవుడి స్తోత్రాలు చదువుతున్నంత సేపూ పక్కనే కూర్చుని శ్రద్ధగా వినడం చేస్తున్నారాయన. అంతేకాదు, ఆధ్యాత్మిక గ్రంథాలను, దేవుడి స్తోత్రపాఠాలను చదివి భార్యకు వినిపించడం మొదలుపెట్టేరు...

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోపరాణి!
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ!!...

మానవుడు ఏ విధంగా పాత వస్త్రాలను వదిలిపెట్టి వేరే కొత్త బట్టలను ధరిస్తూ ఉంటాడో అట్లే దేహాలను ధరించుచున్న ఆత్మ నశించిన పాత శరీరాలను వదిలి పెట్టి కొత్త శరీరాలను ధరిస్తూ ఉంటుంది...

పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీ జఠరే శయనం!....

"అర్థమైందా వసూ! మన ప్రసాదు చని పోలేదు. మనతోనే ఉన్నాడు. మరణం అన్నది జీవిత పుష్పానికి అంతిమ వికాసం లాంటిది.

మనిషి దాటలేనిది మృత్యువునే!
మనిషి భయపడేది మృత్యువుకే!

జీవిత యాత్ర మరణంతో ముగు స్తుంది. గత జన్మ కర్మఫలాన్ని అనుభవిం చడానికే మనం మళ్లీ జన్మ ఎత్తేం అనుకో వాలి. రెప్ప తెరిస్తే జననం. రెప్ప మూస్తే

మరణం. రెప్ప తెరవడానికి మూయడానికి మధ్యనున్న ఈ చిన్న జీవితంలో మనం ఎటువంటి ఫలాపేక్ష లేకుండా ముందుకు అడుగులు వెయ్యాలి. మనం భగవంతుడ్ని పూజించవచ్చు కాని ఆ దేవుడ్ని ఇది కావాలి, అది కావాలని అడగకూడదు. మనకేం కావాలో ఆ దేవుడికి బాగా తెలుసు. మనం ఈ వయసులో చెయ్యవల్సిందల్లా ఒక్కటే. మనకి మళ్లీ జన్మ అన్నది లేకుండా మోక్షం సిద్ధించాలని ఆ దేవుడ్ని మనసారా ప్రార్థించడమే తెలిసిందా!"

మానవ జీవితం ఎన్నో సమస్యల్లో ఇరుక్కుపోయింది వసుంధరా! 'జీవితం' అన్నది నడిసముద్రంలో నావ లాంటిది. ప్రతి మనిషిలోనూ రెండు భిన్న స్వరూపాలు కనిపిస్తున్నాయి. మనిషిలోని మృగం దాక్కుని అతనిచేత చేయరాని పనులన్నీ చేయిస్తోంది. అతని ఆలోచనా విధానం మారిపోతున్నది. మంచిగా ఆలోచించడం, మంచిగా ప్రవర్తించడం, పదిమందికీ ఉపయోగపడే మంచి పనులు చెయ్యడం గగనమైపోయింది. ఎంతసేపూ స్వార్థ చింతన, అసూయ ద్వేషాలు, ఓర్వలేనితనం, ఎదుటివారి నాశనాన్ని కోరుకోవడం లాంటివన్నీ మనిషిలో నానాటికీ ఎక్కువైపోతున్నాయి.

మనం ఈ లోకంలోకి వచ్చేటప్పుడు ఒంటరివారిమే. పోయేటప్పుడు ఒంటరివారమే. వెంట ఏదీ తీసుకెళ్ళలేం అని ప్రతీవాడికీ తెలుసు. తెలిసి మాయలో పడిపోయి ప్రతీవాడు ముందు వెనుకలు ఆలోచించకుండా కామ, క్రోధ, మోహ, మద, మాత్సర్యాలలో కొట్టుకుపోయి తన పతనానికి తానే కారణమవుతున్నాడు!.

పుట్టడం గిట్టడం మన చేతిలో లేదు. చావు అన్నది మనం ఎక్కుడున్నా, ఎక్కడ దాక్కున్నా మనల్ని వెతుక్కుంటూ వస్తుంది? జీవితం క్షణ భంగురం. తామరాకు మీద నీటి బొట్టులాంటి అశాశ్వతమైన ఈ జీవితం కోసం మనిషి ఇంతలా పతనానికి దిగజారిపోవడం అవివేకం, అజ్ఞానం అనిపించుకుంటుంది. రోజూ పేపరు చదువు వసూ! నీకు తెలుస్తుంది!

తెల్లవారితే హత్యలు- ఆత్మహత్యలు, మానభంగాలు-మారణ హోమాలు, అన్యాయాలు- అక్రమాలు, దోపిడీలు - దొంగతనాలు, మోసాలు- ద్వేషాలు.. ఎటు చూసినా ఇవే! మనలాంటి వాళ్ళం ఇల్లు కదిలి బయటకెళ్లడానికే భయం వేసే పరిస్థితులు ఏర్పడ్డాయి.

ఒక వ్యక్తిని మూడు రకాలుగా చూడొచ్చు తన కోసం తను జీవించేవాడు అధముడు! తనతోపాటు ఇతరుల మంచి చెడులను చూసేవాడు మధ్యముడు. కేవలం ఇతరుల కోసమే జీవించేవాడు ఉత్తముడు... అని అంటారు. మనం ఏ కోవకి చెందినవాళ్లమో మన మనసుని మనం ప్రశ్నించుకుంటే తెలుస్తుంది!

నిజం చెప్పాలంటే మనిషిలోని ఈ అవలక్షణాలన్నీ అజ్ఞానంలోంచే పుట్టుకొస్తున్నాయి. ఇలాంటి అవలక్షణాల బారినుండి మనల్ని మనం రక్షించుకునేందుకు మనం ధర్మమార్గాన నడవాలి. ధర్మం గొడుగు లాంటిది. మనం దానిని నెత్తిన పెట్టుకుంటే అది మనల్ని రక్షిస్తుంది. లేదంటే అది మనల్ని రక్షించదు! ఒకే వ్యక్తియందు అనేక ధర్మాలుంటాయి. పుత్రధర్మం, పతి ధర్మం, సోదర ధర్మం, పితృ ధర్మం, గురువు ధర్మం, శిష్య ధర్మం, స్నేహ ధర్మం.. అని వాటిని అంటారు. అందుకే 'ధర్మో రక్షతి రక్షితః' అంటారు.

ప్రతి మనిషి మనసులోనూ జ్ఞానజ్యోతి వెలిగితే అది మానవ వికాసానికి తోడ్పడుతుంది. జ్ఞానజ్యోతి నిప్పులాంటిది. ఎంత చెత్తనైనా నిప్పు కాల్చేసి బూడిద చేసినట్టు చిన్న జ్ఞానం కూడా మనసులోని కల్మ

షాన్ని కడిగేస్తుంది. ధ్యానం ద్వారా ధర్మాన్ని ఆచరించి మనలోని ప్రకోపాలని కొంతవరకు పోగొట్టుకోవచ్చు.

'పూజలు' అన్నవి మనం ఇతరుల కోసం చేసేవిగా ఉండకూడదు. ఇవి మనకి భగవంతుడికి మధ్యగల సున్నితమైన అలౌకిక సంబంధంగా ఉండాలి.

మనం ఇన్ని కొబ్బరికాయలు కొట్టేం, ఇన్ని అరటిపళ్లు నైవేద్యం పెట్టేం, ఇన్ని గంటలసేపు పూజ చేసేం అని చెప్పుకోవడంలో అర్థం లేదు..." ఇంకా ఏదో చెప్తూనే ఉన్నారు జానకి రామయ్యగారు.

"సరేలెండి. చెప్పి చెప్పి అలసిపోయేరు.

## కొత్తగాలి...



**తోకలేని పిట్ట**
**కనిపించడం**
**మానేసింది**
**మౌస్ వచ్చాక**

– ఈ. వేమన,
శ్రీకాకుళం

ఈ ప్రసాదం తీసుకోండి" చక్కెర పొంగలి చిన్న ఆకులో వేసి ఆయన చేతిలో పెట్టి నవ్వుతూ అంది వసుంధర.

"అంటే... ఇంతసేపూ నేను నీకు చెప్పినదంతా నీ బుర్ర కెక్కలేదా? అసలు అర్థం కాలేదా?" చిరుకోపంతో ఆవిడవైపు చూస్తూ అన్నారాయన.

"ఏదో కొంచెం అర్థమైందనుకోండి. ఎద్దుకేం తెలుసు అటుకుల రుచి... అన్నట్టు... మీకున్న తెలివితేటలు నాకు లేవండీ" అంటూ పూజా కార్యక్రమం ముగించి లేచింది వసుంధర.

అప్పుడే వివేక్‌ని తీసుకుని జ్యోతి లోపలికి వచ్చింది.

"తాతయ్యా!" అంటూ లోపలికి పరుగెత్తుకొచ్చేడు వివేక్.

"ఏమ్మా జ్యోతి! బాగున్నావా? వీడు నీకు అల్లరి పెట్టడం లేదుకదా. బుద్ధిగా ఉంటున్నాడా? నీ మాట వింటున్నాడా? హోమ్‌వర్క్ చేస్తున్నాడా? సరిగ్గా చదువుతున్నాడా?" ప్రశ్నల వర్షం కురిపించేరు జానకిరామయ్య మనవడ్ని ప్రేమగా ఒడిలో కూర్చోబెట్టుకుంటూ.

"బాగా చదువుతున్నాను తాతయ్యా! మొన్న క్వార్టర్లీ పరీక్షల్లో క్లాసు ఫస్టు వచ్చాను" గొప్పగా చెప్తున్నాడు వివేక్. వాడి ముఖంలోకి పరీక్షగా చూస్తూ అన్నారు ఆయన.

"వీడు అచ్చం ప్రసాదులాగే ఉంటాడు. ఆ మొహం, కళ్లు తిప్పడం... నవ్వు అంతా వాడి పోలికే. ప్రసాదు... అంటే గుర్తొచ్చింది. ఒకసారి వినాయకుడు పాలు తాగేడని అందరూ వేలం వెర్రిగా కోవెలకెళ్లి వినాయకుడి చేత పాలు తాగించేసేరు. అన్ని కోవెళ్లు విపరీతమైన రష్! మన ప్రసాదు ఏం చేసేడో తెలుసా. వాడు ఉత్త అమాయకుడు, అన్నీ నమ్మేస్తాడు. అందర్నీ నమ్మేస్తాడు. ఒకసారి వాడు పని మీద రూర్కెలా వెళ్లాడు. ఆ రోజే వినాయకుడు పాలు తాగినరోజు.

రూర్కెలాలో హోటల్ చంద్రలోక్ మెయిన్‌రోడ్డు మీద ఉంది. ఆ హోటలు ఒక సర్దార్‌జీది. ఆ హోటల్‌లో రూమ్ నెం. 6లో ప్రసాదు ఉన్నాడు. మంచి ఎండాకాలం. 50 డిగ్రీల సెల్సియస్ ఉంది. ఆరోజు ఎండ తీవ్రత. పైగా ఆదివారం. ఉదయం తొమ్మిదింపావు అయింది. ప్రసాద్ స్నానం చేసి సూట్‌కేస్‌లో ఉన్న వేంకటేశ్వరస్వామి పటాన్ని పైకి తీసి గోడ వారకి నించోపెట్టి ఎదురుగా నించుని దేవుడి శ్లోకాలన్నిటినీ కళ్లు మూసుకుని ధ్యాన నిమగ్నుడై రెండు నిముషాలు వల్లించేడు. తర్వాత కుర్చీలో కూర్చుని ఇండియా

టుడే పేజీలని తిరగేయడం మొదలెట్టేడు. ఇంతలో తలుపుతీసుకుని నెమ్మదిగా ఒక వ్యక్తి రూములోకి అడుగుపెట్టాడు. అతనికి డెబ్బై ఏళ్లు పైనే వుంటాయి. తెల్లటి గెడ్డం, తెల్లటి టోపి, తెల్లటి దుస్తులు... ఆకారాన్ని బట్టి ముస్లిం అయివుంటాడనిపించింది. వస్తూనే "బాబూ! కుర్చీలో కూర్చోవచ్చా?" అని అడిగాడు. ప్రసాద్‌కి వృద్ధులంటే చాలా గౌరవం. వాడికి ఎవరన్నా గౌర వమే. ఒక్కొక్కసారి వాళ్లకివ్వాల్సిన గౌరవం కన్నా ఎక్కువ ఇచ్చేసి మోసపో తూంటాడు కూడా. ఆ విధంగా ఎన్నో సార్లు కష్ట-నష్టాలకి గురయ్యేడు వాడు. కర్ణుడికి కవచకుండలాల్లాగ అతి మంచి తనం - అమాయకత్వం వాడికి పెట్టని ఆభరణాలు.

"బాబూ! నా పేరు మహమ్మద్ రంజానీ ఖురేషి" అన్నాడు.

"చెప్పండి. ఏమిటి విషయం?"

అతను ప్రసాదుకి సంబంధించిన విష యాలన్నీ పూస గుచ్చినట్టు చెప్పసాగేడు. ప్రసాద్ మంత్రముగ్ధుడిలా వింటున్నాడు. మరో గంటలో ముఖ్యమైన పనిమీద ఒక స్నేహితుడిని కలవాలి. అందుకే అతని మాటలు వింటూనే లేచి బట్టలు మార్చు కుందామని అటు తిరిగేడు, ఒక నిము షంలో షర్టు వేసుకుని ఇటు తిరిగేసర్కి ఆవ్యక్తి లేడు!

ప్రసాద్ గతుక్కుమన్నాడు.

"ఆ వ్యక్తి ఎక్కడికి వెళ్లిపోయాడు? ఉన్న ట్టుండి ఎలా మాయమైపోయేడు! ప్రసాద్ రూం ఇవతలకొచ్చి చూసేడు. ఈ చివర నించి ఆ చివరదాకా ఎవరు వెళ్లినా కనిపి స్తారు. అటుగా వెళ్తున్న రూము బోయ్‌ని పిలిచి అడిగేడు.

"ఇందాక నువ్వు నా రూంలోకి టీ తీసు కుని వచ్చినప్పుడు ఒక ముసలాయన కూర్చుని ఉన్నాడు కదా.. అతను ఎటు వెళ్లాడో తెలుసా?"

ఆ వ్యక్తి పక్కరూంలో దూరివుంటా డేమో?! అన్న అనుమానం రాలేదు. 'నేన సలు మీ రూంలో ఏ ముసలాయన్ని చూడలేదు సార్!' అని వెళ్లిపోయేడు రూముబాయ్.

ప్రసాద్ ఆశ్చర్యపోయేడు. ఎందుకంటే తనకి భక్తి ఎక్కువ కాబట్టి ఆ దేవుడే అల్లా రూపంలో తనకి దర్శనం ఇచ్చి ఉంటాడు అని భావించి సంబరపడిపోయేడు. ఒక్క క్షణం భయమో, ఆనందమో తెలీని పరి స్థితి ఏర్పడింది.

ప్రసాద్ హిందూ దేవుళ్లతోపాటు మిగతా దేవుళ్లని కూడా ప్రార్థిస్తాడు. చర్చికి వెళ్తాడు. మసీదుకి వెళ్తాడు! వాడికి అన్నీ సందేహాలే.

దేవుడు మనిషిని సృష్టించేడా? లేక మనిషి దేవుడ్ని సృష్టించేడా అన్న విషయం తెలుసుకోవడానికి ఎవరికీ జీవితకాలం సరి పోదనే చెప్పాలి. అది ఒక జవాబులేని ప్రశ్న! ఎంతోమంది మహానుభావులు దేవుడి గురించి తమకు తోచింది చెప్తూనే ఉన్నారు. కాని ఎవరూ సరైన సమాధానం చెప్పలేకపోతున్నారు. ఎవరి జవాబు సంతృప్తికరంగా లేదు.

దేవుడి విషయంలో ఎవరి నమ్మకాలు వాళ్లవి. కొంతమంది నమ్ముతారు. కొంత మంది నమ్మరు. నమ్మిన వాళ్లు చిలవలు-పలవలు చేసి, మన ప్రసాదులాగ, ఇదుగో పులి అంటే అదుగో తోక అన్న విధంగా చెప్పడంనించీ నమ్మని వాళ్ల దృష్టిలో కొంచెం చులకనైపోతున్నారు. మన నమ్మ కాన్ని ఇతరుల మీద రుద్దనంతవరకు బాగానే ఉంటుంది!

'నేను నమ్ముతాను, నువ్వూ నమ్మితీరాలి' అంటేనే చిక్కంతా వస్తుంది. రూర్కెలా వెళ్లినరోజే వినాయకుడు పాలు తాగుతు న్నాడనే వార్త గుప్పుమనడంతో ప్రసాదు అది చూడ్డానికి వెళ్లేడు. అతడు అలాంటి వన్నీ బాగా నమ్ముతాడు. ఆ మాటకొస్తే

దేశంలోని ఆస్తికులంతా నమ్మేరు. రాతి విగ్రహం పాలు తాగటం ఏమిటన్న ప్రశ్న ఎవరికీ కలగలేదు. వినాయకుడు పాలు తాగడం బీబీసీ న్యూస్‌లోకి వెళ్లిపోయిం దంటే చిన్న విషయమేమీ కాదంటాడు ప్రసాదు. ఇంటికి ఫోనుచేసి మాకందరికీ ఈ విషయం చెప్పేడు. తనకి దేవుడి దర్శనం అయిందని కూడా చెప్పేడు. నమ్మ కం-భక్తి ఉండొచ్చు. కానీ ఏదీ మితిమీర కూడదు. నాది ఏడవాలో-నవ్వాలో తెలీని పరిస్థితి! మరో గంటకి మళ్లీ ఫోన్‌చేసి చెప్పేడు-

ఒక్క వినాయకుడే కాదు. ఈ వూర్లో

> **కొత్తగాలి...**
>
> **తూటా చేసిన గాయం**
> **మానడం ఖాయం**
> **మాట చేసిన గాయం**
> **మానదన్నది నిజం**
>
> – వి.వి.ఎస్.మూర్తి,
> చొదిమెళ్ల

శివుడు, పార్వతీ, నందీశ్వరుడు, సుబ్రమణ్యే శ్వరుడు అందరూ పోటీపడి పాలు తాగే స్తున్నారని!" ఇలాంటివన్నీ మూఢభక్తికి తార్కాణాలు.

మేం కోవెలకి వెళ్లి చూసేం. మాకెవ్వరికీ కనబడలేదు. మరి వాడికి ఎలా కనిపిం చిందో? కొన్నింటికి జవాబులు ఉండవు. తర్కానికి అందని విషయాలు అవి! మా చాకలి పేరు మహమ్మద్ షరీఫ్, ముస్లిమ్. ప్రసాదు చెప్పిందంతా విని షరీఫ్ ప్రసాద్ కాళ్లమీద పడిపోయేడు.

"బాబూ! సాక్షాత్ ఆ అల్లానే మీకు దర్శనం ఇచ్చేడు. మీరు ఎంత పుణ్యా త్ములు బాబూ! నేను రోజూ మసీదుకెళ్లి నమాజు చేసినా నాకు అల్లా దర్శనం కాలేదు. అలాంటిది మీరు అదృష్టవం తులు. మా అల్లా మిమ్మల్ని కరుణించేడు. చూసేరా బాబూ! మీరు హిందువులు, మేం ముస్లిములం. కాని అల్లా దృష్టిలో మను షులంతా ఒక్కటే. నేను ప్రతి లక్ష్మివారం మసీదుకు వెళ్తాను. పీర్‌బాబా ఛక్ దగ్గరే పీర్ బాబా మజార్ ఉంది. ఈసారి నేను వెళ్లినప్పుడు మిమ్మల్ని తీసుకెళ్తాను. రండి బాబూ!" అన్నాడు మహమ్మద్ షరీఫ్ సంబరపడిపోతూ.

ప్రసాద్ అంతటితో ఆగలేదు. వాడి స్నేహితుడు ఆనంద్ రచయిత. తను చూసింది, చెప్పిందీ... అంతా ఉన్నదున్న ట్టుగా కథగా రాయమని ఒత్తిడి తెచ్చేడు ఆనంద్‌పై.

"ఆ రోజు వచ్చినవాడు నిజంగా దేవు డేనా? అతను పక్కరూంలోనే ఉండి ఉంటాడు. అందుకే వెంటనే తన రూంకి వెళ్లిపోయేడు. పక్కరూములోనే ఉన్న వాళ్ల వివరాలు తెలుసుకోవడం పెద్ద కష్టం కాదు. ఇంత అమాయకంగా ప్రతీది నమ్మేస్తే ఎలాగ? ప్రసాద్ అనే కాదు చాలామంది.. వినాయకుడు పాలు తాగు తున్నాడన్నా, చంద్రుడిలో సాయిబాబా కని పిస్తున్నాడన్నా, స్వామీజీ పటంలోంచి విభూది పడుతున్నదన్నా, ఆపరేషన్ అవ సరం లేకుండా కల్కి భగవాన్ కేన్సరు రోగాలు నయం చేస్తారన్నా.. నమ్ముతు న్నారు. ప్రసాదు తృప్తికోసం ఆనంద్ అతని ముందు వాదించడు. కాని ఆనం ద్‌కి అంతగా నమ్మకం లేదు. అతను పూజకంటే ప్రార్థనకే ఎక్కువ విలువ ఇస్తాడు. దేవుడు అంటే మానవాతీతమైన అదృశ్యశక్తి అని, ఆ శక్తే ఈ యావత్ ప్రపంచాన్ని కాపాడుతున్నాడని మాత్రం అతని నమ్మకం.."

వివేక్ అతని ఒడిలోంచి లేచి తుర్రు మని పారిపోయి వసుంధర పక్కన చేరేడు.

"నాన్నమ్మా! ఎలా ఉన్నావు?"

"మా బాబే! మా నాయనే, ఎలా ఉన్నావురా బంగారు తండ్రి?" ఆవిడ ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంది.

"ఈరోజు ఆదివారం కదా. ఈ రోజంతా ఇక్కడే ఉండండమ్మా. మాకూ వూసుపోతుంది. మరీ ఒంటరిగా బిక్కుబిక్కుమంటు ఉండటం అంటే ఏదోలా ఉంది"

వసుంధర కళ్లల్లో నీళ్లు నిండేయి.

"అప్పుడే ప్రసాదు పోయి ఆరునెలలు గడిచిపోయేయి. ఏంచేసినా వాడిని కాపాడుకోలేకపోయేం. ఆస్తిని-ఐశ్వర్యాన్ని పెంచుకోగలం కాని ఆయుష్షుని పెంచుకోలేం. వాడు మళ్లీ ఎక్కడో పుట్టే ఉంటాడు" విచారంగా అంది ఆవిడ.

"పెదనాన్నా! మీకు పునర్జన్మ మీద నమ్మకం ఉందా?" జ్యోతి అడిగింది ఆసక్తిగా.

ఒక్క క్షణం ఆలోచించేరు జానకిరామయ్య.

"ఉందమ్మా, ప్రసాదు ఎక్కడో పుట్టే ఉంటాడు. కానీ గత జన్మ జ్ఞాపకాలు మనిషికి ఉండవు! అది శాపమో వరమో కాని దేవుడు అవన్నీ మర్చిపోయేలా చేసేడు. లేకపోతే ఈ జన్మ బంధాలు, గత జన్మబంధాలు... ఇవన్నీ మనిషిని మరింత అయోమయంలో పడవేస్తాయి. ఎక్కడో ప్రసాదు కనిపించి 'నాన్నా' అని పిలిస్తే నిజంగా నా కన్న కొడుకుని అభిమానించినట్టుగా ఆప్యాయంగా, ప్రేమగా దగ్గరకు తీసుకోగలనా? ఏం చెయ్యాలో అర్థంకాని పరిస్థితిలో పడిపోతాం. బదిరీనాథ్ దగ్గరున్న బ్రహ్మకపాలంలో పిండప్రదానాలు చేస్తే స్వర్గప్రాప్తి కలుగుతుందంటారు. కాని మధ్యాహ్నం రెండు గంటలలోగా అందరూ ఆ ప్రదేశాన్ని వదిలిపెట్టి వెళ్లిపోతారు. ఎందుకంటే అక్కడ నదిలో వదిలిన పిండాలని పితృదేవతలు తీసుకుంటారట! తర్వాత తమ వంశజుల్ని చూడ్డానికి మానవ రూపాల్లో వస్తార్ట. నేను నార్త్ ఇండియా టూర్‌కి వెళ్లినప్పుడు అక్కడికి వెళ్లేను. పిండప్రదానాలు అయిపోయేక సరిగ్గా ఆ టైంకి ఎందుకో తల తిరిగి పడిపోయేను. తెలివివచ్చేసరికి అక్కడ ఎవరూ లేరు. నాకు చాలా భయం వేసింది. మన పితృదేవతల్ని మనం దర్శించుకోవడం మనకి సంతోషం కలిగించే విషయమే. కాని ఏమిటో వాళ్లు నిజంగా వచ్చేసి పలకరిస్తే భయంవేసి ఒళ్లు గగుర్పొడుస్తుంది. నాకు అక్కడ ఎవరూ కనబడలేదు. అయినా భయంగా చుట్టూ చూస్తూ పడుతూ లేస్తూ కొంత దూరం వెళ్లి అక్కడ డోలీ ఉంటే అందులో ఎక్కి వెళ్లేను, మా బ్యాచ్ దగ్గరికి. వాళ్లందరూ ఒకటే నవ్వులు. వేళాకోళాలు!" ఆపేరాయన.

★ ★ ★

ఓ వారం గడిచింది.

"అలా జ్యోతి ఇంటిదాకా వెళ్లొస్తాను. తలుపేసుకో" భార్యకు చెప్పి బయలుదేరేరు జానకిరామయ్య. వెళ్లేముందు ఫోన్ చేస్తే "తనకి వంట్లో బాగులేదని, వివేక్ స్కూలుకి వెళ్లేడని తను స్కూలుకి వెళ్లలేదని, చెప్పింది జ్యోతి. అందుకే ఆయన జ్యోతిని చూసి వద్దామని వెళ్లేరు.

జ్యోతికి బాగా జ్వరంగా ఉంది. క్రోసిన్ టాబ్లెట్ వేసుకుని పడుకుంది. వీధి తలుపు దగ్గరకు వేసి ఉంది. ఆయన్ని చూసి లేచి కూర్చుంది ఆమె.

"ఎలా ఉన్నారు పెదనాన్నా? బాగున్నారా?"

"బాగానే ఉన్నానమ్మా. అది సరేగాని నీకింత జ్వరంగా ఉంటే వివేక్‌ని తీసుకుని మా ఇంటికి వచ్చేయలేకపోయేవా?" అన్నారాయన.

"నేను బతికివుంటేనేం? చచ్చిపోతేనేం? నా గురించి ఎవరు పట్టించుకుంటారు? తల-తోక లేని జీవితం నాది! నేనెవరిక్కా

వాలి? " ఆమె కళ్లు నీళ్లతో నిండిపోయేయి.

ఆమె తలమీద చేయివేసి ఆప్యాయంగా నిమురుతూ అన్నారాయన- "నా కళ్లల్లోకి చూసి నిజం చెప్పు తల్లీ! నువ్వు ఆదిత్యను ఇంకా మర్చిపోలేకపోతున్నావు కదూ. బంధాలు తెగిపోయి పైలోకాలకి వెళ్లిపోయి నవాళ్లు కొందరైతే బంధాలు తెంచుకుని తమ దారి తాము చూసుకుని వెళ్లిపోయిన వాళ్లు మరికొందరు. అలాంటి వాళ్లకోసం నువ్వు బాధపడకూడదమ్మా."

"పెదనాన్నా!" బావురుమంది జ్యోతి. అప్పటిదాకా ఉగ్గ పట్టుకున్న దుఃఖం అంతా వరదలా కన్నీటి రూపంలో బయటకొచ్చింది.

"నీ గతంలో జరిగిన సంఘటనలన్నీ చెప్తుంటే నాకు తెలిసిన ఒక విషాద సంఘటన గుర్తొచ్చిందమ్మా" అన్నారు జానకిరామయ్య.

"ఏమిటి పెదనాన్నా అది"

"సరస్వతి గురించి చెప్పాలమ్మా నీకు"

"ఎవరా సరస్వతి? "

"సరస్వతి స్వయంగా మీ దొడ్డమ్మకి అక్క. వసుంధర అక్క! అనాదిగా ఆడదానికి అన్యాయం జరుగుతున్నాదనడానికి ఆమె జీవితం ఒక చక్కటి ఉదాహరణ".

"దొడ్డమ్మ ఎప్పుడూ ఆవిడ గురించి చెప్పలేదే? అసలు ఆవిడకి అక్కలున్నారనే నాకు తెలీదు" అంది జ్యోతి ఆశ్చర్యంగా.

"అసలు మీ దొడ్డమ్మ వాళ్ల అక్కని ఎప్పుడూ తల్చుకోదు, ఆవిడ ముందు ఎవరైనా సరస్వతి విషయం ఎత్తినా వసుంధర చాలా బాధపడి పోతుంది. అవమానంగా భావించి ఏడ్చేస్తుంది. కాని ఇది కథ కాదమ్మా. వాస్తవం!"

"చెప్పండి పెదనాన్నా!"

జానకి రామయ్యగారు సరస్వతి గురించి చెప్పడం మొదలుపెట్టేరు-

ముక్కుపచ్చలారని పదేళ్ల వయసులోనే సరస్వతి వివాహం కరుణాకరంతో జరిగింది. అది బాల్య వివాహం. మునుపు బాల్య వివాహాలు ఉండేవి. ఆడుతూ పాడుతూ తిరగాల్సిన ఆ వయసులో అత్త వారింట అడుగుపెట్టింది సరస్వతి. ఆమెకి అక్కడి మనుషులు, వాళ్లతీరు తెన్నులు, వాళ్ల స్వభావాలు- సరదాలు, అలవాట్లు, అభిరుచులు, వాళ్ల మోటు హాస్యాలు అన్నీ కొత్తగా వింతగా ఉండేవి. భర్తతో ఇలా మాట్లాడాలి. అత్తమామలతో ఇలా ప్రవర్తించాలి అని తెలియని పసితనపు రోజులవి! పుట్టినింట్లో సరదాగా, స్వేచ్ఛగా తిరిగిన ఆ అమ్మాయికి అత్తవారింటికి వచ్చేసరికి ఆంక్షలు మొదలయ్యేయి.

'నువ్వు ఇలా మాట్లాడకూడదు. అలా నవ్వకూడదు. అక్కడికి వెళ్లకూడదు. వాళ్లతో మాట్లాడకూడదు. వీళ్లతోనే మాట్లాడాలి. ఇక్కడ కూర్చోకూడదు. అక్కడ నించోకూడదు...' ఇలా అన్నీ చెప్పడంతో సరస్వతి బెంబెలెత్తిపోయింది.

భర్త అంటే ఏమిటో తెలియదు ఆమెకి.

అలాంటి స్థితిలోనే దురదృష్టం ఆమె జీవితాన్ని కాటేసింది. ఆ అమ్మాయి భర్త కరుణాకరం పొలంలో పాము కాటువల్ల మరణించేడు. భర్త చనిపోతే ఏడవాలన్నది కూడా తెలీదు ఆ అమ్మాయికి! అందరూ ఏడుస్తూంటే ఆమె కూడా ఏడవాలని ప్రయత్నించింది.

కాని ఏడుపు రాలేదు. కాని - భర్త మరణంకంటే దుర్భరమైన సంఘటన.. సరస్వతికి బొట్టు, కాటుక, గాజులు, పుస్తెలు అన్నీ తీసేసి, గుండు గొరిగించి, తెల్లటి సైనుపంచె కట్టించి మూలన కూర్చోబెట్టడం!...

ఆ అమ్మాయి ఏ జన్మలో చేసుకున్న పాపమో ఇప్పుడిలా శాపంగా మారిందేమో!? అందమైన వయసులో ఉన్న ఒక అమ్మాయికి అంతకంటే పెద్ద శిక్ష ఉండ

బోదు. భర్త పోయినప్పుడు రాని కన్నీళ్లు పెద్దవాళ్లంతా కలిసి ఆచారం పేరుతో ఆమెను నిర్దాక్షిణ్యంగా శిక్షించినప్పుడు వచ్చేయి! అప్పట్నుంచీ రోజూ కన్నీళ్లే! ఆమె బతుకంతా శూన్యం అయిపోయింది.

చీకటి గదుల్లో చిరుదీపం వెలుతురులో గాలి ఆడని స్థలాల్లో ఎవరికంటా పడ కుండా రోజులు గడపాలని శిక్ష విధించే వారు ఆ రోజుల్లో భర్త పోయిన ఆడదా నికి. సామాజిక కట్టుబాట్లు, సాంఘిక దురాచారాలు విధివంచితులైన అబలలతో వికృతంగా ఆడుకున్నరోజులవి. కొంత మంది ఇళ్లలోనే ఈ దురాచారం మరీ ఎక్కువగా ఉండేది.

సతీసహగమనం తరువాత ఈ దురా చారం బాగా ప్రబలింది.

ఎంతమంది అబలలు మూగగా రోదిం చేవారో? !

ఎంతమంది స్త్రీలు ఆత్మహత్యలు చేసుకు న్నారో? !

ఎదురుతిరిగినవాళ్లు మాత్రం చాలా తక్కువ!

జీవితంలో ఎన్ని పోగొట్టుకున్నా బతకా లనే కాంక్ష. దానిమీద అపేక్ష పోగొట్టుకో లేని సరస్వతిలాంటి వాళ్లు కొంతమంది జీవితంతో రాజీపడి బతకడం తప్ప వేరే దారి లేదనుకున్నారు.

విధిచేత దెబ్బతిని, సమాజంచేత కూడా చావుదెబ్బలు తింటున్న అబలల్ని మూఢా చారాల ఇనుప చక్రాలకింద పడకుండా చేయూతనివ్వడంపోయి నలుగురూ నాలు గురాళ్లు విసిరితే ఇహ వాళ్లని రక్షించేదె వరు? వారికి దిక్కెవరు?

ఇప్పటికీ భర్త పోయిన ఆడదానికి మనవాళ్లు విధించే శిక్షలు చాలా ఉన్నా యమ్మా. ఎక్కడో చాలా కొద్దిమంది ఆడ వారు ఆ శిక్షల్ని, దురాచారాల్ని అతిక్రమిం చినా, పెద్దవాళ్ల ఆక్షేపణలకి, అవహేళన లకి గురవుతూనే ఉన్నారు.

### ఎవరిని పూడ్చాలో?

ముని మాణిక్యం కాంతంతో పోట్లాడి అరవ వాళ్ల పూటకూటింటికి వెళ్లి తలుపు తట్టారు. 'యారూ?' అంటూ తలుపుతీశాడు హోటల్ వాడు. టోకెన్ తీసుకుని పళ్లెం ముందు కూర్చున్నారు. 'మెతుకులు వేయనా?' అన్నాడు. మెతుకులనేసరికి అవాక్కయ్యారు. వాడు పెట్టింది మొదటి వాయి పచ్చడిలోకే సరిపోలేదు. మళ్లీ అన్నం పెట్టించుకున్నారు. నెయ్యి వేయడానికి పొడవైన గరిటెను ఆయన నెత్తిమీదుగా కడునేర్పుగా పోనిచ్చి హిమాల యాలనుండి జాలువారే గంగలా భ్రమింపజే శాడు. కూరన్నం తినకముందే 'సాంబారూ? సాంబారూ?' అని అరిచాడు. ఆలస్యం చేస్తే మళ్లీ రాడేమోనని సాంబారు లాగించి, మజ్జిగ తో తిన్నారు. వెళ్లడానికి లేవగా 'యక్స్ట్రాసార్' అన్నాడు. అదనపు డబ్బిచ్చిన తర్వాత వాడు 'పూడుస్తారా?' అన్నాడు. 'ఏమిటి?' అడిగారు మాణిక్యం. 'పూడుస్తారా?' అని మళ్లీ అడి గాడు వాడు. 'ఎవరిని?' అన్నారాయన భయంగా. 'ఏమిసార్! ఇప్పుడూ పూడు స్తారా?' అన్నాడు మళ్లీ వాడు. దాంతో ఆయన 'ఇప్పుడు కాదులే-రేపొచ్చి.' అని ముందుకు సాగారు. 'నాచేత ఏదో పూడ్పిం చేలా ఉన్నాడే' అని ఆందోళన చెందారట.

కందుకూరి వీరేశలింగంగారి ధర్మమా అని కొంతమంది స్త్రీలలో చైతన్యం కలి గింది. సమాజంలో దురాచారాల్ని ఎదిరిం చడానికి వాళ్ళు చాలా కష్టపడ్డారు. సర స్వతి మాత్రం అలా ఉండిపోయింది. ఏ మార్పు లేకుండానే.

కాలం ఎవ్వరికోసమూ ఆగదు.

కొన్ని సంవత్సరాలు గడిచిపోయేయి.

భర్తపోయిన తరువాత సరస్వతి పుట్టిం ట్లో ఉండి చదువుకుంది. సరస్వతి తండ్రి శ్రీనివాసరావు చాలా మంచివాడు. ఛాందస భావాలు గిట్టనివాడు. కూతురి పరిస్థితికి అతను బాధపడని రోజంటూ లేదు. తన కూతురు సుఖ-సంతోషాలతో

ఉండాలి. అదే అతని కోరిక. అతనికి సర స్వతి పెద్ద కూతురు. రెండోది వసుంధర. అప్పటికే వసుంధరకి నాకూ పెళ్లయిపో యింది. సరస్వతి ఎస్.ఎస్.ఎల్.సి. చది వింది. ఉద్యోగం చేస్తానంది. వాళ్లు అప్పుడు చీపురుపల్లి బ్రాహ్మణ అగ్రహా రంలో ఉండేవారు. సరస్వతికి అనుకో కుండా ఎలిమెంటరీ స్కూల్లో ఉద్యోగం దొరికింది. కాని ఆ స్కూలు విజయన గరంలో ఉంది. వాళ్ల కుటుంబం విజయ నగరం వచ్చేసింది. ఉద్యోగంలో చేరింది. తండ్రి, అన్నల ప్రోత్సాహంతో ఆమె రోజూ స్కూలుకి వెళ్లి వస్తున్నది. కాని ఆ గుండు, సైను పంచెతోనే రోజూ స్కూలుకి వెళ్లేది.

> **కొత్తగాలి...**
>
> **అత్తా.. ఒకింటి కోడలే**
> **కోడలూ.. ఒకనాటికి అత్తే!**
> **మరి, బిత్తరపోయేది**
> **మొగుడనే మగవాడే!!**
>
> – పీఎస్సెన్. రాజు,
> హైదరాబాద్

హఠాత్తుగా శ్రీనివాసరావు గుండెపోటు వచ్చి పోయేరు. పాపం సరస్వతి కన్నీళ్లు ఇంకిపోయిందాకా ఏడ్చింది. అన్న ఓదా ర్చేడు. స్కూలునించి వచ్చేక రోజూ వది నతో కల్సి సాయంత్రంపూట కోట పక్క నున్న మూడు కోవెళ్లలో జరిగే హరికథా కాలక్షేపానికి వెళ్లేది. ప్రతీరోజూ కూతురు గుండు, సైను పంచెతో తిరగడం చూసిన ఆమె తల్లి మనసు తరుక్కుపోయింది. మరో రెండు నెలలకే ఆవిడ కూడా కన్ను మూసింది. అప్పుడు మళ్లీ ఏడ్చింది. సరస్వతి. ఏడ్చే సంఘటనలే ఆమె జీవి తంలో ఎక్కువ! సరస్వతికి భర్త తాలూకు ఆస్తి ఒక ఇల్లు వచ్చింది. ఆ ఇల్లు గుండాల వారి వీధిలో ఉండేది. ఆ ఇల్లు అద్దెకిచ్చి అన్న, వదిలనలతో ఉండేది. వసుంధర వాళ్ల వదిన మంచిదే. సరస్వతిని బాగానే చూసుకునేది. రోజూ ఇద్దరూ కల్సి హరి కథ వినడానికి వెళ్లేవారు. రంగాచారి అనే హరిదాసు హరికథ చెప్పేవాడు. రంగా చారి అందగాడు. ఆరడుడుల ఆజానుబా హువు, కండలు తిరిగిన శరీరం, సన్నని మీసకట్టు, పట్టుపంచె, మెడలో బంగారంతో చేయించిన రుద్రాక్షమాల, పెద్ద పువ్వుల దండ, చేతిలో చిడతలు, నుదుట విభూతి రేఖలు... ముఖ్యంగా ఎప్పుడూ చెదరని చిరునవ్వుతో చూపరులను విశేషంగా ఆక ర్షించేవాడు. అతను హరి కథ చెప్పడం ప్రారంభించిన కొద్దిరోజుల్లోనే రాజుగారి కోట దగ్గరున్న మూడు కోవెళ్లు జనంతో కిటకిటలాడిపోయేవి.

మహాభారతంలోని ప్రతీ ఘట్టాన్ని హృదయానికి హత్తుకుపోయేటట్లుగా, మధ్య మధ్యలో పిట్టకథల్ని కూడా జోడించి చెప్పేవాడు. తను వర్ణించే సన్ని వేశాన్ని ఇంకా రక్తి కట్టించడానికి మధ్య మధ్యలో స్టేజీమీద స్టెప్స్‌లాంటి గంతులు వేసేవాడు రంగాచారి.

సరస్వతికి హరికథ అన్నా, హరిదాసు అన్నా శ్రద్ధ పెరిగిపోయింది!

ప్రతీరోజూ ఉదయాన్నే పెరట్లో పూచిన నందివర్ధనం పువ్వులన్నీ కష్టపడి కోసేది. నంది వర్ధనం పువ్వులకి తులసిదళాలు చేర్చి అందంగా మాల అల్లేది. ఎప్పుడు సాయంత్రం అవుతుందా అని ఎదురుచూ సేది. తను అపురూపంగా అల్లిన ఆ మాలని సాయంత్రం హరికథకు వెళ్లిన ప్పుడు హరిదాసుకి శ్రద్ధగా సమర్పించేది. ప్రతీరోజూ రంగాచారి ఆ పూలమాలని మెడలో ధరించేవాడు.

నిస్సారమైన ఆమె జీవితంలోకి నవవ

సంతంలా ఆమెకి తెలియకుండానే ప్రవేశిం చేడు రంగాచారి. మండువేసవిలో కురిసిన చిరుజల్లులా అతని తలపులు ఆమెను పర వశింపచేసేవి.

హరికథ చెప్తున్నంతసేపూ రంగాచారి చూపులు సరస్వతి మీదనే ఉండేవి. సర స్వతి తనవైపు చూడగానే కొంటెతనంతో కూడిన ఓ చిరునవ్వు విసిరేవాడు అతను. ఆ ఒక్క చిరునవ్వే మన్మథబాణంలా వచ్చి ఆమె మనసుని తాకేది.

ఉద్యోగం చేస్తున్నా సర్వం కోల్పోయినా దానిలా విరక్తిగా ఉండే సరస్వతి ఆ హరి దాసుని చూసేక చాలా ఉత్సాహంగా ఉండడం మొదలెట్టింది.

ఎప్పుడో ఎక్కడో పారేసుకున్న మధుర మైన జీవితం మళ్లా దొరకబోతున్నట్లుగా ఎంతో సంతోషంగా ఉంది. కొంటెచూ పులు, ఓరచూపుల మధ్యనే వాళ్లిద్దరి మధ్య పరిచయం పెరిగింది.

'మీరు' అనేది 'నువ్వు'లోకి మారేక ఒక రోజు రంగాచారి అన్నాడు సరస్వతితో 'నువ్వు చాలా అందంగా ఉంటావు' అని. ఆ మాటకి ఆమె పొంగిపోయింది.

ఇంతవరకు ఎవరూ ఆమెను ఆ మాట అనలేదు.

'నువ్వు అందంగా ఉంటావన్న సంగతి నీతో ఎవరూ చెప్పలేదా? నీకేమిటి ఈ శాపం? ! నువ్వు మారాలి. నీ కట్టు బొట్టు మారాలి. వస్త్రధారణ మారాలి. రోజులు మారిపోతున్నాయి. కాలంతోపాటు మనమూ మారాలి' అని ఒకరోజు ఉపదే శించేడు రంగాచారి.

అతని మాటలు మంత్రంలా పని చేసాయి ఆమెమీద. ఆమె ఏపని చేస్తున్నా రంగాచారి అన్న మాటలే ఆమె చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నట్లుగా ఉండేవి. ఫలితంగా ఆమె జుట్టు పెంచుకోవడం మొదలుపె ట్టింది. మెల్లమెల్లగా బొట్టు- కాటుక, పువ్వులు- గాజులు అన్నీ పెట్టుకోవడం మొదలు పెట్టింది. వాయిల్ చీరలు కట్టసా గింది. రంగు రంగుల వాయిల్ చీరలు కొనుక్కుంది. అతని కళ్లు ఏ ప్రేమ సందే శాన్ని అందించాయో, అతని పెదవులు ఏ ప్రేమరాగాల్ని ఆలపించాయో గాని సర స్వతి అతనికి పూర్తిగా దాసానుదాసురాలు అయిపోయింది. అతనికి పూర్తిగా లొంగి పోయింది. అన్నా వదినలు, ఊర్లోవాళ్లు అందరూ అరచి గోల చేసేరు. ఆమె ఎవ్వరి మాటా లక్ష్యపెట్టలేదు.

ఒక విధమైన తెగింపు బయలుదేరింది ఆమెలో. తన ఇంట్లో అద్దెకుంటున్న వాళ్ల ను ఖాళీ చేయించి రంగాచారితో ఆ ఇంట్లో కాపురం పెట్టింది.

ఆమె పనిచేస్తున్న స్కూల్లో అందరూ చెవులే కాదు ముక్కూ, నోరు అన్నీ కొరు క్కున్నారు! ఆమె పట్టించుకోలేదు. కాని విధి ఆమెతో మరోసారి ఆడుకుంది. రంగా చిరి మెల్లగా మంచి మాటలు చెప్పి ఆమె పేరున ఉన్న ఇంటిని అతని పేరున రాయించుకున్నాడు.

అతనికి అంతకుముందే భార్యా పిల్లలు ఉన్నార్ట! అనాదిగా ఆడదానికి జరుగుతున్న అన్యాయమే ఆమెకూ జరిగింది.

ఆమె మీద మోజు తీరిపోయేక ధైర్యంగా తన భార్యాపిల్లల్ని తీసుకొచ్చి ఆ ఇంట్లోనే ఉంచేడు రంగాచారి. సరస్వతిని ఆ ఇంట్లోంచి పంపించేసేడు. వీధిలో నించుని పిచ్చిపట్టినదానిలా రంగాచారిని, అతని పెళ్లాన్ని నానా తిట్లు తిట్టింది. శాపనా ర్థాలు పెట్టింది. ఆఖరికి ఏమీ చెయ్యలేక అన్నావదినల దగ్గరకు చేరింది. వాళ్లు ఇంట్లోకి రానియ్యలేదు. ఆఖరికి ఆ వూర్లోని ఒక పాడుబడ్డ నూతిలో దూకి ప్రాణాలు తీసుకుంది!

నెత్తిన గుండు, తెల్లటి సైను పంచెతో ఎవరికి ఎదురొస్తే ఎవరు తిట్టిపోస్తారోనని

భయంతో అటు ఇటు చూసుకుంటూ కాలు అవతలపెట్టడం, అలా ప్రవర్తిం చడం అన్నది ఆనాటి సనాతన సాంప్రదా యాన్ని బట్టి ఆలోచిస్తే వింతల్లోకెల్లా వింత... అనుకోవాలి!

'అవును పెదనాన్నా!' పురుషులందు పుణ్యపురుషులు వేరయా! విశ్వదాభిరామ వినుమవేమ!" అన్నట్టు ఎక్కడో మీలాంటి, మా నాన్న గారి లాంటి శ్రీరామచంద్రులు ఉన్నారు తప్ప చాలామంది మగాళ్లు ద్విపాద పశువులు. పయోముఖ విషకుం భాల్లాంటివారే.

అసలు భర్తపోయిన ఆడదాన్ని అందవి కారంగా చేసి పరపురుషుడి చూపు ఆమె మీద పడకుండా మూలన కూర్చోబెట్టే ఆచారం ప్రవేశపెట్టింది ఈ మగాడే!

మగాడు చాలా స్వార్థపరుడు. వయ సులో ఉన్న ఆమె - మనసులోని కోరికల్ని జయించలేక ఎక్కడ వశంతప్పి కుటుంబా నికి కళంకం తెచ్చిపెడుతుందోనని మగా ళ్లందరికీ భయమే! వ్యవస్థ మారాలి అంటే ఆడదాని ఆలోచనా విధానంలో మార్పు రావాలి!

ఆడదాన్ని అబలని చేసినవాడు ఈ మగాడే! న్యాయమైన శిక్షాస్మృతి మన చట్టానికి లేదు. ఉంటే తన స్వప్రయోజ నాల కోసం ఆడదానికి అన్ని ఆంక్షలు పెట్టిన మగాడిని బాగా శిక్షించి ఉండేది" అంది జ్యోతి ఆవేశంగా.

"లేదమ్మా. ఇప్పుడు కాలం మారింది. గుండు, సైనుపంచె కాలం పోయింది. కందుకూరి వీరేశలింగం పంతులుగారు, రాజారామమోహనరాయ్‌ల పుణ్యమా అని స్త్రీ పునర్వివాహ చట్టం వచ్చేక విధవలు మళ్లీ వివాహం చేసుకుంటున్నారు. మా కాలంలో మాత్రం ఇలాంటి సాంఘిక దురా చారాలన్నీ బాగా ఎక్కువగా ఉండేవి. అందుకే సరస్వతి లాంటి వాళ్లు ఎంతో మంది బలైపోయేరు" జ్యోతికి నచ్చజెప్తున్న ధోరణిలో అన్నారు జానకిరామయ్య.

"నేనింక వెళ్తానమ్మా. పొద్దున్న వచ్చేను. నీకు బోరు కొట్టించి ఉంటాను. అసలే నీకు జ్వరం కూడాను" అన్నారాయన నొచ్చు కుంటూ.

"లేదు పెదనాన్నా! నా జ్వరం తగ్గిపో యింది. అయినా మీతో మాట్లాడితే అసలు సమయమే తెలీదు. ఎన్నో విష యాలు సమగ్రంగా తెల్సిన మహానుభా వులు మీరు!"

"వస్తానమ్మా! జాగ్రత్తగా ఉండు. లేని పోని ఆలోచనలు మనసులో పెట్టుకుని మనసు పాడుచేసుకోవద్దు. ఆс అన్నట్టు సరస్వతి గురించి మీ దొడ్డమ్మని ఏమీ అడక్కు. ఆ టాపిక్ ఎవరి దగ్గరా ఎత్తడం తనకిష్టం లేదు. వాళ్లక్కని తల్చుకుని ఏడుస్తుంది. మొదట్లో అయితే అక్క చేసిన పనికి తను సిగ్గుతో చితికిపోయి ఎవరికీ మొహం చూపించడానికి ఇష్టపడేది కాదు. అందుకే నీకు ఇంతలా చెప్తున్నాను. తలు పేసుకో" అని జానకిరామయ్య బయలుదే రేరు.

రాత్రి జ్యోతి పడుకుందన్న మాటేగాని నిద్ర పట్టడంలేదు. వివేక్ చిన్నవాడు. సాయంత్రం స్కూలునించి వచ్చి హోమ్ వర్క్ చేసుకుని అడుకుందికి వెళ్లాడు. తర్వాత కొంతసేపు టి.వి. చూసేడు. జ్యోతిని 'అమ్మా' అనే పిలుస్తాడు. అలా అలవాటు చేసింది జ్యోతి. వాడు దుప్పటి కప్పుకుని హాయిగా పడుకున్నాడు. జ్యోతికి మాత్రం ఏవో పిచ్చి పిచ్చి ఆలోచనలు వస్తున్నాయి. మనసంతా చిందరవందరగా ఉంది.

తను ఒంటరి పోరాటం చేస్తున్నది.
జీవితంలో పోరాటం!
పరిస్థితుల్తో పోరాటం!
సమస్యలతో పోరాటం!

ఊపిరి ఉన్నంతకాలం మనిషికి ఈ పోరాటం తప్పదు.

ఏమిటీ జీవితం? అసలు ఎందుకీ జీవితం. తల్లిదండ్రులు పోయేరు. ఉన్న ఒక్క చెల్లి హైదరాబాదులో ఉంది. ఎప్పుడో బుద్ధిపుడితే ఫోన్ చేస్తుంది! అంతే! తను ఎవరికోసం జీవించాలి? తను జీవించే తీరాలా?

ఈ ఆలోచన రాగానే లేచి కూర్చుంది. ఎందుకో భయంగా ఉంది. మరుక్షణం వివేక్ ఆమె మనసులో మెదిలేడు.

'అవును. తను వివేక్ కోసం జీవించాలి. కాని... వాడు జానకిరామయ్యగారి వంశాంకురం. వాళ్ల వారసుడు. వాడిని పెంచి పెద్దచేసి ప్రయోజకుడ్ని చెయ్యమన్నారు కాని వాడు శాశ్వతంగా నీవాడే అనలేదుగా. రేపు వీడు పెద్దయ్యేక వాళ్లొచ్చి తీసుకువెళ్లిపోరన్న నమ్మకం ఏమిటి?' గజిబిజి ఆలోచనలతో ఆమె మనసంతా పాడై పోయింది. ఇంతలో సడన్‌గా కరెంటు పోయింది. చుట్టూ చీకటి! చీకటి మృత్యువు తాలూకు నీడలా చిక్కగా పర్చుకుంది. అప్పుడప్పుడు ఎండుటాకుల మీద అడుగుల చప్పుడులా ఏవో శబ్దాలు ఆమె భయాన్ని మరింత పెంచుతున్నాయి. ఎందుకో గుండెలో ఏదో గుబులు. ఏ క్షణంలో ఏం జరుగుతుందోనన్న భయం.

గుండె తడబడి ఊపిరి పీల్చడం కష్టమైంది. చిరుచెమటలు నుదుటిపై మెరుస్తున్నాయి. సన్నగా వేళ్లు వణకటం మొదలైంది. ఏదో అదృశ్యశక్తి బలంగా కదిలిస్తున్నట్టు ఒక్కసారిగా కాంపౌండు లోపలున్న పెద్ద చెట్టు ఊగిపోవడం మొదలెట్టింది. ఈదురుగాలి ఈడ్చికొడుతున్నది. కొబ్బరి చెట్లు నిస్సహాయంగా తలలూపుతున్నాయి. సన్నగా ప్రారంభమైన చినుకులు పెద్ద వర్షంగా మారేయి. ఉరుములు, మెరుపులు, పిడుగులతో వాతావరణం భయంకరంగా మారింది. ఆమెకి ఏడుపొచ్చింది. కన్నీళ్లు ఆగడంలేదు.

"జీవితంలో తను ఏం తప్పు చేసింది? ప్రేమించి పెళ్లి చేసుకుంది. ప్రేమించడం తప్పని తను అనుకోలేదు. ఆదిత్య తనని ప్రాణాధికంగా ప్రేమించాడు. తనని అతని సర్వస్వంగా భావించేడు! అలాంటి ఆదిత్య ఇప్పుడు తనని వదిలి మరొక అమ్మాయిని పెళ్లిచేసుకొని అతని దారి అతను చూసుకున్నాడు. నలుగురిలో నిలదీసే ధైర్యం తనకులేదు. పరువు కోసం పాకులాడే తనలాంటి అమ్మాయిలు అన్ని కష్టాలూ మౌనంగానే భరిస్తారు! ఈ మగాడు ఎంత స్వార్థ పరుడు! అప్పుడు అంతగా ఆకర్షించిన తను ఇప్పుడు అతన్ని ఆకర్షించ లేకపోయిందా? తనలో అందం అప్పటికీ, ఇప్పటికీ ఒక్కలాగే ఉంది. తప్పు తనలో ఉందా? అతనిలో ఉందా? ..."

పిచ్చి పిచ్చి ఆలోచనలతో ఆమె బుర్రంతా వేడెక్కిపోయింది. ప్రతీరోజూ అతను గుర్తొస్తూనే ఉంటాడు. అతన్ని తల్చుకున్నప్పుడల్లా తనకి ఏడుపు వచ్చేస్తుంది! ఏం లాభం?

కన్నీటిని తుడవాల్సిన భర్తే ఆ కన్నీటికి కారణం అవుతూంటే ఇక ఆ భార్య కన్నీరు తుడిచేదెవరు? కురుస్తున్న వాన ధారల్లో ఆమె కన్నీరు కూడా కల్సిపోయినట్టుంది. వర్షం అంతకంతకూ అధికమవుతూ తన విశ్వరూపం చూపిస్తోంది.

"జ్యోతీ! జ్యోతీ!" సడన్‌గా పిలుపు వినిపించింది. ఎవరో పిలుస్తున్నారు. ఎవరు? ఈ సమయంలో ఎవరు?! కొంపతీసి ఏ దెయ్యమో కాదుకదా. ఆమె భయం రెట్టింపయింది. శరీరం మీది రోమాలు నిక్కబొడుచుకున్నాయి. ఎమర్జెన్సీలైటు పని చెయ్యడంలేదు. ఆ చీకట్లో అగ్గిపెట్టె ఎక్కడుందో కనబడ్డంలేదు. కొవ్వొత్తి కూడా లేదు!

"జ్యోతీ! జ్యోతీ!" ఈసారి మళ్లీ పిలుపు. ఆ చీకట్లో లేచి ఆంజనేయ దండకం చదువుకుంటూ భయంగా అటు ఇటు చూస్తూ తలుపు నెమ్మదిగా తెరిచింది.

ఎదురుగా వర్షంలో తడిసిపోతూ.... గోపి.

"ఏమైంది గోపీ? " ఆశ్చర్యంగా, అనుమానంగా చూస్తూ అడిగింది జ్యోతి.

గోపి ఏడుపు మొదలెట్టేడు.

"అక్కకు... అక్కకు.."

"ఆఁ. ఏమైందో చెప్పు అక్కకి? " ఆత్రుతగా అడిగింది.

"అక్క...మీద ఆ మాధవ్ లేడూ.. వాడు ఏసిడ్ పోసేసేడు. అమ్మనాన్న తిరుపతి వెళ్ళేరు. సమయానికి ఎవరూ లేరు. మాధవ్ ఇంటికొచ్చి అక్కని బెదిరించేడు.. ప్రేమిస్తావా? లేదా అంటూ.

'నీలాంటి చింపాంజీగాడ్ని ఎవరు ప్రేమిస్తారు? ' అనేసర్కి వాడికి కోపం వచ్చి, 'నీ మొహం కూడా ఎవరు చూసినా అసహ్యించుకునేలా చేస్తాను!' అంటూ మొహంమీద ఏసిడ్ పోసేసి పారిపోయేడు. అక్క బాధ భరించలేక కేకలు పెడుతున్నది. తొందరగా రా జ్యోతీ! అక్కని మనం విశాఖపట్నం తీసుకువెళ్దాం. నీ కోసం అక్క కలవరిస్తోంది" అన్నాడు ఏడుస్తూ.

జ్యోతికి షాక్ తగిలినట్టయింది వాడు చెప్పింది విని.

"పద. పదా.." అంటూ మరేం ఆలోచించకుండా వివేక్‌ని లేపి, తలుపేసుకోమని చెప్పి బయలుదేరింది.

ఇద్దరూ కల్సి టాక్సీ మాట్లాడి పల్లవిని విశాఖపట్నం తీసుకువెళ్లారు. పల్లవిని అతి కష్టం మీద హాస్పిటల్లో అడ్మిట్ చేసుకున్నారు. డాక్టర్లు ఎన్నో ప్రశ్నలు వేసేరు. పల్లవి మాట్లాడలేకపోతున్నది. జ్యోతే డాక్టర్లకి జరిగిన విషయం చెప్పింది.

"ఏసిడ్ చాలా పవర్‌ఫుల్‌ది. ముక్కులోంచి, గొంతులోంచి లోపలికి వెళ్లిపోయింది. ఆమె బతకడం కష్టం. అయినా మా శాయశక్తులా ప్రయత్నిస్తాం" అని చెప్పేరు డాక్టర్లు.

"ఏమైందే? ఇంట్లో అమ్మానాన్నా లేనప్పుడు జాగ్రత్తగా ఉండాలిగాని అలా వీధి తలుపు తీసుకుని కూర్చుంటే ఎలాగే? "

అప్పుడు మెల్లగా పెదవి విప్పింది పల్లవి. ఒక్కొక్క మాట అస్పష్టంగా పలుకుతోంది.

"ఎప్పట్నుంచో... నన్ను.. ప్రేమిస్తున్నానంటూ నావెంట పడుతున్నాడు మాధవ్. వాడి మొహం చూస్తేనే నాకు భయం. పగలు చూసిన మొహం రాత్రి కలలో కనిపించి భయపెట్టేది. అయినా అందం

> **కొత్తగాలి...**
>
> **ఈ విజయం**
> **నా మొదటి భార్యది**
> **నా విజయం**
> **నా రెండో భార్య**
>
> – జి. సరోజినీదేవి,
> సికింద్రాబాద్

దేముంది? ఇవాళ ఉంటుంది రేపు పోతుంది. గుణం ప్రధానమని నాకు తెల్సు. రోజూ ఆఫీసుకెళ్లేటప్పుడు, వచ్చేటప్పుడు నా వెనకాలే వచ్చి నాతో మాటలు కలిపేవాడు. నవ్వించేవాడు. సరదాగా జోకులేసేవాడు. వాడి జోకులకి నవ్వొచ్చి అప్పుడప్పుడు నేనూ నవ్వేదాన్ని. ఒకరోజు వాడు, 'పల్లవీ! నేను నిన్ను చాలా గాఢంగా ప్రేమిస్తున్నాను. నిన్ను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను. నువ్వు నన్ను పెళ్లి చేసుకోకపోతే నేను ఆత్మహత్య చేసుకుంటాను' అన్నాడు. అలా మొదలైంది. వెంట

పడి వేధించడం మొదలు పెట్టేడు.

వీడి బాధ పడలేక, 'నీలాంటి చింపాంజీ గాడిని ఎవర్తి ప్రేమిస్తుంది? ! నువ్వు మరొక చింపాంజీని వెతుక్కో ప్రేమించడానికి.. ఎంచక్కా ఈడూజోడు బాగుంటుంది!' అన్నాను ఒళ్లుమండి ఓరోజు.

మా ఇంట్లోవాళ్లు నాకు పెళ్లి సంబంధం చూసేరు. అబ్బాయికి నేను బాగా నచ్చేనుట. వెంటనే ముహూర్తం పెట్టామన్నారు.

నా పెళ్లి విషయం మాధవ్‌కి తెల్సింది. ఓరోజు.

'నువ్వు ఎలాంటి పిచ్చి పిచ్చి వేషాలు వేయకు. నాకు పెళ్లి నిశ్చయమైంది. మరి నా వెంటపడి నన్ను వేధించకు' అని నిర్మొహమాటంగా అతడితో చెప్పేసేను.

దాంతో వాడు నన్ను నానా తిట్లు తిట్టడం మొదలెట్టేడు.

'నీ అందం చూసుకొని నీకు బాగా పొగరు ఎక్కువైంది. నాకు దక్కని ఈ అందం మరెవ్వరికీ దక్కనివ్వను. నీ మొహం కూడా చింపాంజీ మొహంలాగే తయారయ్యేలా నేను చేస్తాను' అన్నాడు. అయితే అప్పట్నుంచి వెంటపడ్డం మానేసేడు. పీడ విరగడైందని హాయిగా నిట్టూర్చేను.

వాడు సమయం కోసం ఎదురుచూస్తున్నాడని నేను అస్సలు ఊహించలేదు. ఇప్పుడు... ఇలా..."

అతికష్టం మీద మాట్లాడిన ఆ మాటలు మెల్లగా ఆగిపోయేయి. ఆమె శ్వాస ఆగిపోయింది. ప్రాణాలు అనంత విశ్వంలో కలిసిపోయేయి.

జ్యోతి దుఃఖం ఆపుకోలేకపోయింది. వెంటనే వాళ్ల అమ్మానాన్నలకి ఫోన్‌చేసి పిలిపించింది.

ఇందులో పల్లవిది కూడా కొంచెం తప్పు ఉందనిపించింది. మాధవ్‌ని రెచ్చగొట్టేలా మాట్లాడింది. సొట్టవాడికి 'నువ్వు సొట్టవాడివి' అని పదేపదే ఎద్దేవా చేస్తే, గాయపడేలా తిడితే వాడికి తప్పకుండా కోపం వస్తుంది. వాడికి మన కాలో, చెయ్యో విరగ్గొట్టెయ్యాలనిపిస్తుంది. అనాకారికి 'అద్దంలో నీ మొహం ఎప్పుడైనా చూసుకున్నావా? ఆ చింపాంజీ నీ కన్నా నయంగా ఉంటుంది!' అంటే అతగాడికి కచ్చితంగా కోపం వస్తుంది.

తర్వాత పల్లవి చేసిన రెండో తప్పు ఆమె ఇంటి తలుపులు తీసుకుని ఉండడం.

ఆడపిల్లలు అనుక్షణం అప్రమత్తంగా ఉండాలి. తలుపులు తీసుకొని ఉంటే ఎవరైనా ఇంట్లో ప్రవేశించవచ్చు. ఇంట్లో కూడా కొంతమంది అమ్మాయిలు తమ గది తలుపులు గడియ పెట్టుకోకుండా పడుకుంటారు! దగ్గరి బంధువులుగాని, బావగాని, మరెవ్వరైనా తమ కుటుంబంతో సన్నిహితులుగా మెలుగుతున్నవారుగాని ఆమెమీద మోజుపడి ఏ అర్ధరాత్రో అఘాయిత్యానికి పాల్పడవచ్చు. అటువంటి అవకాశం ఇవ్వకూడదు. మొదట అజాగ్రత్తగా ప్రవర్తించడం, తర్వాత బాధ పడ్డం.. ఇదంతా అనవసరమైన విపత్తును కొని తెచ్చుకోవడమేనని అన్పించింది జ్యోతికి. అలా చెయ్యడం వల్ల నష్టపోయేది, నాశనం అయిపోయేది ఆ అమ్మాయే!

### కొత్తగాలి...

**అన్నిటికన్నా**
**అతిపెద్ద**
**అంటువ్యాధి**
**ఆవులింత**

– అంబటి వెంకటశివారెడ్డి,
యర్రగుంట్ల, కడపజిల్లా




ఆదివారాలు, సెలవు రోజుల్లో జ్యోతి వివేక్‌ని తీసుకొని జానకిరామయ్యగారింటికి వెళ్తూ ఉంటుంది. ఆరోజు ఆదివారం వివేక్‌ని తీసుకుని వాళ్లింటికి వెళ్లింది జ్యోతి.

"తాతయ్యా!" అంటూ లోపలికి పరుగెత్తుకు వచ్చేడు వివేక్.

"ఏమ్మా జ్యోతి! బాగున్నావా? జ్వరం తగ్గిందా? " అడిగేరు జానకిరామయ్య మనవడ్ని ఒళ్లో కూర్చోబెట్టుకుంటూ.

"బాగున్నాను పెదనాన్నా!" అంది జ్యోతి.

"వీడు నిన్ను అల్లరి పెట్టడం లేదుకదా. బుద్ధిగా ఉంటున్నాడా? నీ మాట వింటున్నాడా? హోమ్‌వర్క్ చేస్తున్నాడా? సరిగ్గా చదువుతున్నాడా? " ప్రశ్నలు కురిపించేరు ఆయన.

"నేను చాలా బాగా చదువుతున్నాను తాతయ్యా! మొన్న క్వార్టర్లీ పరీక్షల్లో నేను క్లాసుఫస్టు వచ్చేను తెలుసా!" అన్నాడు సంతోషంగా.

వసుంధర వచ్చింది అక్కడికి.

"నాన్నమ్మా! ఎలా ఉన్నావు? " అంటూ అతని ఒడిలోంచి లేచి తుర్రుమని పారిపోయి వసుంధర పక్కన చేరేడు.

"మా నాయనే! మా బాబే! ఎలా ఉన్నావురా బంగారు తండ్రీ!" ఆవిడ మనవడ్ని ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంది.

"ఆదివారం ఎప్పుడొస్తుందా అని ఎదురు చూస్తూ ఉంటాను జ్యోతి! మరీ ఒంటరిగా బిక్కుబిక్కుమంటూ ఉండడం అంటే ఏదోలా ఉంది" ఆవిడ కళ్లల్లో నీళ్ల నిండేయి.

జ్యోతి ఆమెను పొదవి పట్టుకుని కాసేపు ఓదార్చింది.

ఆ సాయంత్రం భారతి దగ్గర్నుంచి ఫోన్ వచ్చింది.

"హలో అమ్మా!"

"హలో భారతీ! చెప్పమ్మా! ఏంటి సంగతి? " వసుంధర ఫోన్ ఎత్తి అడిగింది.

"నీకో శుభవార్తమ్మా" భారతి గొంతులో చెప్పలేనంత సంతోషం ప్రస్ఫుటమవుతున్నది.

> ## కొత్తగాలి...
>
> **నల్లధనం పక్షి**
> **విదేశాలకు**
> **వలస పోయింది**
> **తిరిగి రాలా**
>
> – మాధవీ సనారా,
> అనకాపల్లి

"ఏంటమ్మా అది? నాకు ఇంకా శుభవార్తలు కూడా ఉన్నాయా ఈ జన్మకి!" నైరాశ్యం గూడు కట్టుకుంది ఆవిడ మాటల్లో.

"అదేంటమ్మా? అలా అనేస్తున్నావు? నిజంగా ఇది శుభవార్తేనమ్మా! నేను తల్లిని కాబోతున్నాను. నెలతప్పేను" అంది భారతి ఆనందంగా.

"చల్లటి కబురు చెప్పేవు. చాలా సంతోషం తల్లీ. జాగ్రత్తగా ఉండు. ఈసారైనా పదిహేను రోజులకొకసారి డాక్టరు దగ్గరకి వెళ్లి చెకప్ చేయించుకో.."

"ఎవరు వసూ? " అంటూ జానకిరామయ్య అక్కడికి వచ్చేరు.

"ఏంటే ఆ చల్లటి కబురు? నాకూ చెప్పవా? "

వసుంధర తను విన్న విషయం మెల్లగా అతని చెవిలో వేసింది.

"అలాగా తల్లీ! చాలా సంతోషం. మన ప్రసాదుకి నువ్వంటే చాలా ఇష్టం. అక్కా.. అక్కా.. అని నీ పెళ్లి కాకముందు నిన్ను క్షణం కూడా వదిలిపెట్టేవాడు కాదు. ఇప్పుడు వాడే నీ కడుపున పుడతాడేమోనమ్మా"

"అవును నాన్నా! నేనూ అలాగే అనుకుంటున్నాను" అంది భారతి.

కాని మరొకవైపు చనిపోయిన పిచ్చికూతురు మళ్లీ తన కడుపున పుట్టేస్తుందేమోనని భయం కూడా ఉంది.

విషయం తెల్సి జ్యోతి కూడా సంతోషించింది. రాత్రిదాకా ఉండి భోజనాలు చేసి వెళ్లిపోయేరు జ్యోతి, వివేక్‌లు.

★ ★ ★

"అంకుల్! చాలా చాలా థాంక్స్, మీ పెరటివైపు పోర్షన్ మాకు అద్దెకి ఇచ్చినందుకు సంతోషంగా ఉంది" అంది స్వాతి.

"ఫర్లేదమ్మా. థాంక్స్ చెప్పేటంత గొప్ప విషయం కాదు!" అన్నారు జానకిరామయ్య.

"మీ విషయం మరెవ్వరికీ చెప్పకు. ఆంటీకి తెలియనివ్వకు. సరేనా!" అన్నారాయన లోపలకి వెళుతూ.

స్వాతి, ప్రభాకర్‌లకు ఎవరూ ఇల్లు అద్దెకు ఇవ్వలేదు. దానికి బలమైన కారణమే ఉంది...

స్వాతి, ప్రభాకర్‌ల పెళ్లి జరిగిపోయింది. అమాయకురాలైన స్వాతి అందరు ఆడపిల్లలాగే మొదటి రాత్రి గురించి ఎన్నో అందమైన కలలు కంది. తడబడే అడుగులతో

గదిలోకొచ్చి నించున్న స్వాతి ఎదురుగా కనబడిన దృశ్యం చూసి కొయ్యబారిపోయింది. ప్రభాకర్ అప్పటికే బాగా తాగి ఉన్నాడు. తాగిన మైకంలో స్వాతిని చూడగానే "ఏం ఫర్లేదు దా... నువ్వూ ఓ పెగ్ వేసుకో. ఇది వెరైటీ శోభనం. ఎంజాయ్" అంటున్నాడు. అతని మాటలు ముద్దగా వస్తున్నాయి. ఊహించని ఈ సంఘటనకి ఆమె మనసంతా అల్లకల్లోలంగా తయారైంది. కళ్లంట నీళ్లు జలజలా రాలాయి.

అతని చెడు అలవాట్లన్నీ తొందర్లోనే తెలిసాయి స్వాతికి. కాని అత్తమామలు కొడుకు సంగతి పట్టించుకోకపోవడం ఆమెకి చాలా ఆశ్చర్యం కలిగించింది. రోజులు గడుస్తున్నాయి. స్వాతి తన పుట్టింటి వాళ్లకి భర్త అలవాట్ల గురించి చెప్పలేదు. పరువు ప్రతిష్ఠల్ని ప్రాణంగా చూసుకునే ఏ తెలుగింటి ఆడబడుచు తన మనసులోని బాధలు తల్లిదండ్రులకి చెప్పుకుంటుంది?

వివేకం, విజ్ఞత, జీవితంపట్ల సరైన అవగాహన ఉన్నవాళ్లు తాము వేసే ప్రతి అడుగునీ ఆలోచించి వేస్తారు. కాని బాధ్యతారహితంగా తిరిగే ప్రభాకర్ లాంటి వాళ్లు తెలివి తక్కువగా, కామంతో కళ్లు మూసుకుపోయి అదే స్వర్గం అంటూ క్షణికమైన సుఖాలకి దాసోహం అయిపోతారు. ఫలితంగా వాళ్లు ఏడుస్తూ ఇతరుల్ని ఏడిపిస్తారు.

కొడుకు వ్యసనాలని దూరం చెయ్యడం ఆ తల్లిదండ్రుల వల్ల కాలేదు. ఒకరోజు తాగిన మైకంలో ప్రభాకర్ తండ్రిమీద చేయి చేసుకున్నాడు. దాంతో "వాడి ఖర్మ, వాడెలాపోతే పోనీ. ఎవరి ఖర్మకు ఎవరు కర్తలు? !" అని విసుగెత్తి ఊరుకున్నారు వాళ్లు. కోడలు వస్తే కొడుకు మారతాడేమోనని పెళ్లి చేసారు. అయినా ప్రభాకర్ అలవాట్లు మారలేదు.

ప్రభాకర్ ఆరోగ్యం రోజురోజుకి క్షీణించసాగింది. థ్రోట్ ఇన్‌ఫెక్షన్, జ్వరం, దగ్గు ఎన్ని మందులు తిన్నా తగ్గడంలేదు. ఆఫీసుకి వెళ్లడం మానేసాడు. దాంతో ఆ ఉద్యోగం పోయింది. స్వాతి పరిస్థితి అయోమయంగా తయారైంది. పుట్టింటి వాళ్లకి స్తోమత లేదు. అత్తమామల సాధింపులు ఎక్కువయ్యాయి. భర్తని బతిమాలి డాక్టరు దగ్గరకు తీసుకెళ్లింది. డా. చిదంబరం ప్రభాకర్‌కి అన్ని పరీక్షలు చేసేడు. ప్రభాకర్ మొహంలోకి చూస్తూ అన్నాడు.

"సారీ! ప్రభాకర్‌గారూ! మీకు హెచ్. ఐ. వి. పాజిటివ్ ఉంది. మీరు సరైన మందులు తీసుకోకుండా అశ్రద్ధ చెయ్యడం వల్ల అది ఎయిడ్స్‌లోకి దించింది. వెరీ సారీ! డాక్టర్ల చేతిలో ఇంకేం లేదు".

గాలి తీసేసిన బెలూన్‌లా అయిపో

## శ్రుతి కలిపిన మేష్టారు

ఒక హైస్కూల్‌లో మునిమాణిక్యంవారు కొంతకాలం సోషల్ మేష్టారుగా పనిచేశారు. ఒకరోజు ఆర్యద్రావిడ నాగరికతలను గురించి సీరియస్‌గా పాఠం చెబుతూ చివరికి, 'ద్రావిడుల ఆహార పదార్థాలు ఏవేవిటి?' అని ఒక్కో విద్యార్థిని ప్రశ్నించారు. ఒకడు 'రాగులు' అన్నాడు. మరొకడు 'సజ్జలు' అన్నాడు. ఇంకొకడు 'చోళ్లు' అన్నాడు. మునిమాణిక్యం వారికి తరచుగా గోళ్లు కొరుక్కునే అలవాటుంది. ఆ సమయంలో ఆయన ఆపని చేయడాన్ని గమనించిన మరో విద్యార్థి వెంటనే 'గోళ్లు' అన్నాడు. దాంతో క్లాసంతా ఒక్కసారి గొల్లుమంది. ఆయన కూడా వారితో శ్రుతికలిపారు.



యేడు ప్రభాకర్. స్వాతికి దుఃఖం ముంచుకొచ్చింది. భర్తమీద కోపం, అసహ్యం రెండూ కలిగేయి. అతన్ని వదిలి ఎక్కడికైనా పారిపోవాలనిపించింది. ఒక్కసారిగా ఆమెకి జీవితం మీద విరక్తి కలిగింది.

"అసలు ఈ హెచ్ఐవి అంటే ఏమిటి డాక్టర్? ఇది అంత ప్రాణాంతకమైన వ్యాధా? " సందేహంగా అడిగింది స్వాతి.

"అవునమ్మా! హెచ్ఐవి అంటే హ్యూమన్ ఇమ్యునో డెఫిషియెన్సీ వైరస్. దీనికి తగు జాగ్రత్తలు, సరైన మందులు తీసుకోకుండా వదిలేస్తే అది త్వరగా ఎయిడ్స్‌కి దారి తీస్తుంది. నీ భర్తది ఇప్పుడు అడ్వాన్స్‌డ్ స్టేజి. ఈ స్థితిలో ఉన్న అతన్ని కాపాడ్డం డాక్టర్లకి సాధ్యం కాదు. ఎయిడ్స్ అంటే ఎక్వైర్డ్ ఇమ్యునో డెఫిషియెన్సీ సిండ్రోమ్. ఈ వ్యాధి సెక్సువల్ ట్రాన్స్‌మిషన్ వల్ల వచ్చే విరివిగా సోకే ప్రమాదాలు ఎక్కువగా ఉన్నాయి. ఈ వైరస్ నీడిల్స్, బ్లేడ్సు, బ్లడ్ ట్రాన్స్‌ఫ్యూజన్ వల్ల కూడా రావచ్చు. అందుకే హాస్పిటల్స్‌లో ఇతరత్రా కూడా డిస్పోజబుల్ నీడిల్స్ వాడడం చాలా సురక్షితం. బ్లడ్ బాటిల్స్‌లోని బ్లడ్ కూడా ఫ్రెష్‌ది, ప్యూర్‌ది అయి ఉండాలి. ఈ వ్యాధి మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, మణిపూర్ రాష్ట్రాల్లో ఎక్కువగా ఉంది. ఈ ఎయిడ్స్ ముఖ్యంగా స్త్రీ పురుషుల సెక్స్ సంబంధాల వల్ల బాగా ప్రబలుతున్నది. పాశ్చాత్య దేశాల్లో అయితే సెవెన్టీ పర్సెంట్ కేసులు హెటిరో, హోమో సెక్సువల్స్‌తోనే వస్తున్నాయి! ఇప్పుడు సెక్సు ఒక వ్యాపారం అయిపోయింది. మన దేశంలో ఈ వ్యాధికి బలైపోతున్నది ముఖ్యంగా యువతీ యువకులే! వయసు వేడిలో విచక్షణాజ్ఞానం కోల్పోయి సెక్సు సంబంధాలు పెట్టుకుని జీవితాన్ని నాశనం చేసుకుంటున్నారు. దేశాన్ని ప్రగతి పథంలోకి నడిపించాల్సిన ఈ భావి భారతపౌరులు ఎయిడ్స్ అనే అగ్నికి ఆహుతైపోతున్నారు.. " ఆవేశంగా అన్నాడు డాక్టరు.

"ఈ వ్యాధి నిర్మూలించే మార్గాలు లేవా డాక్టర్? " నీరసంగా అడిగింది స్వాతి.

"ఉన్నాయమ్మా! నేషనల్ ఎయిడ్స్ కంట్రోల్ ఆర్గనైజేషన్ అని 1987వ సంవత్సరంలో మన ఇండియా లాంచ్ చేసింది. ఈ ప్రోగ్రాం ముఖ్య ఉద్దేశం వేగంగా వ్యాపిస్తున్న వ్యాధిని కంట్రోలు చెయ్యడం, రోగులకు కౌన్సిలింగ్ అండ్ టెస్టింగ్ సెంటర్స్‌ని అన్ని సిటీస్‌లోనూ నెలకొల్పడం, దానివల్ల ప్రారంభ దశలోనే ఈ వ్యాధిని కనిపెట్టవచ్చు. బ్లడ్ బ్యాంకులలో ఆరోగ్యమైన బ్లడ్‌ని సప్లయ్ చెయ్యొచ్చు. వాలంటరీగా బ్లడ్ ఇవ్వడానికి వచ్చిన వాళ్ల బ్లడ్‌ను తప్పనిసరిగా టెస్ట్ చేశాకే తీసుకోవాలి. పబ్లిక్ ఎవేర్‌నేస్, కమ్యూనిటీ సపోర్టు కూడా ఉండాలి. దానికి మీడియా సహకారం ఎంతైనా అవసరం. పల్లెల్లో, పట్నాల్లో ఎయిడ్స్ గురించి వివరాలు ప్రచారం చేయడం, పాటలు పాడి వినిపించడం, నాటికలు వెయ్యడం, స్టూడెంట్స్‌కి దాని గురించి సరైన అవగాహన కలిగించడం చాలా ముఖ్యం.

ప్రభాకర్ మొహంలో గిల్టీ ఫీలింగ్ కనిపించింది. స్వాతి పరిస్థితి నడిసముద్రంలో నావలా తయారైంది.

"డాక్టర్ ఏమన్నాడే? " ఇంటికి రాగానే స్వాతి అత్తగారు అడిగింది. స్వాతి జరిగిందంతా చెప్పింది. వినకూడని మాటేదో విన్నట్టుగా పరుగెత్తుకెళ్లి భర్తకి చెప్పిందావిడ. ఇద్దర్నీ తిట్టేరు. వాళ్లతో కల్సి భోజనం చెయ్యడం మానేశారు. మాట్లాడటం మానేసేరు. ఆవిడ తిట్లు, సణుగుళ్లు రోజురోజుకీ ఎక్కువైపోతున్నాయి.

"అత్తయ్యా! ఇది అంటువ్యాధి కాదు. నన్ను నమ్మండి" అంది స్వాతి. సుమిత్ర నమ్మలేదు. చీదరింపుగా చూసింది



# సంజ వెలుగు

పెద్దవయసులో తల్లిదండ్రులు తమ పిల్లల నిర్లక్ష్యానికి గురవడం, ఎన్నెన్నో ఇబ్బందులపాలవ్వడం మనకేం కొత్తకాదు. ప్రపంచంలోనే అగ్రరాజ్యమైన అమెరికాలో ఉద్యోగాలు చేసే పిల్లల తల్లిదండ్రుల పరిస్థితీ అలాగే ఉంటోంది. వారికి డబ్బు ఇబ్బందులు లేకపోవచ్చు.. కానీ జీవితం అంటే కేవలం డబ్బేకాదు కదా? ఇంకెన్నో కావాలి.. అవి లభించక వారు అక్కడ పడుతున్న అవస్థలు ఎన్నో.. ఎన్నెన్నో! పాశ్చాత్యీకరణకు లోనైన భారతీయ కుటుంబాల్లో నేడు తలెత్తుతున్న సమస్యలకు అక్షర చిత్రం

అక్కినపల్లి సుబ్బారావు

సంజ వెలుగు

చదివి తీరాల్సిన మంచి నవల




కోడల్ని.

"నువ్వేం చెప్పొద్దే. ఈ జబ్బు మాకు అంటుకుందంటే ఇంకేమైనా ఉందా? ఈ వయసులో మాకు చేసేవాళ్లెవరూ? కూర్చుని తింటే కొండలైనా కరిగిపోతాయి. మాకు మాత్రం ఏముందని మీ ఇద్దర్నీ కూర్చోపెట్టి మేపడానికి! మీ దారి మీరు చూసుకుంటే మంచిది" సుమిత్ర నిష్కర్షగా చెప్పేసింది.

భర్తని తీసుకుని పుట్టింటికి వెళ్లింది స్వాతి. అక్కడా అలాంటి పరిస్థితే ఎదురైంది. పరిస్థితులు మనిషిలో ఎన్ని మార్పులు తెస్తాయి!

'ఇది అంటువ్యాధి కాదు. మేమూ మీలాంటి మనుషులమే' అని ఎంత నచ్చజెప్పినా ఎవరూ ఇల్లు అద్దెకు ఇవ్వలేదు. పైగా వాళ్లని వింత జంతువులను చూసినట్టు చూడసాగారు.

అలాంటి పరిస్థితిలో జానకిరామయ్యగారు వాళ్లని దేవుడిలా ఆదుకున్నారు.

"అమ్మా! నువ్వు నా కూతురి లాంటిదానివి. మీ కష్టసుఖాలు నావి. మీరేమాత్రం సంకోచించవద్దు. ఇంటి అద్దె కూడా నాకు అక్కర్లేదు. మీరిద్దరూ నిశ్చింతగా ఇక్కడ ఉండొచ్చు. నాకు తెల్సిన స్కూల్లో నీకు ఉద్యోగం ఇప్పిస్తాను. చెయ్యి తల్లీ! ఏది కావాలన్నా నన్ను అడగండి" అన్నారు. మానవత్వంతో ఆయన చేసిన సహాయానికి స్వాతి జోహార్లు అర్పించింది. ఈ రోజుల్లో ఇలాంటి మహానుభావులు ఎంతమంది ఉంటారు? ప్రభాకర్‌కున్న వ్యాధి గురించి తెలిసి కూడా అతను తమ ఇంట్లో ఉండమన్నాడంటే అతని మహోత్కృష్టమైన వ్యక్తిత్వం తల్చుకుంటే ఆమె కళ్లు చెమ

ర్చేయి. ఆదర్శాలు చాలామంది వల్లిస్తారు. కాని ఆచరణలో పెట్టే అతికొద్దిమందిలో జానకిరామయ్యగారు ఒకరు. ఎన్ని జన్మలెత్తినా ఆయన రుణం తీర్చుకోలేను.. అనుకుంది స్వాతి.

అసలు విషయం వసుంధరకి తెలీదు. వండిన వంటకాలన్నీ స్వాతికి తీసుకెళ్ళి ఇవ్వడం, ప్రభాకరంకి వంట్లో బాగాలేదని తెల్సి పథ్యంగా వండి దగ్గరుండి తినిపించడం చేస్తున్నది ఆవిడ. అసలు ఆవిడ ఎయిడ్స్ గురించి ఎప్పుడైనా విందో లేదో మరి?

ఆ వృద్ధ దంపతుల ఆప్యాయతానురాగాలు, వాళ్లు చూపించే ఆదరణకి స్వాతి ఉక్కిరి బిక్కిరి అయిపోతోంది. కాని మనుషులతో ఆడుకోవడం 'విధి'కి ఒక వింత సరదా కదా?

ఒకరోజు రాత్రి పడుకున్న ప్రభాకర్ మరి లేవలేదు. అతని పంచప్రాణాలు గాల్లో కలిసిపోయాయి. పతియే ప్రత్యక్ష దైవం అన్నట్లుగా భర్తని ఎంతో శ్రద్ధగా చూసుకున్న స్వాతి కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. అతని వ్యాధి గురించి తెల్సినవాళ్లెవరూ ముందుకురాలేదు. ప్రభాకర్ నిష్క్రమణకి కావల్సిన ఏర్పాట్లన్నీ జానకి రామయ్యగారు స్వయంగా చేసేరు.

"అమ్మా స్వాతీ! ప్రభాకరం గురించి ఎవరికీ చెప్పకు. తప్పులు ఎంతోమంది చేస్తారు. దానికి ఇంత పెద్దశిక్ష అతను అనుభవించేడు. ఇంకా ఎందుకు అతని ఆత్మకి క్షోభ కలిగించడం? " అన్నారాయన పెద్దమనసుతో.

బ్రాహ్మణులను పిల్చి శాస్త్రోక్తంగా అన్నీ పూర్తి చేసారు. ఆయన ఒక కొమ్ము పట్టుకున్నారు. మరో ముగ్గురు బ్రాహ్మణులు మరో మూడు వైపులా పట్టుకున్నారు.

'ఈనాటి ఈ బంధమేనాటిదో? నిజంగా అది ఏనాటి బంధమో..' అనుకుంటూ జానకిరామయ్యగారు కంటతడి పెట్టుకున్నారు.

'ఏమిటీ జీవితాలు! పూజకు పనికిరాని పూలు! గడ్డిపూలు!' అనుకున్నారు బాధగా.

స్వాతి మాత్రం ఆ ఇంట్లోనే ఉంది. పెరటివైపు ఇంట్లో స్వాతి ఉండడంతో ఆ దంపతులిద్దరికీ నిశ్చింతగా ఉంది.

★ ★ ★

ఎవరి కష్ట-సుఖాలతో సంబంధం లేకుండా కాలం అలా పరుగులు తీస్తూనే ఉంది. భారతికి నెలలు నిండిపోయేయి. రమ్మని ఫోన్ చేసింది. వసుంధర, జానకి రామయ్యలు బయలుదేరేరు. శైలజ కూడా వస్తానంది. దాన్ని చూసి ఎన్ని రోజులైందో? ఆ అమ్మాయికి క్షణం కూడా తీరిక ఉండదు. దంపతులిద్దరూ వెళ్లేసరికి అప్పటికే భారతిని హాస్పిటల్లో జాయిన్ చేసేరు.

"పొద్దున్నించీ నొప్పులొస్తున్నాయమ్మా. భయంవేసి ఆయన హాస్పిటల్ కి తీసుకువచ్చేరు. మీరు ఇంత ఆలస్యంగానా రావడం!" అంది భారతి నిష్ఠూరంగా. డ్రిప్ ఎక్కించేరు. మరోగంట నొప్పులు పడ్డాక భారతి పండంటి మగపిల్లవాడిని ప్రసవించింది. వసుంధర సంతోషానికి అవధుల్లేకుండా ఉంది. జానకిరామయ్యగారు చాలా సంతోషించేరు.

పిల్లాడు దబ్బపండులా ఆరోగ్యంగా ఉన్నాడు.

"అమ్మా! మన ప్రసాద్.. అమ్మా! నాన్నా! మన ప్రసాదే పుట్టేసేడు. వాడికి వరప్రసాద్ అని పేరు పెడతాను."

"అలాగేనమ్మా. మొదట్నుంచీ మనం అనుకున్నట్లే అయింది. కొడుకు పుడితే బాగుణ్ణు అనుకున్నాం. ప్రసాద్ మళ్లీ జన్మ ఎత్తేసేడు! ప్రసాద్... ప్రసాద్!" ఆనందం పట్టలేక పిచ్చిగా ఏవేవో మాట్లాడేస్తోంది వసుంధర.

మూడోరోజున డిశ్చార్జ్ చేసేరు. భారతిని ఇంటికి తెచ్చేసేరు. అప్పుడే శైలజ వచ్చింది సూటుకేస్‌తో.

"అమ్మా! ఎన్నాళ్లయిందే నిన్ను చూసి!" అని కూతుర్ని గట్టిగా కావలించుకుంది వసుంధర.

ఆవిడ సంతోషంతో ఉబ్బితబ్బిబ్బు అయి పోతోంది.

శైలజక్కూడా తల్లిదండ్రుల్ని చూసిన సంతోషంతో నోటమాటరావడంలేదు.

"పోన్లే తల్లీ! ఇన్నాళ్ళకైనా మమ్మల్నిం దర్శీ చూడాలని నీకు అనిపించింది. అంతే చాలు" అంది వసుంధర.

"శైలూ! ఎప్పుడు ఫోన్ చేసినా బిజీగా ఉన్నాను అంటావు! ఏమిటమ్మా అంత బిజీ? ! ఉద్యోగం చెయ్యడం లేదు! మరి ఎందుకు బిజీ? " అడిగేడు జానకిరామయ్య.

"సమాజసేవ!. సమాజసేవ చేస్తున్నాను నాన్నా!"

"సమాజసేవ అంటే ఏ రకం సమాజ సేవ? !"

"ఏంలేదు నాన్నా! స్లమ్ ఏరియాస్‌కి వెళ్ళి వాళ్ల బాగోగులు చూడ్డం, అక్కడి పిల్లలకి చదువు చెప్పడం, వాళ్లకి ఆర్థికంగా సహాయం చెయ్యడం, దీనజనోద్ధరణకి పూనుకుని ప్రభుత్వానికి సిఫార్సు చెయ్యడం, తర్వాత అనాథాశ్రమాలకి వెళ్ళి అక్కడ అనాథ పిల్లలకి, బట్టలు, పుస్తకాలు, పెన్నులు, పెన్సిళ్లు, బిస్కట్లు, స్వీట్లు ఇవన్నీ ఇవ్వడం, వృద్ధాశ్రమాలకి వెళ్లి ఆ వృద్ధులకి పళ్లు, స్వీట్లు, ఆధ్యాత్మిక పుస్తకాలు పంచడం, వాళ్లకి చీరలు, పంచెలు, తువ్వాళ్లు పంచడం, వాళ్ళతో గంటసేపు గడిపి రావడం.. వారంతా పిల్లల ఆప్యాయతకు నోచుకోనివాళ్లు. భార్య మాటవిని బలవంతంగా తల్లిదండ్రుల్ని వృద్ధాశ్రమంలో చేరుస్తున్నారు కొంతమంది ప్రబుద్ధులు. అలాంటి ఆప్యాయత కరువైన అమ్మానాన్నలని కాస్సేపు నవ్వించి, మంచి మాటలు చెప్పి, ఓదార్చి 'మీకు నేనున్నాను. మీకే అవసరం వచ్చినా నాకు ఫోన్ చెయ్యండి. వస్తాను' అని వాళ్ళకి ధైర్యం చెప్పడం.. ఆ తర్వాత ఇంట్లో ఒకరోజు పులిహోర, ఒకరోజు పూరి-కూర, ఒకరోజు పొంగలి చేసి పాకెట్లు కట్టి.. ఒక్కొక్కసారి ఒక్కొక్క కోవెలకి వెళ్లి అక్కడున్న బిచ్చగాళ్లకి పంచడం, పాతబట్టలు, పాత దుప్పట్లు పంచడంలాంటి పన్లు చేస్తున్నాను. వీటన్నిటికితోడు ఇంట్లో పిల్లలిద్దరి ఆలనా-పాలనా

**ఫిబ్రవరి-2011**
**చతుర ప్రవేశిక విజేతలు వీరే!**

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **కె. అమృతవర్షిణి**
   - కాజీపేట, వరంగల్ జిల్లా
2. **బి. లిఖిత**
   - ఎన్.జి.ఒ.కాలనీ, కడప
3. **వాడపర్తి పాపమ్మ**
   - శివాజీ పాలెం, విశాఖపట్నం
4. **డా. పి. సత్యనారాయణ**
   - బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్
5. **అరుణ రేఖ**
   - జె.పి.నగర్, బెంగళూరు

**సరైన జవాబులు**

| | |
|---|---|
| 1. రాజలింగం | 6. బోస్టన్ |
| 2. రవి | 7. నట సమ్రాట్ |
| 3. మల్లేశం | 8. గులాబీలు |
| 4. బాలస్వామి | 9. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి |
| 5. నాగులు | 10. స్పీల్‌మేన్ |

చూసుకోవడం, వాళ్లచేత హోమ్‌వర్క్ చేయించడం, స్కూలుకి పంపడం, కేరేజీలు కట్టి ఇవ్వటం లాంటి బాధ్యతలు తల్లిగా నావేకదా! నేను చేస్తున్నది సమాజసేవ అని అనుకోను. నాకు తోచిన సహాయం నేను బీదా-బిక్కికి చేస్తున్నాను, అంతే! ఇలాంటి సహాయం చేయడంలో నాకెంతో సంతృప్తి, సంతోషం కలుగుతున్నాయి నాన్నా! అందుకే నాకు టైము ఉండడం లేదు. తెలిసిన వాళ్ళ ఇళ్లకి వెళ్ళి అవీ ఇవీ కబుర్లు చెప్తూ కూర్చునేంత తీరిక, సమయమూ నాకు ఉండవు. ఎప్పుడూ బీజీనే. ఒక్కొక్కసారి ఆయన కూడా నాతో వచ్చి నేను చేసేపనుల్లో నాకు సహాయం చేస్తారు. మేం హేపీగా ఉన్నాం. ఈ జీవితం మాకు నచ్చింది నాన్నా!

ప్రసాదు పోయినప్పుడు ఇలా వచ్చి అలా వెళ్ళిపోయేను. ఎక్కువసేపు మీతో గడపడం అవలేదు. అందుకే అక్కని, బావని, మిమ్మల్నిద్దర్నీ చూసి వెళదామని వచ్చేను" తన గురించి, తన కార్యక్రమాల గురించి అంతా వివరంగా చెప్పింది శైలజ.

"శైలూది అంతా వాళ్ళ నాన్న పోలికే భారతీ! ఆయన కూడా ఇలాగే సమాజసేవ అంటూ ఏవేవో చేస్తూవుంటారు" అంది వసుంధర శైలజవైపు మురిపెంగా చూసుకుంటూ.

భారతి కొడుకు బొద్దుగా ముద్దొస్తూ ఉన్నాడు.

"వీడు మన ప్రసాదేనే శైలూ!" అంది వసుంధర.

పదకొండోరోజు శుద్ధి పుణ్యావచనం అయిపోయేక అందరూ బయలుదేరి వచ్చేసేరు. వచ్చేటప్పుడు జానకిరామయ్యగారు అన్నారు, "భారతీ! ప్రసాదుని జాగ్రత్తగా చూసుకో తల్లీ! ఎప్పటికప్పుడు డాక్టరుకి చూపిస్తూవుండు. బోర్లాపడ్డం, పాకడం, కూర్చోవడం, నించోవడం, పళ్లు రావడం, మాటలు రావడం... అన్నీ టైము ప్రకారం జరుగుతున్నాయో లేదో తెలుసుకుంటూ ఉండు. అశ్రద్ధ చెయ్యకు" అని.

★ ★ ★

"జ్యోతీ! విజయనగరం వెళ్దాం వస్తావా? మా అన్నయ్య ఉన్నాడక్కడ. ఎన్నాళ్లయిందో వాడిని చూసి. రాంబాబు అని మా పిన్నికొడుకులే. రేపు ఆదివారం కదా.. రెడీగా ఉండు. వెళ్దాం" మాలతి ఫోన్ చేసి చెప్పింది.

వివేక్‌ని జానకిరామయ్యగారింట్లో ఉంచి జ్యోతి, మాలతితో బస్సులో విజయనగరం వెళ్లింది.

"ఎవరే అతను?" జ్యోతి అడిగింది బస్సులో కూర్చున్నాక.

"రాంబాబుది చాలా పెద్ద ఇల్లు. ఎన్నో పోర్షన్లు అద్దెకిచ్చేసి తను ఒక పెద్ద పోర్షన్‌లో ఉంటున్నాడు. పెళ్లి చేసుకోలేదు. అతనిది ఒకవింత గాథ. అతనికి పద్దెనిమిదేళ్ల వయసులో వాళ్ల ఇంట్లో అద్దెకున్న అమ్మాయిని ప్రేమించేడు. ఉషకి అప్పుడు పదిహేనేళ్ళు. ఆ అమ్మాయి తెల్లగా, బొద్దుగా ముద్దబంతిపువ్వులా ఉండేది. పిల్ల కళ్లు, ఎర్రటి పెదవులు, రెండు జడలు, తల్లో పువ్వులు, లంగా-జాకట్టు-వోణీతో అందంగా, గమ్మత్తుగా ఉండేది.

'ప్రేమ' అంటే తెలియని వయసులో వాళ్ళిద్దరూ ఒకర్నొకరు ఇష్టపడ్డారు. ఉష అన్నయ్య మోహన్‌కి తన చెల్లెల్ని రాంబాబుకిచ్చి చెయ్యడం అస్సలిష్టం లేదు.

'ఉషా! నువ్వు వాళ్లింటికి వెళ్లడానికి వీల్లేదు. ఆ రాంబాబుతో మాట్లాడ్డానికి వీల్లేదు. వాళ్ల నాన్నకి లెప్రసీ ఉంది. ఆ కుష్ఠు వ్యాధితో ఎవరికీ మొహం చూపించలేకపోతున్నాడు. మరోసారి వాడితో మాట్లాడేవంటే నీ కాళ్లు విరిచేస్తాను. నాలుక కోసేస్తాను. జాగ్రత్త' అని మోహన్ హూంకరించేడు. పాపం ఉష

చిన్నపిల్ల. అన్నయ్య అలా కోప్పడేసర్కి మౌనంగా ఉండిపోయింది. రెండురోజులు ఉష కనబడక పోయేసర్కి రాంబాబు కొట్టుకు పోయేడు. ఉష కూడా అన్నయ్యకి ఎదురు చెప్పలేక, రాంబాబుని చూడకుండా ఉండలేక సతమతమైపోయేది. ఆఖరికి ఒకరోజు పెరట్లో నూతి వెనకాల రహస్యంగా ఇద్దరూ కలుసుకున్నారు. దురదృష్ట వశాత్తు ఆ దృశ్యం మోహన్ కంటపడింది. చెల్లెల్ని బరబరా ఈడ్చుకెళ్లి ఇంట్లో స్తంభానికి తాడుతోకట్టి చితకబాదేడు. ఉషకి తండ్రి లేడు. మోహన్ వెళ్లిపోయేక కూతురిమీద ప్రేమతో ఆమె తల్లి కట్లు విప్పింది. వెంటనే ఎవరూ లేని సమయం చూసుకుని ఉష పెరట్లో ఉన్న నూతిలోకి గెంతేసింది! అది చాలా పెద్ద నుయ్యి. ఉష ఎక్కడికి వెళ్లిందో తెలియక రాంబాబు కంగారుపడ్డాడు. మోహన్, 'ఉషని ఎక్కడ దాచేవు?' అని అడిగి, తెలీదని చెప్పినా వినకుండా నానాతిట్లు తిట్టేడు రాంబాబుని. ఆఖరికి రెండురోజుల తర్వాత కుళ్లిపోయి, పాచిపోయి, కంపుగొడ్తున్న ఉష శవం ఆ నూతిలో దొరికింది! రెండు ఇళ్ళ వాళ్లు తిట్టుకున్నారు. కొట్టుకున్నారు. మోహన్ ఇల్లు ఖాళీచేసి వెళుతూ రాంబాబు వాళ్ళ వంశాన్ని తిడుతూ శాపనార్థాలు పెట్టేడు. అదంతా చూసి రాంబాబు దాదాపు పిచ్చివాడిలా అయిపోయేడు. ఆ సమయంలోనే రాంబాబు తండ్రి చనిపోవడం, పలకరించడానికి, కడుపునిండా భోజనం పెట్టడానికి ఎవరూ లేక అల్లాడిపోయేడు రాంబాబు.

వాళ్లు బాగా ఆస్తిపరులు. తాతలనాటి పెద్ద ఇల్లుంది. పెచ్చులూడిపోయిన గోడలు, పుచ్చిపోయిన తలుపులు, విరిగిపోయిన కుర్చీలు, టేబుళ్లు, ఉండలుగా చుట్టుకుపోయిన పరుపులు, దుప్పట్లు... మొత్తం ఇల్లంతా శిథిలావస్థలో ఉంటుంది. నిజం చెప్పాలంటే ఒక భూత్ బంగళాలా ఉంటుంది. ఆ ఇల్లు వీధికి ఎదురుగా ఉండడం నించీ ఆ ఇంట్లో ఉన్నవాళ్లకి ఎప్పుడూ కష్టాలేనట. అద్దెకి దిగినవాళ్లు కూడా బాగుపడ్డంలేదు. కొంతమంది ఆ ఇల్లు ఖాళీ చేసి వేరేచోటుకి వెళ్లిపోయి బాగుపడ్డారు. రాంబాబు స్టేటు బ్యాంకులో ఉద్యోగం చేస్తున్నాడు. అంత ఆస్తి ఉంది. ఇంటి కొస్తే వండి పెట్టే దిక్కులేదు. చంటి అని ఒక పనివాడిని పెట్టుకున్నాడు. వాడు ఒక ఏడాది పనిచేసి తర్వాత ఇంట్లో ఉన్న విలువైన వస్తువులన్నీ పట్టుకుని పారిపోయేడు. రాంబాబు పోలీసు రిపోర్టు యిచ్చినా ఫలితం లేకపోయింది. సూరి అని మరొకడ్ని పనిలో పెట్టుకున్నాడు. వాడు ఇప్పటిదాకా నమ్మకంగా పని చేస్తున్నాడు. వాడు రాంబాబుని కనిపెట్టుకుని ఉండిపోయేడు. ఈ మధ్యనే రాంబాబు రిటైరయిపోయేడు. పెళ్లిమాత్రం చేసుకోలేదు. నాటినుంచి నేటిదాకా ఉషని మర్చిపోలేక ఆమె జ్ఞాపకాలతో, ఆమె తన పక్కనే ఉందన్న భ్రాంతిలో ఒంటరిగా బతికేస్తున్నాడు.

సాయిబాబా భజనలు చెయ్యడం, వచ్చిన భక్తులందరికీ హోటల్ నుండి భోజనాలు తెప్పించి పెట్టడం చేస్తున్నాడు. ఇప్పుడెలా ఉన్నాడో... ఏమిటో?..." వివరంగా చెప్పింది మాలతి.

బస్సు విజయనగరం వచ్చింది.

మాలతి, జ్యోతి రాంబాబు వాళ్లింటి గుమ్మం ఎక్కేరు. ఇంటి చుట్టుపక్కల పరిసరాలు చూసి మాలతి బాధపడింది. అంత ఆస్తి, ఐశ్వర్యం ఉన్నా కూడా ఆ మనిషి సుఖ సంతోషాలకి నోచుకోలేదు! కొన్ని జీవితాలు అంతే! గడ్డిపూలు లాంటి జీవితాలు వాళ్లవి! పూస్తాయి! వాడిపోతాయి! రాలిపోతాయి! మట్టిలో కలిసిపోతాయి! నశించిపోతాయి! తప్ప మరెం

దుకూ పనికిరావు!

మాలతి తలుపు కొట్టింది. ఎవరూ తలుపు తియ్యలేదు. ఆమె కిటికీవైపు కదలగా జ్యోతి తలుపుమీద శబ్దం చేస్తూ కొట్టింది. లోపల్నుంచి తలుపు తీస్తున్న చప్పుడు, తలుపు తోస్తూ లోపలికి తొంగి చూసింది. ఆ దృశ్యం చూసి షాక్ తగిలినట్టుగా రెండు అడుగులు వెనక్కి వేసింది జ్యోతి.

తిరిగి తలుపు ధడాలున వేసిన చప్పుడు.

అదే సమయానికి వచ్చి "ఏమైందే?" అంటూ ఆత్రుతగా అడిగింది మాలతి.

జ్యోతి చెప్పింది విని ఫకాలున నవ్వింది ఆమె.

"ఊరుకోవే. నోరు జారి ఎక్కడా వాగకు" అంది.

తర్వాత పది నిమిషాల తర్వాత తలుపు తీసి ఎదురుగా నించున్నాడు రాంబాబు చిన్న తువ్వాలు కట్టుకుని! అతన్ని చూసి జ్యోతి నవ్వాపుకోలేకపోయింది. ఇద్దరూ లోపలికి వెళ్లేరు. అక్కడ పెద్ద హాలు ఉంది. ఆ హాల్లో వందకి పైగా ఫొటోలున్నాయి. కొన్ని దేవుడి పటాలతోపాటు ఏసుక్రీస్తు, గురునానక్, అల్లా, రామకృష్ణ పరమహంస, వివేకానంద, గాంధీ, నెహ్రూల ఫొటోలు కూడా ఉన్నాయి. అంతేకాక చనిపోయిన వాళ్ల ఫొటోలు కూడా ఉన్నాయి! ఆ గోడ, పక్క గోడ మొత్తం కిందనించి మీదదాకా ఫొటోలే. హాల్లో రెండు వైపులా పెద్ద స్టాండులు, వాటిమీద ఎలక్ట్రిక్ లైట్లు ఉన్నాయి. వాటి వైర్లన్నీ తోవకడ్డంగా పడివున్నాయి. పటాలన్నీ బూజు పట్టివున్నాయి. ప్రతీ పటం దగ్గర ఒక పువ్వు ఉంది. రోజుకి పది గంటలు పూజలు చేస్తాడట. ఆ పూజల వల్లనే ఆత్మలన్నీ వాడిని చంపకుండా వదిలిపెట్టేయట!

"ఏమిటన్నయ్యా ఇవన్నీ? ఈ పటాలేమిటి?" ఆశ్చర్యపోతూ అడిగింది మాలతి

## అర్థరూపాయికీ గతిలేదా?

అవి రెండో ప్రపంచ యుద్ధం జరుగుతున్న రోజులు. అందరి దగ్గర నుంచి చందాలు వసూలు చేస్తున్నారు. ఉన్నవాళ్ళు పెద్ద మొత్తాల్లో ఇస్తున్నారు. సామాన్యులు తమ శక్తి కొద్దీ ఇస్తున్నారు. మునిమాణిక్యం వారిని కూడా చందా అడిగారు. 'మేమేమి ఇవ్వగలం. బీదవాళ్లం' అన్నారాయన. 'మీకు తోచింది ఇవ్వండి' అన్నారు. అలాగేనని ఒక అర్థరూపాయి ఇచ్చారు. ఇదంతా తలుపు చాటు నుంచి గమనిస్తూనే ఉంది కాంతం. 'మన ప్రభుత్వంవారు జర్మనీతో గొప్ప యుద్ధం చేస్తున్నారు. దానికి ఎంతో డబ్బు కావాలి-తెలుసుగా! అందుకని



చందాలు వసూలు చేస్తున్నారు' అన్నారాయన వాళ్లు వెళ్లగానే. 'మీరు ఏమిచ్చారు?' అడిగింది కాంతం. 'అర్థరూపాయి' అన్నారాయన. 'అర్థరూపాయా! అర్థరూపాయికీ గతిలేని వాళ్లు యుద్ధమెందుకు ప్రారంభించారండీ? కాస్త చేతిలో డబ్బు చూచుకునే మొదలెట్టబోయినారు ఆ యుద్ధం!' అన్నది కాంతం ఈసడింపుగా.

అవన్నీ చూసి.

"ఏంలేదే. చనిపోయిన వాళ్ల ఫొటోలు కూడా దేవుడి ఫొటోలతో పాటు పెట్టి రోజూ దీపాలు వెలిగించి, అగరువత్తుల ధూపం వేసి పూజ చేస్తున్నాను. అలా చేస్తే ఆత్మలన్నీ సంతోషిస్తాయి"

"ఇంతకీ ఈ ఆత్మలన్నీ ఎవరివి?" మాలతి అడిగింది.

"మా అమ్మ, అమ్మమ్మ, నాన్నమ్మ, నాన్న, తాత, ముత్తాత, చిన్నాన్న, మా పనిమనిషి, వంటమనిషి, తోటమాలి, పాలవాడు, చాకలి, మా ఆఫీసు ప్యూన్ల ఫొటోలు అవన్నీ. వాటికి పూజలు చేస్తే

ఆత్మలన్నీ శాంతిస్తాయి!"

"అలాగనీ నీతో చెప్పేయా అవి?" వ్యంగ్యంగా అంది మాలతి.

"అవునే. నువ్వు నమ్మవుగాని అవన్నీ రోజూ నాతో మాట్లాడతాయి. ఇంట్లో తిరుగుతాయి" అన్నాడు రాంబాబు.

'వీడికి నిజంగా పిచ్చిపట్టింది. ఆ పిచ్చితో వాడేం చేస్తున్నాడో వాడికే తెలియడం లేదు. ఇవన్నీ పిచ్చి చేష్టలే. అందుకే వంటి మీద గుడ్డల్లేకుండా వచ్చి తలుపు తీసేడు' మాలతి అనుకుంది.

"ఈ ఆత్మలన్నీ ఇంట్లో తిరుగుతున్నా మనకేం హాని చెయ్యవులే. కాని ఇంకేదో దుష్టశక్తి... మా ఇంటిని పట్టుకుని పీడిస్తోంది! అమ్మని, అమ్మమ్మని, నాన్నని, నాన్నమ్మని, తాతని... అందర్నీ చంపేసింది. వీధికెదురుగా ఉందని, ఈ ఇల్లు ఎవరూ కొనకపోతే చవగ్గా వస్తుందని ముత్తాత కొన్నారు. అప్పట్నుంచి దరిద్రం పట్టుకుంది. దుష్టశక్తి ఈ ఇంట్లో ఉన్న వాళ్లని సర్వనాశనం చెయ్యాలని పట్టుబట్టింది. కొందరు చచ్చిపోయేరు! కొందరు పిచ్చెత్తిపోయేరు! కొందరు భయపడి ఇల్లు వదిలి వెళ్లిపోయేరు!" అన్నాడు రాంబాబు.

'అంటే నీక్కూడా పిచ్చిపట్టి ఉంటుంది. దానికి దుష్టశక్తి అని పేరు పెడ్తున్నావు!..' అనుకుంది మాలతి బాధగా.

"దుష్టశక్తి ఈ ఇంట్లో ఎవర్నీ బాగుపడనివ్వదు. అందరూ నాశనం అయిపోయారు. నేను ఎలా ఉన్నానో? ఆస్తిపరుడ్నీ, స్టేట్ బ్యాంకు ఆఫీసర్ని ఇంట్లో ఎప్పుడూ 70 వేల రూపాయిలదాకా వుంటుంది. ఏదన్నా అవసరానికి పనికి వస్తుందని వుంచేను. అంత డబ్బు వున్నా అనుభవించలేకపోతున్నాను. దుష్టశక్తి నాతో మాట్లాడుతుంది. ఈ ఇంట్లో తిరుగుతుంది. ఈ ఇల్లు వదిలి ఎక్కడికీ వెళ్లొద్దంటుంది. రాత్రి నేను పడుకుంటే ఆ దుష్టశక్తి నాపక్కనే వచ్చి పడుకుంటుంది" ఒక ట్రాన్స్‌లో వున్నట్టు మాట్లాడుతున్నాడు రాంబాబు.

'వీడికి పిచ్చి ముదిరిపోయింది. ఎవరైనా సైకియాట్రిస్ట్‌కి చూపించాలి. కాని ఏమని చెప్పి తీసుకువెళ్లాలి? తనంతతాను రాడు. దుష్టశక్తి పిచ్చి బాగా పట్టుకుంది' మాలతి మనసులోనే అనుకుంది. ఆమెకి చాలా భయం వేసింది.

"పోనీ ఈ ఇల్లు అమ్మకూడదూ... ఈ ఇల్లు అమ్మేసి ఆ డబ్బు బ్యాంకులో వేసుకో. విశాఖపట్నం వచ్చి మంచి ఫ్లాట్ కొనుక్కో. ఈ వయసులో కూడా పిల్లనిచ్చి పెళ్లి చేసేవాళ్లు చాలామందే వుంటారు. నీకు ఇంకా అరవైరెండేళ్లే కదా. నీకేం! నువ్వు అందగాడివి. మంచి అమ్మాయిని చూస్తాను. పెళ్లికి ఒప్పుకో. ఏముంది? జుట్టుకి నల్లరంగు వేసుకుని, పళ్లు కట్టించేసుకుంటే సరిపోతుంది. ముందు ఈ పాత డొక్కు ఇల్లు అమ్మేసి బయటకు రా. ఒంటరితనం చాలా భయంకరమైంది. అందుకే నీకిలాంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు వస్తున్నాయి. సూరిగాడు నీకు తోడు కాదు. జీవితంలో నిజమైన తోడు, నీ కష్టసుఖాలను పంచుకునే తోడు నీకవసరం. నా మాట కాదనకు" ఎంతోసేపు నచ్చజెప్పింది మాలతి.

"ఆ దుష్టశక్తి ఇల్లు అమ్మనివ్వదే. ఎంతో మంది కొనుక్కోవడానికి వచ్చేరు. కాని రిజిస్ట్రేషన్ అయ్యేలోగానే ఏదో ఒక కారణంతో వాళ్లు చనిపోయేరు. ఆ దుష్టశక్తి నన్ను అమ్మనివ్వదు, ఎవర్నీ కొననివ్వదు. నన్ను ఈ ఇంట్లోంచి వెళ్లనివ్వదు. నేనిలా ఇక్కడే చావల్సిందే" పాపం రాంబాబుకి కళ్లంట నీళ్లొచ్చేయి.

'ఊరు శని వుండనివ్వదు. నోటి శని తిననివ్వదు' అంటే ఇదేనేమో.

మాలతి రాంబాబు దగ్గరకెళ్లి ఓదార్చింది. "నువ్వు బాధపడకు అన్నయ్యా! ను

వ్వు నాతో రా. అన్నీ అవే సర్దుకుంటాయి. అసలు ఈ ఇంటికి వాస్తుదోషాలున్నాయేమో ఎవరినైనా కనుక్కో. ముందు వాస్తుపూజలు చేయించు. ఏ దుష్టశక్తీ నిన్ను అడ్డుకోదు. ఇవన్నీ నీ భ్రమలు. ఒంటరితనం భరించలేక నీకు నువ్వు ఏర్పరుచుకున్న భయాలు. ఇంత ఆస్తిపరుడివి. పిరికివాడిలా ప్రవర్తించడం ఏమీ బాగు లేదు. ఏదీ ఆ దుష్టశక్తిని పిలువు. నేను దానితో మాట్లాడతాను" అంది మాలతి లేచి నిలబడి.

జ్యోతి అటు ఇటు చూసింది భయంగా. కొంపతీసి ఏ దుష్టశక్తో వచ్చి తనని ఆవహిస్తుందేమోనని.

రాంబాబు మాలతి చెప్పింది వినిపించుకోకుండా తన ధోరణిలో తను ఇంకా ఏదో చెప్తూనే వున్నాడు. జ్యోతి 'వెళ్దాం' అన్నట్టు చూసింది మాలతి వైపు. ఇద్దరూ బయటకు నడిచారు.

"సమయానికి కాఫీ అయినా ఇవ్వలేకపోయాను. ఏమీ అనుకోకే!" అన్నాడు తనూ లేస్తూ. మళ్ళీ ఆ తువ్వాలు జారిపోతుందేమోనని భయంగా అతనివైపు చూసింది జ్యోతి. ఇద్దరూ బస్‌స్టాండుకి వచ్చారు.

"కాఫీ కూడా ఆ దుష్టశక్తి ఇవ్వనివ్వలేదేమోనే" అంది జ్యోతి నవ్వుతూ బస్సులో కూర్చున్నాక.

మాలతి నవ్వింది.

"మాలతీ! నేనొక ఐడియా చెప్పనా. ఒక మంచి సైకియాట్రిస్ట్‌ని మనవెంట తీసుకువెళ్ళి రాంబాబు బ్రైన్ వాష్ చేద్దాం. ఇక్కడ హాస్పిటల్లో జాయిన్‌చేసి ఆ దుష్టశక్తి పిచ్చిని తగ్గిద్దాం. మంచి ఫ్లాటుకొని వైజాగ్‌లోనే వుంచేద్దాం. ఆ ఇల్లు బేరం పెట్టి మంచి ధర వస్తే అమ్మేద్దాం. ఎలా వుంది ప్లాన్? " జ్యోతి అంది.

మాలతి సరేనంది.

జ్యోతి వివేక్‌ని చూడడానికి ఇంటికొచ్చిన

జానకిరామయ్యగారితో రాంబాబుకు సంబంధించి తను చూసింది, విన్నది అంతా చెప్పింది.

"మీరు పెద్దవారు. మీరు చెప్తే రాంబాబు వింటాడు. అతని జీవితాన్ని తీర్చిదిద్దండి పెదనాన్నా! మీరొక్కరే ఆ పని చెయ్యగలరు" అంది జ్యోతి.

"అలాగేనమ్మా! మీరు మళ్లా వెళ్లినప్పుడు చెప్పండి. నేనూ వస్తాను" అన్నారు.

అయితే కొన్ని జీవితాలు ఏ ముద్దుముచ్చట లేకుండానే అర్థాంతరంగా ముగిసిపోతాయి. పొద్దున్నే మాలతి ఫోన్ చేసింది.

"జ్యోతీ! రాత్రి సూరి ఫోన్ చేసేడు. సార్‌కి గుండెపోటు వచ్చింది. డాక్టరు వచ్చి చూసి చనిపోయాడని చెప్పేరు. రాంబాబు మరి మనకిక లేరమ్మా!" అని అంది బాధగా మాలతి.

వెంటనే జ్యోతి వాళ్ళ పెదనాన్నకు ఫోన్ చేసి విషయం చెప్పింది.

"కొన్ని జీవితాలు అంతేనమ్మా ఎవరూ బాగు చెయ్యలేరు. ఏ సుఖానికి, సంతోషానికి నోచుకోకుండా పుట్టడం, బతకడం, పోవడం! అంతే! గడ్డిపూలులాంటి జీవితాలు... అవి! మనమేం చెయ్యగలం? " అన్నారు జానకిరామయ్యగారు బాధపడుతూ.

★ ★ ★

### కొత్తగాలి...

**వాడు**
**నిన్నటిదాకా**
**బావిలో కప్ప**
**ఇప్పుడు**
**మందలో గొర్రె**

– మంత్రి లక్ష్మీనారాయణ, సిరిసిల్ల

వసుంధర, జానకిరామయ్యగార్లు ఊర్నించి వచ్చేసేరు. ఇంటికి వస్తూనే జానకిరామయ్యగారు పెరటివైపుకి వెళ్లి స్వాతిని పలకరించి వచ్చారు. అసలు స్వాతిని రాంబాబుకిచ్చి పెళ్లి చేస్తే ఎలా ఉంటుందన్న ఆలోచన కూడా వచ్చింది ఆయనకి. కాని అతను విధి వంచితుడు! అందరూ విధి వంచితులే. విధి ఆడిన వింత నాటకంలో పాత్రధారులే.

వసుంధర సంతోషానికి పట్టపగ్గాల్లేవు. భారతి కొడుకుని చూసి తన ప్రసాదే మళ్ళీ జన్మించేడన్న భ్రమలో ఉంది ఆవిడ.

మాటిమాటికి భారతికి ఫోన్‌చేసి "వాడెలా ఉన్నాడు? ఏం చేస్తున్నాడు? వాడిని చాలా జాగ్రత్తగా చూసుకో" అంటోంది.

ఆవిడకి ముందునించీ బ్లడ్‌షుగరు, బ్లడ్ ప్రెషరు అన్నీ ఉన్నాయి. కొడుకు పోయిన విచారంలో సరిగ్గా తిండి తినక ఆరోగ్యాన్ని బాగా అశ్రద్ధ చేసేసింది. ఎప్పుడూ పూజలు... దేవుడు... అంటూ ఆ ధ్యాసలో పడిపోయి ఒంటి గురించి పట్టించుకోలేదు. ఫలితంగా ఆవిడకి నీరసం ఎక్కువైపోయి నడవలేని స్థితిలో మంచం పట్టేసింది. డాక్టర్లు ఇంటికొచ్చి చూస్తున్నారు. ఇంజక్షన్లు ఇస్తున్నారు. అయిన ఏం ప్రయోజనం లేదు. బి.పి, షుగరు బాగా ఎక్కువగా ఉన్నాయి. జ్యోతి స్కూలుకి సెలవు పెట్టుకుని వచ్చి ఆవిడకి సేవలు చేస్తోంది. ఆవిడ బాత్‌రూంక్కూడా వెళ్లలేని పరిస్థితిలో ఉంది.

అనురాగాన్ని, ఆప్యాయతని అందించే భర్త, నీకు నేనున్నానని ధైర్యం చెప్పే భర్త, తన కష్టాన్ని అతని కష్టంగా భావించే భర్త, ప్రతిక్షణం తోడుగా నిలిచే భర్త... అలాంటి భర్తని పొందిన అదృష్టానికి మురిసిపోతున్నా, ఆ పక్కనే నీలినీడల్లా కొడుకు. కోడలు అర్థాంతరంగా పోవడం, పిచ్చి మనవరాలు పోవడం, చిన్న మనవడు తప్పిపోవడం... అన్నీ ఒకదాని

తర్వాత ఒకటి కష్టాలే ఎదురయ్యేయి ఆవిడకి!

కష్టాలు కలిసికట్టుగా వస్తాయి అంటారు అందుకే!

ఎప్పుడైనా అద్దంలో చూసుకుంటే తన రూపం తనకే భయంకరంగా కనబడేది. ముడతలు పడిన శరీరం, కళ్ల కింద నలుపు, నెరిసిన జుట్టు, జబ్బులతో బాగా శుష్కించిపోయి జీవకళలేని పీక్కుపోయిన ముఖం... ఇదంతా చూస్తూంటే ఏవో భయంకరమైన ఆలోచనలు ఆవిడ మనసులో మెదలసాగాయి.

'నువ్వు ఈ భూమ్మీదకు వచ్చిన పని అయిపోయింది. ఇహ నువ్వు చెయ్యవల్సిన రాచకార్యాలంటూ ఏమీ లేవు. నువ్వు జబ్బు దానివి. ముసలి దానివైపోయేవు! నీ వల్ల ఇంక ఎవ్వరికీ ఎటువంటి ఉపయోగం లేదు. నువ్వు ఏ పనీ చెయ్యలేవు. ఆ మాటకొస్తే నీ పనులే నువ్వు చేసుకోలేవు. ఇతరులమీద ఆధారపడి బతికే బతుకూ ఓ బతుకేనా? నువ్వు ఎవ్వరికీ పనికిరావు. నువ్వింక నా లోకానికి వచ్చెయి తొందరగా' అని ఆ దేవుడు చెవిలో చెప్తున్నట్టు ఆవిడకి అనిపించసాగింది.

ఇంతేనా? జీవితం అంటే ఇంతేనా?

నా ఇల్లు, నా భర్త, నా పిల్లలు, నా సంసారం, నా నగలు, నా చీరలు... నాది... నాది... అనుకున్నదేదీ నాది కాదు!

'తొలి శ్వాసకీ చివరి శ్వాసకీ మధ్య నున్నదే జీవితం' అన్నది ఎంత చేదు నిజం!

ఆవిడ రూపం చూసి ఆవిడకే భయం వేసి మరి అద్దం చూడ్డం మానేసింది. అద్దం పరిస్థితి వివరిస్తుంది. కాని పరిష్కారాన్ని చూపదు కదా. ఆ సంగతి తెలిసినా అదేదో అర్థం కాని కసి అద్దం చూస్తే చాలు ఆవిడలో బయలుదేరుతోంది.

జానకిరామయ్యగారు ఆవిడ దగ్గర కూర్చుని ధైర్యాన్ని నూరి పోసేవారు.

"మనం వర్తమానంలో బ్రతుకుదాం వసుంధరా. గతం మనకి వద్దు. భవిష్యత్తు మీద ఆశలు పెట్టుకోవద్దు. నీ పిచ్చి గాని మనకింక భవిష్యత్తు ఏముంది చెప్పు? !" అని ఓదార్చేవారు.

అయినా మరణాన్ని తల్చుకుంటే భయం తన్నుకొస్తోంది ఆవిడకి! లేవలేనంత నీరసం, దుఃఖం రెండూను.

'మనిషి ఎప్పుడూ సంతోషంగా బతకాలంటే మనిషికి కావల్సిన ముఖ్యమైన ఔషధం తృప్తి!' అని ఆయన ఎప్పుడూ అంటారు.

ఆరోజు వసుంధర పడుకుంది. లేవలేనంత నీరసం, మాట్లాడలేనంత నీరసంగా ఉంది ఆవిడకి. డాక్టరు వచ్చేడు. ఏవో పరీక్షలు చేసేడు. అతను జానకిరామయ్యతో ఏదో మాట్లాడేడు. ఇద్దరి ముఖాల్లోనూ ఏదో ఆందోళన కనిపిస్తున్నది. ఎందుకో తెలీదు ఆవిడకి సరిగ్గా వినిపించడం లేదు. ఏదో మగతగా ఉంది. మత్తుగా ఉంది. కళ్లు మూసుకుపోతున్నాయి. శరీరం తేలిగ్గా అయి పోతోంది. ఆలోచనలు కూడా రావడం లేదు. ఆలోచనలతో మనసు పాడవడం అన్న సమస్యే లేదు. అదేమిటో విచిత్రంగా తెరుచుకున్న పంజరంలోంచి ఎగిరిపోతున్న పక్షుల్లా దూరంగా పారిపోతున్నట్లుంది.

ఆవిడ కళ్లు పూర్తిగా మూసుకుపోయేయి... ఎవరో వస్తున్నారు? ఏడుస్తున్నారు! శైలజ ఎందుకొచ్చినట్టు? ఆయన్ని పట్టుకుని ఎందుకు ఏడుస్తోంది అది!', 'తులసి తీర్థం పొయ్యండి' అంటున్నారు ఎవరో. 'అంతా అయిపోయింది. కిందకి దింపడం మంచిది!' అంటున్నారు కొందరు. గొంతుని ఎవరో పిసుకుతున్నట్లు, శరీరంలోని ప్రతీ అణువూ స్వాధీనం తప్పుతున్నట్లు.. మృత్యు ముఖంలోకి అడుగు పెడుతుంటే.. అదేదో చెప్ప

లేని హాయి! జబ్బులు, సమస్యలు అన్నీ దూది పింజెల్లాగ ఎగిరిపోతున్నాయి!

ఎవరో చాలా సున్నితంగా, మృదు మధురంగా 'రా...రా...' అని చాలా నెమ్మ దిగా పిలుస్తున్న అనుభూతి! మంత్ర ముగ్ధురాలిలా ఆవిడ అటే వెళుతున్నది. ఆ పిలుపు మంత్రం వేసినట్టుగా ఉంది.

వసుంధర నెమ్మదిగా లేచింది. ఆ పిలుపు వినబడుతున్న వైపు కదిలింది. చిత్రంగా ఆమె శరీరం హాయిగా, గాల్లో తేలిపోతున్నట్టుగా ఉంది. ప్రసాదు పోయిన తర్వాత తనకెప్పుడూ ఇంత హాయిగా అనిపించలేదు. తానెక్కడకి వెళ్లి పోతోంది? తనని ఎవరు పిలుస్తున్నారు? తను శూన్యంలోకి వెళ్ళిపోతున్నది. ఆయన ఏడుస్తున్నారు. అందరూ వచ్చి ఆయన్ని ఓదారుస్తున్నారు. జ్యోతి, వివేక్ కూడా ఏడుపు మొహాలతో అక్కడే నించున్నారు!

వసుంధరకి భర్తతో ఒక్కసారి మాట్లాడా లనిపించింది. భర్త దగ్గరకొచ్చి నించుంది.

'ఏవండీ! ఏమిటీ అన్యాయం? మీరు నాతో మాట్లాడ్డం లేదేమిటి? నేను మీ పక్కనే నించున్నా. మీరు నన్ను చూడ్డం లేదేమిటి? పట్టించుకోవడం లేదేంటి?' అంటున్నది ఆవిడ. ఆయన ఆవిడవైపు చూడనేలేదు. జీవితంలో ఏదో పోగొట్టుకున్నవారిలా దిగులుగా శూన్యం లోకి చూస్తున్నారు. ఆవిడ శరీరం తేలిపో తున్నట్టుగా వుంది.

'రా...రా... టైము అయిపోతున్నది! నువ్వు తొందరంగా రావాలి. ఇప్పుడు నువ్వు మనిషివి కావు. నువ్వు చనిపో యేవు. ఆత్మవి! నాతోరా. నీకు హాయిగా ఉంటుంది. భయపడకు!' ఎవరో మంద్ర స్వరంతో అంటున్నారు.

వసుంధరకి జ్ఞానోదయం అయింది.

ఈ భూమ్మీద తను వచ్చిన పని అయి పోయింది అన్న వాస్తవం తెల్సుకుంది.

'అమ్మ అదృష్టవంతురాలు. సుమంగళిగా పోయింది. అమ్మలేని లోటు తీర్చలేనిదే. మీరు గుండె రాయి చేసుకొని వుండాలి' అంటోంది రెండో కూతురు శైలజ.

భారతి చంటిపిల్లాడ్ని తీసుకొని వస్తు న్నట్టు ఫోన్ వచ్చింది. అందరూ ఆమె కోసం ఎదురు చూస్తున్నారు!

ఆవిడ ఆత్మ అనురాగబంధాలను తెంచు కుని పైలోకానికి వెళ్లిపోయింది!

జానకిరామయ్యగారు భార్య పార్థివ శరీ రానికి దహనక్రియ జరిపి ఇంటికి వచ్చే సేరు. ఎలాంటి భావావేశాలు లేకుండా నిర్లిప్తంగా ఉండిపోయేరు ఆయన! మేరు పర్వతంలా గంభీరంగా ఉన్న ఆయన్ని చూసి అందరికీ భయం వేసింది.

★ ★ ★

"పెదనాన్నా! మీ బాధ నేను అర్థం చేసుకోగలను. మీరు మా ఇంటికి వచ్చే యండి పెదనాన్నా! నేను, వివేక్ మీకు తోడుగా ఉంటాం. మిమ్మల్ని కంటికి రెప్పలా చూసుకుంటాం" అంది జ్యోతి, వచ్చిన వాళ్లందరూ వెళ్లిపోయేక ఒక రోజు.

"లేదమ్మా! అమ్మాయిలిద్దరూ కూడా వాళ్లింటికి వచ్చి ఉండి పొమ్మన్నారు. కాని నేనే రానని చెప్పేను. పైలోకానికి వెళ్లిపో యిన నా వాళ్లని చేరుకోవడానికి నాకు మరికొద్ది సమయమే వుంది. ఇది నా ఇల్లు. నా ఇంట్లో నేను పోవడం అన్నది నా చిరకాల వాంఛ.

నేనెప్పుడూ ఎవర్నీ ఏ కోరికా కోరలేదు. నన్ను నా ఇంట్లోనే ఉండనీయమ్మా! నువ్వే మీ ఇల్లు అద్దెకిచ్చేసి వివేక్‌ని తీసు కుని ఇక్కడకు వచ్చేయ్ తల్లీ! ఈ ముస లాడి కోరిక కాదనకు! వసుంధర ఆత్మకు శాంతి కలగాలంటే నేను ఈ ఇంట్లో ఉండ డమే న్యాయం" అన్నారు జానకిరామయ్య గారు చెమర్చిన కళ్లతో! ©



# తెలుగు కవితా కీర్తిశిఖరం

బహుముఖీన ప్రతిభావ్యుత్పత్తులతో అనవరతం ఉత్తమ కృతులు వెలయిస్తూ, తెలుగుభారతిని అమూల్య కావ్య మణిహారాలతో అలంకరిస్తున్న డా. సి.నారాయణ రెడ్డి నిరంతర సాహితీతపస్వి. ఎన్నెన్నో ఉన్నత పదవులు సమర్థంగా నిర్వహిస్తూనే సమాంతరంగా రచనా వ్యాసంగం కొనసాగిస్తూ ప్రతీ సంవత్సరం తన జన్మదినాన్ని తన నూతన గ్రంథావిష్కరణోత్సవంగా పరిగణిస్తున్న సినారె నిత్యసాహితీ శీలి. 2010లో 80వ వసంతంలో పదం మోపిన సందర్భంగా 80వ కృతి 'విశ్వం నాలో ఉన్నప్పుడు' కవితా సంపుటిని పాఠకలోకానికి అందించిన సాహితీవిరాణ్మూర్తి. ఆయన 'విశ్వంభర' కావ్యానికి 1988లో జ్ఞానపీఠం లభించింది.

డా. సింగిరెడ్డి నారాయణరెడ్డి జులై 29, 1931, ప్రజోత్పత్తి నిజాషాఢ గురుపూర్ణిమనాడు కరీంనగర్ జిల్లా, వేములవాడ మండలం, హనుమాజీపేటలో జన్మించారు. తండ్రి మల్లారెడ్డి రైతు. తల్లి బుచ్చమ్మ ఆదర్శ గృహిణి. నారాయణరెడ్డి ప్రాథమిక విద్య గ్రామంలోని వీధిబడిలో సాగింది. సహజ సృజన కవితాభినివేశం ఉన్న ఆయనను బాల్యంలో హరికథలు, జంగం కథలు, జానపదగీతాలు ఆకర్షించాయి. ఉర్దూ మాధ్యమంలో సిరిసిల్లలో మాధ్యమిక విద్య, కరీంనగర్‌లో ఉన్నత పాఠశాల విద్య చేశారు. తెలుగు ఒక ఐచ్ఛికాంశంగానే ఉండేది. హైదరాబాద్‌లోని ఛాదర్‌ఘాట్ కళాశాలలో ఇంటర్మీడియెట్, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బి.ఎ. కూడా ఉర్దూ మాధ్యమంలోనే చదివారు. ఆ విశ్వవిద్యాలయంలో ఎం.ఎ.(తెలుగు), పిహెచ్.డి. పట్టాలు






పొందారు. విద్యార్థిగా శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయం గ్రంథాలయంలో శ్రద్ధగా అనేక గ్రంథాలు చదివారు. ఆరంభంలో సికింద్రాబాదులోని ఆర్ట్స్-సైన్స్ కళాశాలలో, అటు తర్వాత నిజాం కళాశాలలో అధ్యాపకుడిగా పనిచేశారు.

పిమ్మట ఉస్మానియా విశ్వవిద్యాలయంలో రీడరుగా, ప్రొఫెసరుగా బోధన వృత్తిలో ఉన్నారు. అప్పుడు వరుసగా ఉన్నత పదవులు ఆయనను వరించాయి. ఆయనది బాల్య వివాహం. భార్య పేరు సుశీల. నలుగురు కుమార్తెలు- గంగ, యమున, సరస్వతి, కృష్ణవేణి. డా.నారాయణరెడ్డి విద్యాత్మకంగా, పాలనాపరంగా ఎన్నో పదవులు నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం అధ్యక్షులుగా (1981), అంబేద్కర్ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా (1985), పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా (1989), ఆంధ్రప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల సలహాదారుగా (1992), రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులుగా ఏడేళ్లపాటు ఆయన అందించిన సేవలు చిరస్మరణీయాలు. భారత రాష్ట్రపతి ఆయనను 1997లో రాజ్యసభ సభ్యునిగా నామినేట్ చేశారు. ఆరేళ్లపాటు రాజ్యసభలో ఆయన ప్రశ్నలు, ప్రసంగాలు, చర్చలు, ప్రత్యేక ప్రస్తావనలు అందరి మన్ననలందుకున్నాయి. 1993 నుంచి ఆయన ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్యక్షులుగా విలక్షణ కార్యక్రమాలు రూపొందించి తెలుగు భాషా సాహిత్య, సంస్కృతుల వికాసాభ్యుదయాలకు దోహదం చేస్తున్నారు. జంటనగరాలలోను, ఇతరచోట్లా సాహిత్య, సాంస్కృతిక సంస్థల కార్యకలాపాలకు ప్రోత్సాహమందిస్తున్నారు.

డా. సి. నారాయణరెడ్డి (సి.నా.రె.) మౌలికంగా కవి అయినప్పటికీ ఆయన లేఖినినుంచి పద్యకావ్యాలు, గేయకావ్యాలు, వచన కవితలు, గద్యకృతులు, చలనచిత్ర గీతాలు, యాత్రాకథనాలు, సంగీత నృత్యరూపకాలు, ముక్తకకావ్యాలు, బుర్రకథలు, గజళ్ళు, వ్యాసాలు, విమర్శన గ్రంథాలు, అనువాదాలు మొదలైన ప్రక్రియల్లో రచనలు జాలువారాయి. కవిత్వం ఆయనకు సహజాతం. సృజనాత్మకత, లయాత్మకత, ఆశుగుణం, గానశీలం ఆయన సొత్తు. ఛందస్సు తెలియని బాల్యదశలో సినారె ఏడవ తరగతిలో 'ఒకనాడు ఒక నక్క ఒక అడవి లోపల/పొట్టకోసరమెటో పోవుచుండె' అనే పంక్తిలో సీసపద్యం రాసినట్టు తెలుసుకున్న గురువు దూపాటి వేంకటరమణాచార్యులు ఛందస్సులో మెలకువలు చెప్పారు. అది సినారె తొలిపద్యం. తొమ్మిదో తరగతిలో రాసిన తొలిగేయం- 'మారుటెన్నడో/విషపుగుండెలీ జగాన/మారుపెన్నడో'. పదో తరగతిలో రాసిన మొదటి పాట 'వెన్నవంటి మనసున్న వానికి/అన్నమేమొ కరవాయె/ఉన్నవానికింతన్నమిడుదా/ మన్నగుండె లేదాయె'. కళాశాల విద్యార్థిగా 'శోభ' పత్రికకు సంపాదకత్వం వహించారు. రోచిస్, సింహేంద్ర అనే మారుపేర్లతో కవితలు రచించారు. సినారె కవిత తొలిసారి 'జనశక్తి' పత్రికలో ప్రచురితమయింది. విద్యార్థి దశలోనే ప్రహ్లాద చరిత్ర, సీతాపహరణం వంటి పద్యనాటికలు, భలేశిష్యులు తదితర సాంఘిక నాటికలు రచించారు. 1953లో 'నవ్వని పువ్వు' సంగీత నృత్య నాటిక ప్రచురితమయింది. అది సి.నా.రె తొలి ప్రచురణ. వెనువెంటనే జలపాతం, విశ్వగీతి, అజంతా సుందరి వెలువడ్డాయి. 'సాహితీరంగంలో నాదైన స్థానం సమకూర్చుకోవాలంటే పద్యంకంటే గేయమే బలీయ సాధనంగా తోచింది' అన్నారాయన. పర్యవసా





**తె**లుగులో కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి తర్వాత మళ్లీ ప్రతిష్ఠాత్మకమైన జ్ఞానపీఠ పురస్కారం నా 'విశ్వంభర' కావ్యానికి లభించింది. నాకు ఈ పురస్కారం లభించి ఇరవై రెండేళ్లు గడిచాయి. మరొక అగ్రశ్రేణి తెలుగు రచయితకు త్వరలో ఈ పురస్కారం లభించాలని నా ఆకాంక్ష

(డా.సి.నారాయణ రెడ్డి)

నంగా నాగార్జున సాగరం కథాత్మక గేయకావ్యం ఉద్భవించింది. 'ఇక్ష్వాకు వంశక్షితీంద్ర చంద్రుల కీర్తి/కౌముదులు నల్గడల/కలయ విరిసిన నాడు/ కృష్ణవేణీ తరం/గిణీ పయఃకింకిణులు...' ఇలా ప్రబంధశైలిలో ప్రౌఢ సమాసబంధురంగా నడిచింది. ఈ క్రమంలో వెలువడినవే కర్పూర వసంతరాయలు, విశ్వనాథనాయుడు మొదలైన అద్భుత కథాత్మక దీర్ఘ గేయకావ్యాలు. రామప్ప సంగీత నృత్యరూపకం అన్ని భారతీయ భాషల్లోకి అనువాదమయింది. అక్షరగవాక్షాలు, మధ్యతరగతి మందహాసం, ఉదయం నా హృదయం, ఇంటిపేరు చైతన్యం, భూమిక, మట్టీ-మనిషీ-ఆకాశం, మధనం, విశ్వంభర, రెక్కలు, కాలం అంచుమీద, ప్రపంచపదులు, తెలుగు గజళ్ళు, కవిత నా చిరునామా, మనిషిగా ప్రవహించాలని ఇత్యాది సినారె కృతులు మనకు పెన్నిధులు. వైవిధ్య శోభితాలు. ఆయన పరిశోధన గ్రంథం 'ఆధునికాంధ్ర కవిత్వము- సంప్రదాయములు, ప్రయోగములు' అత్యంత ప్రామాణిక గ్రంథంగా మన్ననలు పొందింది. 1962లో 'గులేబకావళి కథ' చిత్రంలో 'నన్ను దోచుకొందువటె వన్నెల దొరసానీ' గీతంతో ఆరంభించి నేటివరకు 3,500 పైగా సినీగీతాలు రచించారు. అవి కవితాసౌందర్య నిర్భరాలు. గాంధేయం, మీరాబాయి, శిఖరాలు-లోయలు, ముత్యాల కోకిల ఆయన అనువాద కృతులు. 'కమల లోచనుని/నా కనులందు దాచితిని/అందుకే కనురెప్ప/లార్పగా వెరచితిని' మరో గీతానికి పల్లవి అనువాదమిది. తెలుగు మధురిమలు నింపుకున్న అనుకృతి.

సినారె 'సమత నా భాష/కవిత నా శ్వాస' అంటారు. సామాజిక చైతన్య ప్రబోధం సినారె కవిత్వ ప్రధాన లక్ష్యం. 'నీలోని స్వచ్ఛమైన మనిషి తనాన్ని/ నిశ్చలంగా నిలుపుకో' అని ఉద్బోధిస్తారు. ఆయన కవితలో ప్రగతిశీల మానవతావాదం అంతర్నిహితంగా ప్రవహిస్తుంది. జ్ఞానపీఠ పురస్కారం పొందిన 'విశ్వంభర' దీర్ఘ కావ్యం విశ్వమానవేతిహాసం. 1980లో వెలువడింది. కథారహితంగా, ఏ పాత్రలు వాచ్యంగా కనుపించకుండా విలక్షణ శిల్ప సంవిధానంతో వచన కవితలో 'సినారె' దీన్ని రచించారు. వస్తూన్మీలనంలో, వాక్యనిర్వహణలో కావ్య వైశిష్ట్యం వ్యక్తమవుతుంది. ఈ కావ్యానికి నాయకుడు మానవుడే. మనిషి ధరించే వివిధ భూమికలకు మూలధాతువులు మనశ్శక్తులు. సోక్రటీసు, అలెగ్జాండర్, అశోకుడు, క్రీస్తు, లింకన్, మార్క్స్, లెనిన్, గాంధీ- ఇలా ఎన్నెన్నో రూపాలలో మనిషి వ్యక్తమవుతాడు. మనిషి సాధన త్రిముఖంగా- వైజ్ఞానికంగా, కళాత్మకంగా, ఆధ్యాత్మికంగా సాగుతుంది. క్షతుడైనా మనిషి తిరోగముడు కాడు. ఇదే ఈ సమగ్రకావ్య రేఖాకృతి. 'నేను పుట్టకముందే/ నెత్తిమీద నీలితెర/ కాళ్ళ కింద ధూళిపొర' పంక్తులతో ప్రారంభమైన ఈ కృతిని 'మనసుకు తొడుగు మనిషి/ మనిషికి ఉడుపు జగతి/ఇదే విశ్వంభరాతత్త్వం/ఇదే అనంత జీవిత సత్యం' పంక్తులతో ముగుస్తుంది.

అప్పటి జ్ఞానపీఠం సంస్థవారి నియమావళి ప్రకారం గత పదేళ్లలో భారతీయ భాషల్లో ఓ రచయిత వెలువరించిన అధిక సంఖ్యాక గ్రంథాల్లో కనీసం ఒకటి అగ్రేసర స్థానంలో ఉంటేనే అవార్డు ప్రదానం చేసేవారు. ఆ దృష్ట్యా ఆ పదేళ్లలో సినారె పది కవితా సంపుటులు వెలువరించారు. వాటిలో తలమానికమైన 'విశ్వంభర' జ్ఞానపీఠ పురస్కారానికి ఎంపికైంది.

సినారె గ్రంథాలు ఇంగ్లిషు, ఫ్రెంచి, సంస్కృతం, హిందీ, ఉర్దూ, కన్నడం, తమిళం, మళయాళం మొదలైన భాషల్లోకి అనువాదమయ్యాయి. ఆయన స్వయంగా హిందీ, ఉర్దూ భాషల్లో కూడా కవితలల్లారు. ఆయన అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు, రష్యా, జపాను, కెనడా, ఇటలీ, డెన్మార్కు, థాయిలాండ్, యుగోస్లేవియా, ఆస్ట్రేలియా, సింగపూర్, మలేసియా, మారిషస్, గల్ఫ్ దేశాలను సందర్శించారు. 1990లో యుగోస్లేవియాలోని స్రూగాలో జరిగిన అంతర్జాతీయ కవి సమ్మేళనంలో భారతీయ భాషల ప్రతినిధిగా పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కేంద్ర సాహిత్య అకాడమీ, భారతీయ భాషా పరిషత్ పురస్కారాలు, రాజా-లక్ష్మి అవార్డు, సోవియట్ నెహ్రూ అవార్డు, అసాన్ అవార్డు మొదలైనవి ఆయనను వరించాయి. భారత ప్రభుత్వం పద్మశ్రీ, పద్మభూషణ్ గౌరవాలతో సత్కరించింది. ఆంధ్ర, కాకతీయ, డా. బి.ఆర్. అంబేద్కర్, మీరట్, నాగార్జున విశ్వవిద్యాలయాలు ఆయనకు గౌరవ డాక్టరేట్లు ప్రదానం చేశాయి.

'రాస్తూనే వుంటాను మిత్రమా!/ నా నిండు గుండె చివరి గంట మోగేదాకా' అని అభిమాన ప్రపంచానికి హామీయిస్తూ 'రచన, శ్వాస/ నాలో సమాంతరంగా సాగే క్రియలు' అని ప్రకటించిన డా. సి. నారాయణరెడ్డి సాహితీలోకానికి మహద్వరం, తెలుగుజాతికి గర్వహేతువు.

**– గోవిందరాజు రామకృష్ణారావు**

కాలాతీతం





జాక్ లండన్

# మార్టిన్ ఈడెన్

ప్రతి రచయితా, 'లక్షలు సంపాదించటం ఎలా?' అనేది అలా వుంచి, 'కీర్తి ప్రతిష్ఠలు ఎప్పుడొస్తాయి? పాఠకులు ఎప్పుడు బ్రహ్మరథం పడతారు?' అని కలలు కంటాడు. ఆ కలల్లో అసహజత్వమేమీ లేదు. అత్యాశ కూడా లేదు. రాసేది అభిప్రాయ వ్యక్తీకరణ కోసమే అయినప్పటికీ, అది నలుగురూ చదవాలనే కోరిక అందరికీ ఉంటుంది. ఆ నలుగురూ నాలుగు లక్షలమందో, నలభై లక్షలమందో అయితే అతడికి కలిగే సంతృప్తి కూడా అదే మోతాదులో ఉంటుంది.




రెక్కాడితేకాని డొక్కాడని, కాయకష్టం చేసుకుని బతుకీడ్చేవాళ్ల కుటుంబంలో పుట్టాడు మార్టిన్ ఈడెన్. పసిప్రాయంలోనే వీధిలోని అలగాజనం, రౌడీమూకల సాహచర్యంలో గడిపి హోరాహోరీ యుద్ధాలు చేసాడు. ఫలితంగా బలవంతులు మాత్రమే ఈ జనారణ్యంలో బతకగలరని అవగాహన చేసుకున్నాడు. ఒకటి రెండు సంవత్సరాలు స్కూలుకెళ్లాడేమో గాని, అది తప్ప వేరే చదువు లేదు. సంస్కారవంతమైన జీవన పద్ధతులకు ఆమడ దూరం. పదకొండో ఏట కళాసీగా, అంతకన్న తక్కువ పనుల్ని చేస్తూ, నౌక లెక్కి సముద్రయానాలు చేశాడు. అక్కడి అనుభవాలూ చిన్ననాడు నేర్చుకున్న జీవితపాఠాల్నే దృఢపర్చాయి. నౌకలు అతణ్ణి ప్రపంచం నలుమూలలకూ తీసికెళ్లాయి. ఎన్నో రేవులు, ఎన్నో దేశాలు, ఎన్నో రకాల మనుషుల్ని చూశాడు. కాని

అంతటా ఒకటే పాఠం.. బలహీనులకీ ఈ లోకంలో స్థానం లేదు. బతకదల్చుకుంటే పోరాడు. నీతి-అవినీతి, ధర్మం-అధర్మం వగైరాలను శాసించేది బలవంతులే. బల హీనులు వారి ఆజ్ఞలను శిరసావహించా లంతే. బలవంతులే పరిపాలకులు. బల హీనులు వారి బానిసలు మాత్రమే.

అనుభవైకవేద్యమైన ఈ తాత్విక విష యాలను అర్థంచేసుకున్న మార్టిన్‌కు తన ఇరవయ్యో ఏట సంస్కారవంతులైన, ఒక కులీనుల కుటుంబంతో పరిచయమేర్పడు తుంది. ఆ ఇంటిలోని రూత్‌కు ఇతడో అడవి మనిషిలాగ కనిపిస్తాడు. సంస్కార హీనుడు, స్వచ్ఛంగా మాట్లా డనైనా లేడు. మర్యాద లేదు. మేనర్స్ తెలియవు. ఆమె మార్టిన్ గురించి ఎంత హీనంగా ఆలోచి స్తుందో, మార్టిన్‌కు ఆమె అంత ఉన్నతంగా కనిపి స్తుంది. జంతు సమానంగా గడిపిన తన జీవితమే గాదు- జీవితమనేది ఇంత అద్భుతంగా ఉన్నతంగా కూడా ఉండగలదనుకుం టాడు. కాని ఇదివరలో ఇవన్నీ తెలుసుకో వటానికి తనకు అవకాశమేదీ? అర్థాకలి జీవితంలో ఒక్కపూట తిండి సంపాదించ టానికే పదిహేను, పదహారు గంటల శారీ రక శ్రమ సరిపోని తనకు సంస్కృతి అంటే ఏమిటో ఎలా తెలుస్తుంది? మురి కివాడల్లో, చిరుగుపాతల్లో, గుడిసెల్లో, పశు వుల మందల్లా బతికిన తన తల్లిదండ్రులు తనకు సంస్కారమంటే ఏమిటో ఎలా చెప్పగలరు? కాని తాను నిరర్థకమైన జీవితం గడపలేదని తనకు తెలుసు. ఒళ్లు వంచి కష్టపడి పనిచేశాడు. కాకపోతే అనంతమైన తన శ్రమశక్తి అంతా ఒక్క పూట తిండి సంపాదనకే సరిపోయింది. అంత శ్రమను, కష్టాన్ని విద్యావ్యాసంగాలు నేర్చుకోవటానికి వెచ్చిస్తే తనకు మాత్రం ఇవి అలవడవా?




సముద్ర జీవితం మీద సంపాదించిన కాసిని డబ్బులూ తన పోషణకు వాడు కుంటూ విద్యాభ్యాసం ప్రారంభిస్తాడు మార్టిన్. స్కూలుకెళ్లి చదువుకోవటం మంచి పద్ధతి అంటుంది రూత్. 'ఆర్థి కంగా అది నాకు వీలుపడదు. అంతేకాదు. స్కూలుకెళ్లి మీరు సంవత్సరంలో నేర్చుకో గలిగింది నేనొక్క నెలలోనే నేర్చుకోగలను' అంటాడు మార్టిన్. అవును కదా! రోజుకు నాలుగైదు గంటలు మాత్రం తప్పనిసరి పరిస్థితుల్లో నిద్రపోయినా, మిగతా కాల మంతా లక్ష్యసాధనలో గడిపితే అసాధ్యమే ముంది!

ఆమెకు మార్టిన్‌లో ఒక వింత ఆకర్షణ కనిపిస్తుంది. కష్టభూయిష్టమైన సముద్ర జీవితంతో వచ్చిన శరీర దారుఢ్యం, మానవాతీత మైనదనిపించే అతని పట్టు దల, కార్యదీక్ష చూసి ఆమె ముగ్ధురాలవుతుంది. రూత్ సుకుమార సౌందర్యం, సంస్కారం మార్టి న్‌కు గాలం వేస్తాయి. వాదోపవాదాలు, ఘర్షణలు ఎన్ని జరిగినా ఇద్దరూ తమకు తెలియకుండానే దగ్గిరవుతారు.

అద్భుతమైన ఈ ప్రపంచం, అరుదైన తన అనుభవాలు, తన దృష్టి- ఇదంతా రచనల్లో పెట్టాలనే తపన అతణ్ణి వివశుణ్ణి చేస్తుంది. ముఖ్యంగా తను రాసింది రూత్ చదివితే ఎంత బాగుంటుంది! తన సము ద్రానుభవాల్ని గురించి ఒక రచన చేసి పత్రికకు పంపిస్తాడు. ఆ రోజు శుక్ర వారం. వెంటనే ఆదివారం సాహిత్యాను బంధంలో అది వచ్చేస్తుందని అతడి నమ్మకం. కాని అలా కాకపోవటంతో ఆశా భంగమవుతుంది. అయినా పట్టువదలని విక్రమార్కుడు మార్టిన్.

# జాక్ లండన్ ( 1876 - 1916)

తల్లి ఫ్లోరా వెల్‌మన్‌ను, తండ్రి విలియం చానీ విడిచిపెట్టడంతో ఆమె జాన్ లండన్‌ను పెళ్లిచేసుకుంది. ఆ పెంపుడు తండ్రి ఇంటి పేరే వచ్చింది జాక్ లండన్‌కు.

బాల్యమంతా పేదరికంలో గడిచింది. పదేళ్ల పుడు, "ఆరింటికి లేచి ఫ్యాక్టరీలో పనికెళ్లేవాణ్ణి. రాత్రి పది, పదకొండు, పన్నెండింటి దాకా పని చేసేవాణ్ణి. ఇంటికి డబ్బులు కావాలి. సంపాదిం చిన ప్రతి సెంటూ తెచ్చి అమ్మకిచ్చేవాణ్ణి. ఒక సారి ముప్పై ఆరు గంటలు నిరంతరాయంగా మెషీన్ దగ్గర పనిచేశాను" ఇవీ ఓక్లాండ్ (కాలి ఫోర్నియా) గురించిన జాక్‌లండన్ జ్ఞాపకాలు.

జీవితాన్ని చెరసాలగానే కాదు. కసాయిశా లగా కూడా చూశాడు జాక్. పడవల్లో కళాసీగా పనిచేసినప్పుడు జీవిత క్రౌర్యపు ఎర్రటి కోరల్ని, రక్తసిక్తమైన పంజాల్ని కూడా చూశాడు. క్రూర జంతువులకన్నా ఘోరమైన మనుషుల మధ్య బతికాడు. ఆ లోకం సమాజ సూత్రాలకు, చట్టా లకు దూరం. గెలిచినవాడికే బతికే హక్కునిచ్చే యుద్ధరంగమది. ఆ జీవితాన్ని దర్శింపచేస్తుంది ఓ నవల 'సీ వూల్ఫ్'

జాక్ లండన్ ఒకసారి జనపనార మిల్లులో నెలకు ముప్పై డాలర్లకు పనికి కుదిరాడు. ఆ తర్వాత తెలిసింది అదే పనిని నెలకు నలభై డాలర్లు తీసుకుని ఇద్దరు చేసేవారని.

అప్పటిదాకా ఊపిరాడని జీవితపు అట్టడుగు పొరల్లో గడిపాడు. 'ఎలాగైనా స్వేచ్ఛా వాయువు పీల్చుకోగలిగితే చాలు' అనుకు న్నాడు. అప్పుడే జ్ఞానార్జనకు అంకురార్పణ జరి గింది. పనిచేస్తూనే పందొమ్మిదో ఏట హైస్కూ ల్‌లో జాయినయ్యాడు. అప్పుడే రాయాలనే తపన కూడా మొదలైంది. రుడ్యార్డ్ కిప్లింగ్, రాబర్ట్ లూయిస్ స్టీవెన్‌సన్, మార్క్‌ట్వేన్‌లను అధ్యయనం చేశాడు.

పేదవాళ్లకు సోషలిజంలో ఆశాకిరణం కనిపి స్తుంది. 1896లో ఓక్లాండ్‌లోని సోషలిస్టు లేబర్ పార్టీలో సభ్యత్వం తీసుకున్నాడు. మొద టిసారిగా, 'వర్గ సంఘర్షణ', 'విప్లవం' అనే మాటలు విన్నాడు. పార్టీ తరఫున విస్తృతంగా పర్యటించాడు. ఉపన్యాసాలిచ్చాడు. అతడు అద్భుతమైన వక్త. ఆ ఉపన్యాసాలు విని శ్రోతలు ఉద్రేకంతో ఊగిపోయేవాళ్లు.

మిత్రులూ, బంధువులూ, చివరికి రూత్ సైతం అతణ్ణి ఎంతో నిరుత్సా హపరుస్తారు. 'ఈ రచనాజీవితం నీ ఒంటికి సరిపడదు. ఏదైనా ఉద్యోగం చూసుకో. అందరిలా బతుకు' అని వారెంత చెప్పినా మార్టిన్ పట్టుదల సడల దు. పుంఖానుపుంఖంగా రాస్తూనే ఉంటాడు. ఉన్న చివరి పావలా, అర్ధా కూడా తపాలా బిళ్లలు కొనటానికి వెచ్చి స్తాడు. నెలలు గడుస్తాయి. ఏరోజూ కడుపు నిండా తిండిలేదు. కంటినిండా కునుకులేదు. చేతిలో కలం పట్టుకోగలిగిన శక్తి ఉన్నంతవరకూ మార్టిన్ రచనా తపస్సు ఆగదు.

పంపిన రచనలన్నీ తిరుగుటపాలో వచ్చే స్తూనే వుంటాయి. వాటిని తిరిగి ఇతర పత్రికలకు పంపుతూనే వుంటాడు. ఈలోగా అనేక తాత్విక గ్రంథాలు, శాస్త్ర విషయాలు, సాహిత్యం అధ్యయనం చేస్తాడు. చూసిన ఏ పుస్తకాన్నీ చదవ కుండా వదలడు. రోజుకు ఇరవై నాలుగ్గం టలే వున్నాయే! ఈ కాలాన్ని యింకెంత పొదుపుగా వాడాలి? నాలుగైదు గంటల నిద్ర కూడా వృథా అనుకుంటూ కనురెప్పలు తెరచివుంచగలిగినంతవరకూ చదువుతూనే వుంటాడు. వేళ్లు నొప్పి పుట్టి, కలం దానం తటదే కిందపడేదాకా రాస్తూనే వుంటాడు.

కానీ-పత్రికలకు అతని మీద సానుభూతి లేదు. ప్రతి పత్రిక నుండి 'ఇవి ప్రచుర ణకు అంగీకరించబడలేదు. అన్యథా భావిం చవద్దు' అంటూ చీటీలు వస్తూనే

ఆ దశలోనే వర్గవైషమ్యాలనూ, రాబోయే విప్లవాల భయానక పరిణామాల్నీ దర్శింప చేస్తూ 'ఐరన్‌హీల్' అనే నవల రాశాడు. తెలుగులో 'ఉక్కుపాదం' పేరుతో వచ్చింది.

ఆ తర్వాతి నవలే జాక్ లండన్ రచనల్లోకెల్లా ఉత్తమమైనదిగా పరిగణించబడే 'మార్టిన్ ఈడెన్'. ఇది అతని ఆత్మకథాత్మక రచన. రష్యన్ విప్లవకవి వ్లాదిమిర్ మయకోవ్‌స్కీ ఈ నవలను 'నాట్ బార్న్ ఫర్ మనీ' పేరుతో సినిమా తీశాడు. అందులో తాను స్వయంగా మార్టిన్ పాత్ర ధరించాడు.

ఒకదాని తర్వాత ఒకటి విజయాలెన్ని వచ్చినా, ఎంత కీర్తినార్జించినా, జాక్ లండన్ జీవితంలో మొదటినించీ విషాదమే నిండింది.

ఉన్న కష్టాలు సరిపోవన్నట్టు తన జన్మ'రహస్యం' అతణ్ణి జీవితమంతా వేధించింది. తల్లినీ, అక్కల్నీ పోషించే భారం తనదే. ఇద్దరు పిల్లలు పుట్టాక మొదటి భార్యకు విడాకులిచ్చి తను ఎంతో ప్రేమించిన ఛార్మియన్ కిట్రెడ్జ్‌ను చేసుకున్నాడు. మొదటి భార్యతో మనోవర్తికి సంబంధించిన సమస్యలు, ఛార్మియన్ గర్భస్రావాలు, దుబారా ఖర్చులతో పెరిగిన అప్పులు కొత్త సమస్యల్ని సృష్టించాయి.

జాక్ లండన్ ఆరోగ్యం క్షీణించింది. 1911లో ఇన్సూరెన్స్ కంపెనీ అతడి జీవితాన్ని బీమా చెయ్యటానికి నిరాకరించింది. అసహజమైన ఆహారపుటలవాట్ల వల్ల అనారోగ్య సమస్యలు తలెత్తాయి. మూత్రపిండాలు దెబ్బతిన్నాయి. జీర్ణాశయం పాడైంది. చేతులు వాచిపోయాయి. చర్మం రాలిపోయింది. మొదటి నుంచీ తాగుడు అలవాటు. బాధ ఉపశమనానికి మద్యంతోపాటు ఆర్సెనిక్, మార్ఫైన్ కలిపిన మందులు, ఇంజెక్షన్లు తీసుకోవటం ప్రారంభించాడు. అయినా రచనలు మాత్రం ఆగలేదు.

నలభైఏళ్ల జీవితంలో యాభైకి పైగా పుస్తకాలు ప్రచురించాడు. తొలిదశలో రాసిన 'కాల్ ఆఫ్ ది వైల్డ్' అతణ్ణి మిలియనీర్ని చేసింది.

చివరి దశలో విరేచనాలు పట్టుకున్నాయి. శరీరం వశం తప్పింది. భరించలేని బాధ. 1916 నవంబరు 21న సాయంత్రం 6.30 గంటలకు భోజనం ముగించి, రాత్రి తను చదవాల్సిన పుస్తకాలు తీసుకుని మంచంమీదికి చేరాడు. తర్వాత కాసేపటికే స్పృహ తప్పింది.

మరుసటిరోజు నవంబర్ 22న సాయంత్రం కోమాలోనే తుదిశ్వాస విడిచాడు.

జాక్ లండన్‌ది సహజ మరణమా, ఆత్మహత్యా అన్నది ఇప్పటికీ తేలని రహస్యమే!

వుంటాయి. ఒకే పద్ధతిలో ముద్రితమై వచ్చే ఈ చీటీలు చూసి, 'అసలు పత్రికల్లో మనుషులు పనిచేస్తారా లేక మెషీన్లే రచనల్ని తిప్పి పంపిస్తూ ఇలా ఒకేలా చీటీలు పంపిస్తాయా? నిజంగా మనుషులే అక్కడుంటే ఒక్క సంపాదకుడో, అతడి అసిస్టెంటో అదేమాట స్వదస్తూరితో ఎందుకు రాయరు? ' అనుకొంటాడు మార్టిన్.

ఆకలిబాధ పెరుగుతుంది. దుస్తులు చిరిగిపోతాయి. ఎక్కడా అప్పు పుట్టదు. అయినా మార్టిన్ యుద్ధాన్ని విరమించడు. బలవంతులే ఈ లోకాన్ని శాసిస్తారని ఏనాడో తెలుసుకున్నాడు. పాతజ్ఞాపకాలు అతని పట్టుదలను ద్విగుణీకృతం చేశాయి.. చిన్నప్పుడు ఏడేళ్ల మార్టిన్‌ను, తొమ్మిదేళ్ల కుర్రాడొకడు ఓ తగాదాలో చావ చితగ్గొడతాడు. ఒళ్లు హూనమైనా మార్టిన్ మాత్రం పారిపోడు. 'పో, బే. దమ్ములుంటే రేపురా మళ్లీ' అంటాడా పెద్ద కుర్రాడు. దమ్మున్న మార్టిన్ తెల్లారి, సమయానికి ముందే యుద్ధరంగానికి చేరుకుంటాడు. మళ్లీ ఒళ్లు హూనమవుతుంది. చూసేవాళ్లకు జాలేస్తుంది. 'వెళ్లరా, వాడితో నువ్వు పోట్లాడలేవు. వెళ్లు' అంటారు. నెత్తురు కారినా, ఎముకలు విరిగినా, ఒళ్లంతా పచ్చి పుండయినా పోరాటం ఆపడు. అనేక సంవత్సరాల తర్వాత మార్టిన్‌కు ఆ కుర్రాడు మళ్లీ తారసపడతాడు. ఈసారి మార్టిన్ వాణ్ణి చితగ్గొడతాడు.

'ఆనాడు వాణ్ణి సాధించటానికి పదకొండేళ్లు పట్టింది. ఈ పత్రికాభూతంతోను

యుద్ధం పదకొండుసార్లు, పదకొండేళ్లు చేయాల్సి వచ్చినా సరే.. వెనుకాడను' అనుకొంటాడు మార్టిన్.

కాని తన ప్రేయసి, తన ఆరాధ్యదేవత కూడా వెనక్కి లాగుతుంది.

'నువ్వంటే నాకిష్టం. నిన్నెంతగానో ప్రేమిస్తున్నాను. నీతోనే నా జీవితమని ఏనాడో నిశ్చయించుకున్నాను. కాని నీలాంటి నిలకడ లేని మనిషిని, స్థిరమైన ఆదాయం లేనివాణ్ణి చేసుకోవటానికి అమ్మానాన్నా ససేమిరా అంగీకరించరు.



పోనీ వాళ్ల సంగతి వదిలేసినా పెళ్లి చేసుకుంటే నువ్వు నన్నెలా పోషిస్తావో చెప్పు' అంటుందామె.

'రెండు సంవత్సరాల వ్యవధి ఇవ్వు' అంటాడు మార్టిన్. ఆమె లేకపోతే జీవితమే అంధకార బంధురం.

మరో సంవత్సరం గడుస్తుంది. కృషిలో లోపం లేదు. జాప్యం లేదు. కథలు, నవలలు, వ్యాసాలు, విమర్శలు, గేయాలు- ఒకటేమిటి, రోజుకు ఇరవై నాలుగ్గంటలూ సరిపోని పద్ధతిలో రాస్తూ, ఎన్ని వందల పేజీల రచనలు చేశాడో లెక్కలేదు. కాని అన్నీ తిరిగివస్తాయి. చివరికి ఇక తపాలా బిళ్లలు కొనలేని స్థితిలో పత్రికలకు పంపటం మానేస్తాడు. తిండిలేక, నిద్రలేక, పోషణలేక, అంతటి దృఢకాయుడు కూడా చిక్కి శల్యమైపోతాడు. ఎటుచూసినా అప్పులే! తను వుంటున్న ఇంటి పేదరాలు దయతో తెచ్చి ఇచ్చే గంజినీళ్లే అతడి ప్రాణాన్ని కాపాడతాయి.

ఆ దశలో రూత్ ఒకనాడు అతణ్ణి తమ ఇంటికి భోజనానికి పిలుస్తుంది. ఆమె తండ్రి సంపన్నుడు. డిన్నర్ టేబుల్ వద్ద అక్కడికి వచ్చిన ఘరానా అతిథి అయిన ఒక జడ్జీతో హెర్బర్ట్ స్పెన్సర్ తత్వశాస్త్రాన్ని గురించి చర్చిస్తాడు.

న్యాయశాస్త్రంలో ఎంత దిట్టయినా తాత్విక విషయాలను గురించిన జడ్జిగారి అభిప్రాయాలు మూర్ఖమైనవని మార్టిన్‌కు తెలుసు. చివరికి విసుగెత్తి, 'స్పెన్సర్ గురించిన మీ అజ్ఞానం అపారం' అంటాడు. మర్యాద తెలియని ఇతని ప్రవర్తనకు ఆ సజ్జనులు తీవ్రంగా షాక్‌కు గురవుతారు. కాని సంజాయిషీ చెప్పుకోవటమనేది మార్టిన్ స్వభావంలో లేదు.

'నీలాంటి వాడితో నాకు సరిపడదు. మనమిక కలుసుకోకపోవటం ఇద్దరికీ మంచిది' అంటుంది రూత్. మార్టిన్ హతాశుడవుతాడు. ఇక ఎందుకూ రావటం? ఎవరికోసం? డబ్బులా? డబ్బు అవసరమే. కాని రూత్‌తో కలిసి సుఖంగా జీవించటానికేగా డబ్బులు. కీర్తిప్రతిష్టలా? అవును తన కీర్తిని చూసి రూత్ గర్వపడాలనుకున్నాడు. కాని ఇప్పుడు ఆ రెండింటి

# 'సీమ'లో తొలి రాజకీయ ఖైదీ

నిన్నటి నిజం

అది ఆగస్టు నెల, 1921వ సంవత్సరం. అనంతపురం జిల్లా, పెనుకొండ పట్టణంలోని మేజిస్ట్రేటు కోర్టులో ఒక రాజకీయ ఖైదీ విచారణ జరగాల్సింది ఆవేళ. కోర్టు ఇంకా ప్రారంభం కావలిసి వుంది. పోలీసులు ఖైదీని పిలుచుకుని వచ్చే సమయం దగ్గరపడుతోంది. రాయలసీమలో తొలి రాజకీయ ఖైదీ అతను. అందుకే ఇసుక చల్లినా నేలమీదికి రాలనంతగా ప్రజలు గుమిగూడారు. ఆ కోర్టు ప్రాంగణమంతా ఆ ఖైదీ పేరుతో జయజయ ధ్వానాలతో హోరెత్తింది.

మేజిస్ట్రేటు తన ఆఫీసు గదిలో కూర్చుని పరిస్థితిని అంచనా వేశాడు. తను ఈ ఖైదీకి శిక్ష విధించగలడా? ఇతను సామాన్యుడు కాదనిపిస్తుంది. ఈ ప్రజానీకం ఇలాగే ఉంటుందా? తను శిక్ష విధిస్తే వీరంతా ఊరకనే వుంటారా? ఎదురు తిరిగితే ఈ కోర్టు భవనం నిలుస్తుందా? తన పరిస్థితి ఏమిటి? ఇదంతా ఆలోచిస్తుంటే గుండె గుభేలుమంది. ధైర్యం కూడగట్టుకునే ప్రయత్నం చేయబోతే గుండె మరింత నీరుగారిపోతోంది. మార్గాంతరం లేదు. ఈ కేసును తను విచారించలేననుకుంటూ కోర్టులో అడుగుపెట్టాడు.



ప్రజలంతా మిన్ను విరిగి పడేంత శబ్దంతో జయ జయ ధ్వానాలు చేసారు. కేసును విచారణకు పిలవకనే, "కేసును వాయిదా వేస్తున్నాను" అని మూడు ముక్కల్లో ఆ మేజిస్ట్రేటు కేసుకు ముక్తాయింపు పలికి కుర్చీ నుంచి లేచి లోపలికి వెళ్ళిపోయాడు. శాంతి భద్రతల సమస్యగా కేసును చిత్రించి హిందుపురం కోర్టుకు మార్చాడు. అక్కడ ఆ ఖైదీకి నెలరోజుల సాధారణ జైలు శిక్ష విధించబడింది. బళ్ళారి జైలుకు మార్చాలని తీర్మానించారు. హిందుపురం నుంచి బళ్ళారికి ఖైదీని రైలులో పంపేందుకు సాధారణ పోలీసు రక్షణ చాలదని సైనికులను రప్పించారు.

హిందుపురంలో జైలు నుంచి రైలు స్టేషన్‌కు ఖైదీని సైనికులు తీసుకెళ్తూవుంటే జనసమూహం ఖైదీ పేరున జేజేలు పలుకుతూ వెంట నడిచారు. బెంగళూరు-గుంతకల్లు రైలు రాగానే, సైనికులు ఖైదీని ఆ రైల్లో హుబ్లీ పెట్టెలో ఎక్కించుకొని తామూ ఎక్కి కూర్చున్నారు. ఎంత సేపయినా రైలు కదల లేదు. కారణం ఖైదీ వెంట వచ్చిన జనసందోహమే! రైలు కదలడానికి వీలులేని రీతిగా రైలింజను ముందర పట్టాలపైన బైఠాయించారు. అధికారులు వచ్చి నచ్చజెప్ప చూశారు. ఖైదీ తల్లిగారు కుమారుడిని చూడడానికి వస్తున్నారని, వారు వచ్చి కుమారుడిని దీవించి వీడ్కోలు చెప్పేవరకు రైలు కదలడానికి వదలబోమని వారంతా ఒకే మాటగా చెప్పారు. ఆమె పల్లెనుండి రావడానికి ఆలస్యమైంది. ఆమె వచ్చి కుమారుడిని దీవించి, వీడ్కోలు పలికింది. జనాలు రైలు పట్టాల పైనుంచి లేచి పక్కకొచ్చారు. అప్పుడు కదిలింది రైలు.

ప్రజల మనసును అంతగా చూరగొన్న ఈ రాజకీయ ఖైదీ మరెవరో కాదు, రాయలసీమ రాజకీయ రంగంలో భీష్మపితామహుడిగా ప్రసిద్ధి గాంచిన కల్లూరు సుబ్బారావుగారు.



# రచయితలకు సూచనలు



**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టి పెట్టాలి. హాస్య, వ్యంగ్య తదితర ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. ఏ మాండలికమైనా రాయొచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర' నవల అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీన్ని దృష్టిలో పెట్టుకుని రచయితలు తమ నవలల్ని అచ్చులో 85 పేజీలు మించకుండా రాసి పంపాలి.

★ ఒక పాత 'చతుర' సంచిక తీసుకుని అందులో ఉన్న నవలలో ఒకటి లేదా రెండు పూర్తి పేజీలను తమ దస్తూరితో రాసి చూసుకుని ఆ మేరకు తమ నవల రాతప్రతి ఎన్ని పేజీలలో రాయవచ్చో అంచనాకు రావడం సులభం. ఏదేమైనా అచ్చులో 80-85 పేజీలకు మించకుండా లేదా తక్కువ కాకుండా ప్లాన్ చేసుకుని పంపడం మంచి పద్ధతి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు/రచనలు తిప్పిపంపేందుకు వీలుగా స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరు జతపరచడం మరువకండి. రాతప్రతులు పోస్ట్‌లో పోతే 'చతుర' బాధ్యత వహించబోదు.

★ స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవర్లు జతపరచని వారి రచనలు తిరస్కారానికి గురైతే ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. వాటి గురించి ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు.

★ సాధారణంగా నవలలు కార్యాలయానికి అందిన 4 - 8 వారాలలోగా పరిశీలించి ప్రచురణార్హమైతే ఆ విషయం తెలియపరుస్తాం. కాకుంటే తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రచురితమైన ప్రతి నవలకు రూ. 6000/- పారితోషికం ఉంటుంది. నవల ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటి వారంలోనే పై మొత్తానికి రచయితకు చెక్కు అందుతుంది.

★ 'కొత్తగాలి' శీర్షికకు చిరుకవితలు పంపేవారు నాలుగు/ఐదు పంక్తులు మించకుండా పంపాలి. స్పార్క్‌కే మార్కు అన్న విషయం గుర్తించాలి.

**చతుర**

**చిరునామా : ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082**
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

అవసరమూ తనకు లేదనుకుంటాడు.

ఆ దశలో మార్టిన్ రాసిన ఒక విమ ర్శన గ్రంథాన్ని ఓ ప్రచురణకర్త అంగీక రించి పదిహేనువందల కాపీలు అచ్చు వేస్తాడు.

మార్టిన్ అడ్వాన్సు అడుగుతాడు.

'ఎన్ని కాపీలు అమ్ముడవుతాయో! అసలు ప్రచురణ ఖర్చులైనా వస్తాయో లేవో!' అంటాడు ప్రచురణకర్త.

అయితే మార్టిన్‌కు దశ తిరిగింది. వేసిన కాపీలు త్వరగా అమ్ముడుపోతాయి. మరో ముద్రణ. ఈసారి రెట్టింపు సంఖ్య లో పుస్తకాలు వేస్తాడు. అవీ అమ్ముడుపో తాయి. ఆ పుస్తకం సాహిత్య ప్రపంచంలో సంచలనం సృష్టిస్తుంది. అప్పటిదాకా అతడి రచనల్ని అల్మారాలో పడేసి వుంచిన పత్రికా సంపాదకులు వాటిని బైటికి తీసి ప్రముఖంగా ప్రచురిస్తారు. ఇంతకాలం అతని అముద్రిత రచనల్లో లోపాలు చూసినవాళ్లకు ఇప్పుడు వాటిలో ఎనలేని ప్రతిభ కన్పిస్తుంది.

మార్టిన్ ఈడెన్ కొత్త యుగాన్ని ప్రారం భించాడంటారు. 'ఎంత పారితోషికమైనా యిస్తాం. మీ రచనల్ని అచ్చువేసే భాగ్యం ప్రసాదించండి' అంటూ వేడుకుంటారు, సంపాదకులు, ప్రచురణకర్తలు. డబ్బు, కీర్తి అతడి పాదాక్రాంతమవుతాయి. కాని ఇప్పుడు వాటి అవసరం అతడికి లేదు.

రోజూ డిన్నర్లకు ఆహ్వానాలు, సభలకు ముఖ్య అతిథిగా వచ్చేయమని అభ్యర్థనలు వస్తుంటాయి. మార్టిన్‌కు ఈ లోకరీతి అర్థంకాదు. ఈ తేనె పూసిన కత్తులు, ఈ కులీనులు, ఈ సంస్కారవంతులు- వీళ్లకేం కావాలసలు? ఈ రచనలన్నీ తనెప్పుడో చేశాడు. ఆకలి మంటల్లో, అవమానాలు కుంగదియ్యగా, 'పనికిమాలిన చవట' అని అందరూ తృణీకరించిన దశలో చేసినవి. అప్పుడు వాటినెందుకు కీర్తించలేదు? రచ నల్లో మార్పేమీ లేదే? ఎందుకీ సంప న్నులు, కులీనులు ఇంత నీచంగా ఆత్మ ద్రోహం చేసుకుంటూ బతుకుతారు? ఇంత కన్నా అలగాజనం, శ్రామికులు చాలా మెరుగు. వాళ్లకీ దొంగ విలువలు లేవు. తాను ఈ దొంగల వర్గంలోకి ఎదగాలను కున్నాడా? వీళ్ల విలువల్ని, నీతి సూత్రాల్ని నియంత్రించేది డబ్బు.

ఒకనాడు మార్టిన్ ఒక ఖరీదైన హోటల్లో వుండగా రూత్ వచ్చి క్షమించ మంటుంది. 'నేను పొరపాటు చేశాను. నిన్ను పెళ్లి చేసుకుంటాను. నీ షరతుల్తో, నీ దగ్గిర ఏ హోదాలోనైనా సరే వుంటాను' అని కన్నీళ్లు పెట్టుకుంటుంది.

ఆమెకెలా సమాధానం చెప్పాలో మార్టి న్‌కు అంతుపట్టదు. 'రూత్! నేను మార లేదు. నేను అప్పటి నేనే. నా అభిప్రా యాలు మారలేదు. నా స్వభావం మార లేదు. నా వ్యక్తిత్వం మారలేదు. ఇప్పుడు కూడా నేను మీ జడ్జీగారిని హెర్బర్ట్ స్పెన్సర్ గురించిన కనీస జ్ఞానంలేని గాడిద అనే అంటాను. అన్నట్టు, అతడు మొన్న కనిపించి, నన్ను వాళ్లింటికి డిన్న ర్‌కు పిలిచాడు. మార్పు వచ్చింది నాలో కాదు మీలో. డబ్బు, కీర్తి, సక్సెస్ చూసి మీరెందుకిలా మారిపోతారు రూత్? ఇది మీ వర్గనైజం. మనుషులమీద కాక డబ్బు, కీర్తి, సక్సెస్‌ల మీదే మోజు మీకు. నాకు మాత్రం అవి పట్టవు' అంటాడు.

రచనలు అచ్చయిన తర్వాత మళ్లీ కలం పట్టుకోడు మార్టిన్. ఈ కృత్రిమ విలువల లోకంనుండి దూరంగా వెళ్లిపోవాలనుకుం టాడు. దక్షిణ సముద్ర ద్వీపాలకు ప్రయాణం చేస్తున్న నావ ఎక్కుతాడు. కాని లక్ష్యహీనమైన జీవితం అతడిలో అన్ని కోరికలనూ నిర్మూలిస్తుంది. చివరికి జీవితేచ్ఛ కూడా వుండదు. దీవులకు చేర కముందే దారిలోనే అనంతసాగరంలో మునిగి ఆత్మహత్య చేసుకుంటాడు.

-ఎం. వసంత

# ఆకలి

అందరూ చల్లగాలికోసం ఆ సాయంత్రం ట్యాంక్‌బండ్‌కు వస్తే జాన్ మాత్రం ప్రత్యేకంగా 'పిల్లగాలి'కోసం వచ్చాడు. లారీ డ్రైవర్‌గా పనిచేస్తున్న జాన్‌కు గతంలో కొన్ని 'బేరాలు' ట్యాంక్ బండ్ వద్దే కనబడ్డంతో ఈసారీ వాటిని వెదుక్కుంటూ అతను అక్కడికే వచ్చాడు.

దాదాపు గంటన్నర నుంచీ గాలిస్తున్నా అతనికి ఎవరూ దొరకలేదు. ఒళ్లంతా తిమ్మిరి తిమ్మిరిగా ఉంది. మనసంతా ఏదోలా ఉంది.. వారాల తరబడి లారీల మీదే గడిపే అతనికి ఎప్పుడోగానీ ఓ రెండురోజులు సెలవు దొరుకుతుంది. దాన్నిలా 'పిల్లగాలి'తో సద్వినియోగం చేసుకుంటాడా బ్రహ్మచారి.

పెళ్లిచేసుకోవాలనీ, ఓ కుటుంబాన్ని ఏర్పాటు చేసుకోవాలనీ అతనికీ ఉంది. కానీ పిల్లనెవరిస్తారు? అమ్మెవరో అబ్బెవరో తెలీదు. ఊహ తెలిసినప్పటి నుంచీ అవ్వే అతన్ని పెంచి పెద్ద చేసింది. ఆమె కూడా నాలుగేళ్ల క్రితం కాలం చేయడంతో పూర్తిగా అనాథై పోయాడు. ఇక మంచీ చెడ్డా చూసేదెవరు? పిల్లను వెతికి తెచ్చి పెళ్లి చేసేదెవరు? చిన్నప్పటినుంచీ తెలిసిన లారీఓనర్ ఉన్నా, కిరాయిలో రూపాయి తగ్గితే, తిట్టిపోసి జీతంలో కోత పెట్టేవాడేతప్ప అతని ఆలనాపాలనా చూసేవాడు కాడు.




అందుకే; సెలవుదొరికినప్పుడల్లా ఈ తిరుగుళ్లు!

తనపక్కగా నలుగురమ్మాయిలు గుంపుగా పోతుంటే గుచ్చిగుచ్చి చూసేడు జాన్. వాళ్లు తనను దాటి నాలుగడుగులు వేయగానే మెల్లగా విజిల్ వేశాడు.

అంతే! నలుగురూ గిరుక్కున వెనక్కుతిరిగి చెప్పు చూపించారు.

వెంటనే ఏదో పనున్నట్టుగా అక్కడి నుంచి వడివడిగా దూరంగా వెళ్లిపోయాడు లేకపోతే దేహశుద్ధి తప్పదని!

ట్యాంక్‌బండ్‌కు వచ్చి అప్పుడే రెండుగంటలైంది.. ఇప్పటివరకూ చేసిన నాలుగైదు ప్రయత్నాలూ ఇలాగే బెడిసికొట్టాయి. పొద్దున్నే లేచి ఎవడి ముఖం చూశానో అనుకున్నాడు జాన్. ఇంకెవరు ఓనర్‌గాడే! వాడి ముఖం చూశాను కాబట్టే ఇవ్వాళ తనకు అంతా ఎదురొస్తోందని తిట్టుకున్నాడతను.

అంతలో దూరంగా చెట్టు దగ్గర నిలబడి, ఎవరో అమ్మాయి తనను దగ్గరకు రమ్మని సైగ చేస్తూ కన్పించింది.

ప్రాణం లేచివచ్చినట్టయింది. తర్వాత ఇదేమీ మోసం కాదు గదా? అని మనసులో సందేహం! ఏదైతే అదైందని మెల్లగా అటువైపు నడిచాడు.

ఆమె ముందుకు నడుస్తోంది.. ఆమె వెంటే అతను! ఇద్దరూ పావుగంటపైగా నడిచారు.. మెల్లగా ఓ బస్తీలోకి వచ్చారు. ఓ గది ముందాగి ఆమె తాళం తీసింది. చూడడానికి అమ్మాయి బాగానే ఉంది అనుకున్నాడు జాన్ మనసులో.

లోపల ఓ సింగిల్‌కాట్.. దానిపై అడ్డదిడ్డంగా రెండు దుప్పట్లు పడున్నాయి.




'ఇక్కడే కూర్చో ఇప్పుడే వస్త..' అంటూ ఆమె అతన్ని గదిలో వదిలి బయటకు వెళ్లింది.

ఇదేంటీ పిల్ల తీరు వింతగా ఉందే.. రేటూ గీటూ మాట్లాడకుండానే గదిలోకి పిల్చి కూర్చోబెట్టి మాయమైంది.. అనుకున్నాడు జాన్.

పదినిముషాలు గడిచాయి. నాలుగు సారాప్యాకెట్లు, మిర్చి బజ్జీలతో హడావిడిగా వచ్చిందామె.

'అబ్బాయా ఇయిగో ఈలోగా ఇవి తింటుండు.. ఇంతలో ఉడుకుడుగ్గా అన్నం, కూరా వండేస్తా! మొఖం చూస్తే తిండీతిప్పలు ఉన్నట్టులేదు' అంటూ అతని జవాబుకోసం చూడకుండా వంటపనిలోకి దిగిపోయింది.

జాన్‌కు ఆమె తీరు విచిత్రంగా తోచింది. మెల్లగా సారాని కడుపులోకి పంపుతూ ఆమెనే గమనిస్తూ కూర్చున్నాడతను. ఆమెలో ఏదో తెలియని ఆకర్షణ

ఉందని అన్పించింది.

పదినిముషాలు గడిచింది.. అన్నం తుకతుక ఉడుకుతూ కమ్మని వాసన వెద జల్లుతుంటే అతనికి ప్రాణం లేచివచ్చినట్ట యింది. నిజమే తను అన్నంతిని ఎన్నిరో జులైందో అతనికే గుర్తులేదు.. యూపీ వెళ్లడంతో చాయ్‌లు, రోటీలేతప్ప గతవార మంతా మెతుకు ముట్టలేదు..

వంటపూర్తయింది.

'కాళ్లూ చేతులు కడుక్కురా అబ్బయా అన్నం వడ్డిస్తా..' అందామె పొయ్యిమీద కూరను గరిటతో కలియబెడుతూ.

యాంత్రికంగా ఆమె చెప్పినట్టే చేశాడు జాన్.

తను ఇంతకు ముందు వెళ్లిన చోటల్లా పైసలు ఎక్కువిస్తవా? పాన్ తెప్పిస్తవా? మందు తెప్పిస్తవా? డ్రెస్సు కొనిపెడ్తవా అన్నవాళ్లే తప్ప అన్నం తిందువు అన్నవా ళ్లింతవరకూ లేరు.

అతను ఆవురావురంటూ తింటుంటే ఆమె కొసరికొసరి వడ్డించింది. పొరబోతే మంచినీళ్లు తాగించింది. నువ్వు కూడా తినేయరాదా అంటే నువ్వు తిన్నాక తింటాన్లే అందామె. ఆమె అలా వడ్డి స్తుంటే అతనికి అవ్వ గుర్తొచ్చింది. మన సంతా ఏదోలా అయిపోయింది.

అతని భోజనం అయిన పదినిముషాలకి ఆమె కూడా తినడం పూర్తిచేసి వచ్చి తను చెంగున కట్టుకుని తెచ్చిన పాన్ అతనికి అందించింది.

అతను పాన్ నములుతుంటే మంచం మీద దుప్పట్లు తీసి, దులిపి చక్కగా పక్క సరిచేసింది. ఊదొత్తులు రెండు వెలి గించి గోడ పగుళ్లలో గుచ్చింది. గబగబ బాత్‌రూమ్‌లోకి వెళ్లి సబ్బుతో ముఖం కడుక్కొచ్చింది. పౌడర్ అద్దుకుంది. అద్దంలో చూసుకుంటూ బొట్టుబిళ్ల సరిచే సుకుంది. ముడేసిన వెంట్రుకల్ని విప్పి కిందకి వదిలేసింది. బొడ్లో దోపిన కుచ్చెళ్లు సడలించి చీరను మంచిగా సరిచేసుకుంది.

అతను ఆమె వంక ఆశ్చర్యంగా చూస్తుంటే-

'ఏందబ్బాయా ఆ సూపు! ఈ అమ్మి ఏందీ? ఈ తిండేంది? ఈ ఒండుడేంది? ఈ పెట్టుడేంది? అని ఆలోసిత్తన్నావ్ గదా? నా పద్ధతే అంత! నా గడపతొక్కిన మగాడికి ముందు కడుపాకలి తీర్చాకే ఒంటాకలి తీరుత్తా! ఎందుకంటే ఎంతైనా ఆడదాన్ని కదా? ముందు కడుపు చూశాకే మిగిలిన అవసరాల్ని సూత్తా! సర్లే రా.. రా! నా చాదస్తంతో రవంత పొద్దోయిన ట్టుంది.. నీ పని కానిచ్చుకుందువు రా తొరగా.. మళ్లా పొద్దుట్నే నెగాల!' అంటూ అందంగా నవ్వుతూ చెయ్యిపట్టుకుని మంచంమీదకి లాగిందామె.

కానీ జాన్ లేవలేదు. మృదువుగా ఆమె చెయ్యి విడిపించుకున్నాడు. అతని కళ్లలో సుళ్లు తిరుగుతున్న నీళ్లు జీరోవాట్ బల్బు వెలుగులో తళుక్కున మెరిశాయి.

'ఏందబ్బాయా ఏందీ ఏడుత్తున్నావా? ఏమైందీ.. నేనేగానీ ఏమన్నా తప్పుసే సిన్నా?' లేచి ఆందోళనగా అడుగుతోంది ఆమె.

అతను కళ్లు గట్టిగా మూసుకున్నాడు. ఏదో చెప్పబోయాడుకానీ గొంతు రుద్ధ మైంది.. మాటలు వెలికి రాలేదు.. ఆమె చేతుల్ని మాత్రం తన చేతుల్లోకి తీసుకుని ప్రేమగా ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె ఆశ్చర్యంలోంచి తేరుకోక ముందే లేచి వడివడిగా బయటకు నడుచుకుంటూ వెళ్లిపోయాడు.

అతను కూర్చున్న కుర్చీమీద ఐదువం దల నోట్లు రెండు ఆమెను పలకరిస్తూ నవ్వాయి.

– చంద్రప్రతాప్

# మహమ్మారిపై బ్రహ్మాస్త్రం

సలీం

కథ వెనుక కథ

శాస్త్ర, వైద్యరంగాలకు సంబంధించిన అంశాలతో అందరినీ ఆసక్తిగా చదివించే నవల రాయడమనేది కత్తిమీద సాములాంటిదే! భావోద్వేగాలను కలిగిస్తూనే, హృదయానికి హత్తుకునేలా ఇలాంటి రచనలు చేయాలంటే ఎంతో ప్రతిభ, ఓర్పు కావాలి. ముఖ్యంగా హెచ్.ఐ.వి ఎయిడ్స్ కథాంశంతో నవల రాయడానికి పూనుకోవడమూ పెనుసాహసమే! ఆరేళ్లక్రితమే ప్రముఖ రచయిత సలీం అలాంటి సాహసంతో 'కాలుతున్న పూలతోట' నవల రాసి పాఠకులను మెప్పించారు. తాజాగా ఆ నవలకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు రావడం తెలుగువాళ్లందరికీ గర్వకారణం. ఈ నేపథ్యంలో దీని 'కథ వెనుక కథ' ఏమిటో ఆయన మాటల్లోనే తెలుసుకుందాం.

రచయితలు తమకు బాగా తెలిసిన జీవితం గురించి రాస్తేనే చక్కగా రాయగలరనేది నా ప్రగాఢ విశ్వాసం. జీవితంలోంచి వచ్చిన నవలలు బాగా ఉంటాయి. ఏ విషయాన్నయినా కూలంకషంగా పరిశీలించి, తాదాత్మ్యం చెంది రాసిన రచనల్లోనే అనుభూతి ఉంటుంది. ఆర్ద్రత ఉంటుంది, గాఢత ఉంటుంది. అంచేత వాస్తవికత పునాదిగా వచ్చే రచనలే నాలుగు కాలాలపాటు మనగలుగుతాయనే నమ్మకం నాది.

### కథాంశం ఎంపికకు కారణాలు

'కాలుతున్న పూలతోట' పేరు వినగానే ఎవరికైనా ఒకరకమైన తెలియని బాధ మనసులో మెదులుతుంది. ఈ నవల దేని గురించో అనే ఆసక్తి కలుగుతుంది. నేడు ప్రపంచాన్ని వణికిస్తున్న పెద్ద సమస్యల్లో ఎయిడ్స్ ఒకటి. ఈ జబ్బుంటేనే ఒక మాయని మచ్చలా మన సమాజం పరిగణిస్తుంది. దీని బారినపడ్డవారికి సమాజంలో ఆదరణ కరువు. అందువల్లనే ఎయిడ్స్ గురించి రాయాలనుకున్నాను. ఈ సమాజానికి ఏదో చేయాలనే తపనే నాతో ఈ నవల రాయించింది.

### అపోహలెన్నో!

ఎయిడ్స్ గురించిన సరైన అవగాహన ప్రజల్లో లేకపోవటంవల్ల జరుగుతున్న ఘోరాలెన్నో! కన్న కూతుర్ని గర్భవతి అనే కనికరమైనా లేకుండా హెచ్.ఐ.వి బారిన పడిందన్న ఏకైక కారణంగా అమాను



సలీం

షంగా ఊరి బయటకు తరిమేసిన తల్లిదండ్రులున్నారు. తమకు ఎయిడ్స్ ఉందని తెలియగానే అది మరణ శాసనమనుకుని భయపడి ఆత్మహత్య చేసుకుంటున్నవాళ్లు ఉన్నారు. అమాయకులు సైతం రక్తమార్పిడి సమయంలో ఈ వైరస్ బారిన పడ్డ ఉదంతాలు కోకొల్లలు. ఇలాంటి సంఘటనలే ఈ నవల రాయడానికి నన్ను ప్రేరేపించాయి. పత్రికల్లో ఓ ప్రశ్నకు సమాధానమిస్తూ డాక్టర్ సమరంగారు హెచ్.ఐ.వి ఉండటం కన్నా అది సోకిందన్న భయమే ఎక్కువ నష్టం కలిగిస్తుందన్నారు. ఇది ముమ్మాటికీ నిజం. ఆ భయంతోపాటు సమాజ తిరస్కరణకు గురవడం కూడా ఆ రోగుల్ని ఎంతగానో కుంగదీస్తుంది. అందుకే ఈ నవలలో ఎయిడ్స్ రోగులు ఎదుర్కొనే అవహేళనల్నీ, ఏహ్యతను, తిరస్కారాన్ని చర్చకు పెట్టాను. ఎయిడ్స్‌ను పెద్దభూతంగా ప్రచారం చేయడంవల్ల కలిగే అనర్థాలేమిటో ఈ నవల చదివితే తెలుస్తుంది. ఈ వ్యాధికీ, మనిషి నైతిక ప్రవర్తనకు ముడిపెట్టడంతో అందరూ రోగిని దిగజారిపోయిన వ్యక్తిలా చూస్తారు. అవమానిస్తారు. దూరం దూరంగా జరిగిపోతారు. ఫలితం సామాజిక వెలివేతకు గురై సదరు రోగులు తమలో తామే కుమిలిపోతారు. ఎయిడ్స్ వ్యాధిపట్ల సదవగాహన కలిగిస్తూ, ఆరోగ్యకర జీవితాన్ని అనుసరించాల్సిన అవసరం తెలిపేందుకే ఈ నవల రాశాను.

### వెలుగు చూసిందిలా...

'కాలుతున్న పూలతోట' తొలిసారిగా 'నవ్య' వారపత్రికలో ధారావాహికంగా వెలువడింది. 2006లో పుస్తక రూపం సంతరించుకుంది. దీని హిందీ అనువాదం స్వతంత్ర వార్త దినపత్రికలో ధారావాహికంగా వచ్చింది.

### కథాంశం క్లుప్తంగా..

ఈ నవలలో బాగా చదువుకున్న కుమార్‌పాత్ర ద్వారా మరణ భయం విశ్వరూపం ఎలా ఉంటుందో చూపే ప్రయత్నం చేశాను. దీనికి పూర్తి విరుద్ధంగా నిరక్షరాస్యురాలైనా తనకు వచ్చిన వ్యాధిని ధైర్యంగా ఎదుర్కొనే పాత్ర కూలీ పనిచేసే నాగమణిది. ఆమె భర్త లారీ క్లీనర్. పెళ్లికి ముందే అతనికి హెచ్.ఐ.వి సోకింది. అతడు ఎయిడ్స్‌తో చచ్చిపోతాడు. కొడుకు కూడా ఎయిడ్స్ బారిన పడతాడు. ఆమె తప్పేమీ లేకపోయినా సమాజం నాగమణిని నిర్దయగా వెలివేస్తుంది. ఆరోగ్యమాత గుడి దగ్గర బిచ్చగత్తెగా బతుకు వెళ్లదీస్తున్న నాగమణికి ప్రమాదకర జబ్బు ఉందని తెలిసి, సాటి బిచ్చగాళ్లు కూడా రాళ్లతో కొట్టి వెళ్లగొడతారు. ఆ తర్వాత 'పాజిటివ్ పీపుల్ కేర్' అనే స్వచ్ఛంద సంస్థ సాయంతో నాగమణి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకుంటుంది. 'ఆమె ఎయిడ్స్‌ను జయించింది' అని చెప్పుకునే స్థాయికి ఎదుగుతుంది. దీనికి సమాంతరంగా పైన చెప్పిన బ్యాంక్ ఆఫీసర్ అయిన కుమార్ కథ నడుస్తుంది. ప్రేమించే భార్య, ముద్దొచ్చే ఇద్దరు పిల్ల

## ఎయిడ్స్ రోగి చేతుల మీదుగా..

సాధారణంగా సాహితీమిత్రుల మధ్య సభ పెట్టే సంప్రదాయానికి భిన్నంగా ఈ పుస్తకావిష్కరణను ఎయిడ్స్ రోగి చేతుల మీదుగా, హెచ్.ఐ.వి సోకిన వారిమధ్యన హైదరాబాద్ కూకట్‌పల్లిలోని శివానంద ఆశ్రమంలో చేశారు. ఆ రోజు రచయిత తనకు కళ్లు చెమర్చిన అనుభవం గురించి చెప్పారు. పుస్తకావిష్కరణకు ఓకే అన్న ఆ ఎయిడ్స్ రోగి ఓ షరతు పెట్టాడు. అదేమంటే ఫొటోలు తీయకూడదని.

'మీరు ఫొటోలు తీసి పేపర్లకు ఇస్తారు. దాంతో నా రోగం సంగతి మా ఊళ్లో అందరికీ తెలిసిపోతుంది. దాంతో నా కుటుంబం మొత్తాన్ని వెలి వేస్తారు. అసలు ఈ విషయం అక్కడెవరికీ తెలియకూడదనే నగరానికి పారిపోయి వచ్చాను సార్! అంచేత దయచేసి ఫొటోలు తీయకండి సార్' అన్నాడు దీనంగా.

దాంతో అక్కడున్నవారంతా చలించిపోయారు. నిజమే! మరేదైనా రోగం వస్తే అందరి సానుభూతి దొరుకుతుంది. కానీ హెచ్.ఐ.వి రోగికి తన రక్తసంబంధీకుల నుంచి కూడా ఛీత్కారాలు ఎదురవుతాయి. రోగంవల్ల కలిగే బాధకన్నా సమాజానికి తెలిస్తే అసహ్యించుకుంటారన్న భయం, అవమానమే వారిని ఎక్కువగా పీడిస్తుంది.

లున్న కుమార్ ఓ కాన్ఫరెన్స్‌లో తనతోపాటు చదువుకున్న సుధీరతో మూడు రాత్రుళ్లు గడుపుతాడు. తర్వాత తనకు హెచ్.ఐ.వి. వైరస్ సోకిందన్న విషయం తెలుసుకుని ఆమె ఆత్మహత్య చేసుకుంటుంది. అప్పటినుండి కుమార్‌లో భయం చోటుచేసుకుంటుంది. తాను కూడా ఆ ప్రమాదకర వైరస్ బారిన పడ్డాననే భయంతో జీవితాన్నంతా ఛిన్నాభిన్నం చేసుకుంటాడు. ఎయిడ్స్‌తో చచ్చిపోతే తన కుటుంబాన్ని సమాజం వెలివేస్తుందని, అపఖ్యాతి వస్తుందన్న భయంతో ఆత్మహత్యా ప్రయత్నం చేసి, ఆసుపత్రి పాలవుతాడు. ఆ తర్వాతగానీ అసలు నిజం తెలియదతనికి. అదేమంటే తనకు హెచ్.ఐ.వి లేదని.

### సంధించిన ప్రశ్నలు అనేకం!

పై రెండు పాత్రల ద్వారా హైచ్.ఐ.వి ఉందేమోనన్న భయంతో జీవితాల్ని నాశనం చేసుకోవద్దని, సరైన పరీక్షలు, నిర్ధారణల తర్వాతే తమకు ఆ వ్యాధి సోకిందో లేదో తెల్సుకోవాలని ఓ బాధ్యతాయుతమైన రచయితగా సూచించాను. అలానే వ్యాధి ఉందని తెలిశాక కూడా ధైర్యంగా దాన్ని ఎదుర్కోవచ్చని, సరైన చికిత్స తీసుకోవడం ద్వారా దాదాపు పదిహేనేళ్ల వరకూ బతకవచ్చని గుండెల్ని హత్తుకునేలా చెప్పాను. పైపెచ్చు ఎయిడ్స్ అనేది ప్రాణాంతక వ్యాధి కాదనీ, అది మేనేజబుల్ డిసీజని పాఠకులకు తెలిసే సందేశాన్ని కథలో చక్కగా ఇమిడ్చాను. ఎక్కడా కథాగమనానికి ఆటంకం కలుగకుండా ఈ నవలలో ఎయిడ్స్‌కు సంబంధించిన విషయాల్ని చర్చకు పెట్టాను. హెచ్.ఐ.వి సోకిన వ్యక్తిని తాకటం కూడా ప్రమాదమేనన్నది ప్రజల్లో బలంగా పాతుకుపోయిన ఓ అపోహ. చివరికి వైద్యవృ



## ప్రభుత్వ బాధ్యత

ఎయిడ్స్ రోగులు సమాజంలో నిరుపయోగ జీవులు కారని, వారికి సైతం సామాజిక శ్రమలో తగిన పాత్ర ఉందని, వారి సేవలను సమాజం వినియోగించుకుంటుందన్న భరోసా ప్రభుత్వం కల్పించాలన్నారు ఈ సందర్భంగా రచయిత. అలాచేయకపోతే ఈ వ్యాధిగ్రస్తుల్లో ఆత్మవిశ్వాసాన్ని ఎన్నటికీ పాదుగొల్పలేం. అయితే ప్రస్తుతమున్న సామాజిక వ్యవస్థలో అంతా బాగా ఉండి, అన్నిరకాల అర్హతలు, ఉన్నత విద్యావంతులైన యువతీయువకులకే ఉద్యోగావకాశాలు మృగ్యం. అలాంటప్పుడు ఎయిడ్స్ రోగులను ఎలా సమాదరించాలో ప్రభుత్వమే ఆలోచించాలి అంటారాయన.. సలీం చెప్పింది నిజమేగదా మరి!

త్రిలోని డాక్టర్లు, నర్సులు సైతం పేషెంట్ల పట్ల చూపిస్తున్న నిరాదరణ, డయాగ్నోస్టిక్ సెంటర్ల నిర్లక్ష్యం కారణంగా బలైపోతున్న జీవితాలు.. వాటి నాణ్యతా ప్రమాణాల్ని పట్టించుకోని ప్రభుత్వం.. ఎయిడ్స్ అంటేనే మృత్యువని ప్రజల్లో నాటుకున్న భయం.. విండో పీరియడ్‌లో రక్తదానం వల్ల కలుగుతున్న అనర్థాలు ఇత్యాది విషయాలన్నీ సన్నివేశాలకు అనుగుణంగా చక్కగా ఆవిష్కరించే ప్రయత్నం చేశాను.

### సమాచారంకోసం..

ఇది పూర్తిగా వైద్యపరమైన ఇతివృత్తం కాబట్టి ఇంటర్నెట్ సాయంతో సమాచారం సేకరించాను. కొంతమంది వైద్యులను ముఖాముఖి కలుసుకుని విషయ సేకరణ చేశాను. దీన్నొక తపస్సులా పరిశోధించాను. ఎయిడ్స్ గురించి డాక్టర్ సమరం రాసిన పుస్తకం కూడా ఉపయోగపడింది. డయాగ్నోస్టిక్ సెంటర్ యజమానుల్ని కలుసుకుని హెచ్.ఐ.వి పరీక్షల్లో పాజిటివ్ వస్తున్న శాతం ఎంత? పాజిటివ్ అని తెలియగానే ఆయా వ్యక్తుల ప్రతిస్పందన ఎలా ఉంటుంది? తదితర విషయాలను అధ్యయనం చేశాను. అలాగే కూకట్‌పల్లి శివానంద ఆశ్రమంలోని హెచ్.ఐ.వి పేషెంట్లతో మాట్లాడటం ద్వారా వాళ్ల బాధల్ని అర్థం చేసుకోగలిగాను. ఇంకా దీనికి సంబంధించి విషయ సేకరణకు తోడ్పడిన వాళ్లలో దివంగత శ్రీనివాసరావుతోపాటు సీనియర్ కథారచయిత మజుందార్‌లను ప్రముఖంగా పేర్కొనాలి. పత్రికల్లో ఎయిడ్స్‌కు సంబంధించి ఏ వార్త వచ్చినా నా దృష్టికి తీసుకునివచ్చి, చర్చించి నవలా రచనకు సహకరించినవారిలో నా భార్య డా. గీత, పిల్లలు నీహారిక, మధూలికల్నీ తప్పకుండా గుర్తుచేసుకోవాలి అని ముగించారు సలీం.

### ప్రశంసల జల్లు

ఈ నవలను చదివిన పాఠకులు చాలా విధాలుగా ప్రశంసించారు. అందులో మచ్చుకు కొన్ని- "ఎన్నుకున్న కథాంశం హెచ్.ఐ.వి అయినా, నవలలో కొన్నిచోట్ల వేశ్యావాటికల ప్రస్తావన వచ్చినా ఎక్కడా అశ్లీలత దొర్లకుండా కథా కథనం ఉంది"

"ఇందులో ఓ శిల్పవైచిత్రి ఉంది. నాగమణికి సంబంధించిన కథంతా ప్రథమ పురుషలో, కుమార్ కథంతా ఉత్తమ పురుషలో నడిపి, ఈ రెండు పాత్రల్ని కలిపిన తీరు అద్భుతంగా ఉంది"

## మరో మూడు భాషల్లోకి..

'కాలుతున్న పూలతోట' నవలను శాంతసుందరి హిందీలోకి అనువదించారు. ఆ తర్వాత మేధా పబ్లికేషన్స్‌వారు 'నయీ ఇమారత్ కే ఖండహార్' పేరుతో పుస్తకంగా వేశారు. ఇదే నవలను ఇంగ్లిష్‌లోకి రచయిత్రి జయలక్ష్మి అనువదించారు. దీన్ని ఓరియంట్ బ్లాక్ స్వాన్‌వారు 'సైలెంట్ స్టార్మ్' పేరుతో పుస్తకంగా ప్రచురిస్తున్నారు. అదేవిధంగా ఈ నవలను కన్నడంలోకి వీరభద్రగౌడ్ అనువదించారు.

## ఈ నవల ఔన్నత్యం

ఎయిడ్స్ వ్యాధికి సంబంధించిన అనేక పార్శ్వాల్ని రచయిత ఇందులో చిత్రించారు. సమాజంపట్ల ఎంతో మమకారం ఉండటంవల్లనే ఇతరులెవ్వరూ పట్టించుకోని కథావస్తువును ఎంచుకుని, ఆద్యంతం చదివించే శైలిలో రాశారు. ప్రజారోగ్య పరిరక్షణ బాధ్యతను పట్టించుకోని ప్రభుత్వం, వైద్యరంగంలోని నిర్లక్ష్య ధోరణులు, తప్పుడు అవగాహనల వల్ల జీవితాలు ఎంత నిరర్థకంగా తయారవుతాయో ప్రతిభావంతంగా ప్రదర్శించిన నవల ఇది. భయానకంగా ఎయిడ్స్ గురించి చేసే ప్రచారాలు వ్యాధికన్నా ఎక్కువగా హానిచేస్తాయి. తమకు వ్యాధి ఉందేమోనని మనసు లోలోపల గూడుకట్టుకున్న ఆలోచనల పరంపరను చిత్రించడంలో రచయిత నైపుణ్యం ప్రదర్శించారు. సన్నివేశాల కల్పనలో, సంభాషణల్లో అసహజత్వమేమీ లేకుండా వాస్తవికతకు చోటిచ్చారు. సమాజంలోని ప్రజల భావోద్వేగాలను దృష్టిలో పెట్టుకోకుండా చేసే ఆర్భాటపు ప్రచారహోరు సమాజాన్ని మరింత అమానవీయంగా చేస్తుందనేది స్పష్టమవుతుంది. ఈ వ్యాధి లైంగిక సంబంధాలవల్లనేగాక, ఇతరేతర మార్గాలద్వారా సంక్రమించినా వ్యక్తుల నైతిక ప్రవర్తనపై మాయని మచ్చ పడుతుంది. దాంతో రోగులు ఎంతగా కుమిలిపోతారో పాత్రల చిత్రణ ద్వారా రచయిత కళ్లకు కట్టించారు. సానుభూతితో రోగులను అర్థం చేసుకుని సహకరించే సామాజిక వాతావరణాన్ని కల్పించాల్సిన అవసరాన్ని నొక్కి చెబుతుందీ రచన. ఈ నవలను సునిశితంగా, మరింత లోతుగా చదివే పాఠకులు వ్యక్తుల లైంగిక ప్రవర్తనలోని అపసవ్య ధోరణుల గురించి ఆలోచిస్తారు. నేటి సమాజంలోని కలుషితమైన సాంస్కృతిక వాతావరణానికి కారణమైన పరిస్థితులను అన్వేషిస్తారు. అక్రమ లైంగిక సంబంధాలకు కారణమైన విలువల పతనం స్ఫురణకువస్తుంది. అలాగే వైద్యరంగాన్ని ప్రభుత్వాలు నిర్లక్ష్యం చేయకుండా, ఎయిడ్స్ ప్రచారాన్ని ఎంత సున్నితంగా నిర్వర్తించాలో తెలియజేస్తుందీ నవల.




కాలుతున్న పూలతోట
హిందీ అనువాదానికి ముఖచిత్రం

## పురస్కారాలు

ఇప్పటి వరకూ సలీం రాసిన నవలలు కేవలం ఐదు మాత్రమే. అందులో నాలుగో నవల 'కాలుతున్న పూలతోట'కు ప్రతిష్ఠాత్మకమైన కేంద్రసాహిత్య అకాడమీ పురస్కారం రావడం గమనార్హం. 2009లోనే దీనికి జాతీయ మానవ హక్కుల కమిషన్‌వారి జాతీయ పురస్కారం, కొవ్వలి నవలా పురస్కారం లభించాయి. ఎయిడ్స్ రోగుల బతికే హక్కు, వాళ్ల గౌరవానికి భంగం కల్గించకుండా ప్రవర్తించాలన్న నైతిక బాధ్యతను గుర్తుచేయటం వల్ల, అనువాదకురాలి ప్రతిభవల్ల మానవ హక్కుల కమిషన్ పురస్కారం దీనికి దక్కిందని రచయిత సలీం వినయంగా చెప్పారు.

సేకరణ : రఘు





బాపూజీతో విశ్వకవి

# విశ్వకవి రవీంద్రుడు తెలుగువారికి ఆత్మీయుడు

ఇరవయ్యో శతాబ్ది భారతదేశంలో ప్రపంచానికి ముఖ్యంగా స్మరణీయులు ఇద్దరు కనిపిస్తారు. ఒకరు మహాత్మా గాంధీ, మరొకరు విశ్వకవి రవీంద్రనాథ టాగూర్. గాంధీజీని ప్రపంచమే మహాత్ము డన్నది. అయితే మహాత్ముడే విశ్వకవిని గురుదేవుడన్నారు. వారిద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండేవి. విశ్వకవి శాంతినికే తనాన్ని మహాత్ముడు దర్శించాడు. అలాగే టాగూర్‌కు వివిధ దేశాల్లో గొప్ప వ్యక్తులైన ఐన్‌స్టీన్, హెల్లెన్ కెల్లర్, డబ్ల్యు.బి. ఏట్స్ తదితరులతో పరిచయముండేది.

గడచిన శతాబ్దిలో భారతీయ సాహిత్యంలో రవీంద్రుడితో పోల్చదగ్గ సాహితీ మూర్తి ఇంకొకరు కన్పించరు. అందుకే ప్రపంచంలో మహత్తరమైన గుర్తింపు పొందిన నోబెల్ పురస్కారం సాహిత్య రంగంలో రవీంద్రుడికి లభించింది. అప్పుడు ఆయన వయస్సు యాభైఒక్క ఏళ్లే. ఇప్పటికి దాదాపు నూరేళ్లు గడుస్తున్నా భారతదేశ సాహిత్యరంగంలో ఈ పురస్కారం మరెవరికీ లభించలేదు. ఇది కూడా రవీంద్రుడి ప్రత్యేకతను చాటుతోంది. అంతేకాదు ఆయనలా అనువాదం ద్వారా ప్రపంచ భాషా సాహిత్యాలకు పరిచితుడైన మరొక సాహితీమూర్తి, భారత దేశం చెప్పుకోదగ్గ మరో గొప్పకవి కూడా ఈ వందేళ్లలో కన్పించరు. ఇది కూడా ఆయన ఖ్యాతికి కారణం.



స్వతంత్ర భారత జాతీయగీతం రవీంద్ర

కవి విరచితం. ఇది తెలుగునాట విరచితం కావడం కూడా మనకు ఆయనతో ఉన్న సాన్నిహిత్యానికి నిదర్శనం. 1911లో రవీంద్రుడు మదనపల్లిలో బసచేసినప్పుడు, ఈ గీతాన్ని రచించాడు. తర్వాత స్వయంగా ఆయనే ఈ గీతాన్ని స్వరపరిచాడు. అలాగే బంగ్లాదేశ్ స్వతంత్రదేశంగా ఆవిర్భవించినప్పుడు జాతీయగీతంగా రవీంద్ర విరచిత 'సోనార్ బంగ్లా' అనే గీతాన్ని ఆ దేశం స్వీకరించింది. ఈ విధంగా ప్రపంచ చరిత్రలోనే రెండుదేశాల జాతీయగీతాలు ఒకే కవి విరచితమైన సంఘటన వేరొకటి కనబడదేమో!

రవీంద్రుడు ఎంతటి జాతీయాభిమాని అంటే 1919లో బ్రిటిష్ ప్రభుత్వం ఇచ్చిన 'సర్' బిరుదును పంజాబ్‌లోని జలియన్ వాలాబాగ్ దురంతాన్ని నిరసిస్తూ త్యజించాడు.

రవీంద్రనాథ్ టాగూర్ సాహిత్య మూర్తిమత్వం విశిష్టమైంది. ఆయనను చూడగానే ప్రాచీనకాలపు భారతదేశ రుషులు గుర్తుకువస్తారు. ఆయన తత్త్వ చింతకుడు, వేదాంతి, మహాకవి. ఆధునికతనూ సంప్రదాయాన్నీ సమన్వయపరచినవాడు. మనస్వి, సంగీతవేత్త, చిత్రకారుడు, జాతీయాభిమాని. అఖిల భారత కాంగ్రెసు సమావేశంలో 1896 ప్రాంతంలో సభా ప్రారంభం ఉత్తేజకరంగా ఉండటానికి ఆయన బంకించంద్రుడి వందేమాతరం గీతాన్ని గానం చేసినట్లు చెబుతారు. ఈ యువకవి ప్రతిభ చూసి బంకించంద్రుడు ముగ్ధుడైనాడు. రవీంద్రుణ్ణి ఎంతగానో ప్రశంసించినట్లు కూడా ఉభయుల జీవిత చరిత్రలలో ప్రస్తావనలున్నాయి.

ఆధునిక భారతదేశ భాషా సాహిత్యాలపై రవీంద్రుడి ప్రభావం ఉన్నంతగా మరే ఇతర సాహితీమూర్తి ప్రభావం కనపడదనటం అతిశయోక్తి కాదు. ఆధునిక సాహిత్య ప్రక్రియలైన కథ, నవల, ఖండకావ్యం, నాటిక, నాటకం, జీవిత చరిత్ర, సాహిత్య విమర్శ, దేశచరిత్ర, మహాపురుష సంకీర్తనం తదితరాలు ఇక్కడి ఇతర ప్రాంతీయ భాషా సాహిత్యాల్లో వెలువడటంలో రవీంద్రుడి ప్రభావం ఎంతగానో ఉంది. సాహిత్యాన్ని ఆధునికీకరించిన వాడాయన.

ఆధునిక తెలుగు సాహిత్యంలో భావకవితా ప్రస్థానంపై ఆయన ప్రభావం ఎంతో ఉంది. వేంకట పార్వతీశ్వర కవులు, రాయప్రోలు సుబ్బారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి వంటి ప్రసిద్ధ భావకవులు ఆయన ప్రభావానికి లోనైనవారే. రాయప్రోలు, అబ్బూరి రామకృష్ణారావు, మల్లవరపు విశ్వేశ్వరరావు, బెజవాడ గోపాలరెడ్డి తదితరులు రవీంద్రుడి శాంతినికేతనంలో చదువుకున్నారు. గురజాడ అప్పారావు కూడా కోల్‌కతా వెళ్లినప్పుడు రవీంద్రుణ్ణి దర్శించాడు. ఆయనతో సాహిత్య చర్చలు జరిపాడు. వాళ్లిద్దరి మధ్య ఉత్తరప్రత్యుత్తరాలు ఉండేవి. మన తెలుగునాట వ్యావహారిక భాషోద్యమం వంటిదే అంతకు పూర్వం బెంగాలీ సాహిత్యంలో కూడా తలెత్తింది. దానిని వాళ్లు చలిత్ భాషోద్యమం అన్నారు. ఈ విషయమై గురజాడ అప్పారావు, రవీంద్రుడి మధ్య భావ వినిమయం జరిగినట్లు గురజాడవారి సాహితీమూర్తిమత్వ చిత్రణ ద్వారా తెలుస్తున్నది. బహుశా చిన్నకథ, సంప్రదాయ జానపద ఛందో రీతులు, ప్రజాసాహిత్యంపట్ల గురజాడ అప్పారావుకు కలిగిన ఆకర్షణ నేపథ్యానికి కొంతలోకొంత రవీంద్రుడి ప్రభావం ఉండవచ్చు. ఇక వేంకట పార్వతీశ్వరకవుల 'ఏకాంతసేవ' ఖండకావ్య సంపుటిపై రవీంద్రుడి ప్రభావం స్పష్టం. రవీంద్రుడి సాహితీ దార్శనిక తాత్త్విక చింతన అందులో ప్రతిబింబించింది. అందుకే వేంకట

పార్వతీశ్వర కవుల 'ఏకాంతసేవ' కవితా సంపుటికి పీఠిక రాసిన కృష్ణశాస్త్రి (1922)- వంగభాషకు 'గీతాంజలి' ఎటువంటిదో, తెలుగువారికి 'ఏకాంతసేవ' కూడా అంటువంటిదే- అని చెప్పాడు.

వేంకట పార్వతీశ్వర కవులు 1930లకే రవీంద్రుడి 'గోరా' నవలను తెలుగులోకి అనువదించారు. ఈ నవలను తెలుగునాట కళాశాల విద్యార్థులు ఉపవాచకంగా చదువుకున్నారు. అంతకు పది, పదిహేనేళ్ల ముందే రవీంద్రుడి కథలు, నాటికలు తెలుగులోకి వచ్చాయి.


ప్రఖ్యాత భౌతిక శాస్త్రవేత్త ఐన్‌స్టీన్‌తో విశ్వకవి

1914, 15లలో కలకత్తాలో చదువుకొన్న అక్కిరాజు ఉమాకాంతం తప్పక రవీంద్రనాథ టాగూర్‌ను దర్శించి ఉంటాడు. బహుశా సమకాలీన భారతీయ భాషా సాహిత్యాలలో రవీంద్రుడి కథలు, నాటికలు, గీతాలు మొట్టమొదట అనువాదమైనది తెలుగులోకేనేమో. ఉమాకాంతం 'త్రిలిఙ్గ' పత్రికకు వ్యవస్థాపక సంపాదకుడు. మొట్టమొదటి సంపుటిలోనే (1915-16) ఆయన రవీంద్రుడి కథలు అనువదించి ప్రకటించాడు. 'కాబూలీవాలా' కథ తెలుగులోకి మొదట అనువదించినవాడు ఉమాకాంతమే. ఆయనకు కథారచనపట్ల ఆసక్తికి కారణం కూడా రవీంద్రుడి ప్రభావమే అని చెప్పాలి. ఆ తర్వాత పదేళ్ళకు కాని తెలుగువారి ప్రముఖ సాహిత్య మాసపత్రిక 'భారతి' ప్రారంభం కాలేదు. భారతి తొలి సంపుటాలలో రవీంద్రనాథ్ టాగూర్ రచనల అనువాదాలు, సమీక్షలు, అనుకరణలు చాలా కనపడతాయి. భారతి వెలువడకముందే మచిలీపట్నం నుంచి వెలువడిన 'శారద' పత్రికలో అబ్బూరి రామకృష్ణారావు రవీంద్రుడి 'రెడ్ ఆలియాండర్స్' అనే నాటికను 'ఎఱ్ఱగన్నేరు' పేరుతో తెనిగించాడు. అబ్బూరికి రవీంద్రుడితో ప్రత్యక్ష పరిచయం ఉంది. సాహిత్య అకాడమీ కోసం ఆ తర్వాత కాలంలో రవీంద్రుడి రూపక సాహిత్యాన్ని అబ్బూరి రామకృష్ణరావు సంపూర్ణంగా అనువదించాడు.

మల్లవరపు విశ్వేశ్వరరావు 'రవీంద్ర వ్యాసావళి' పేరిట టాగూర్ సాహిత్య వ్యాసాలను అనువదించాడు. సుమారు వెయ్యి పుటలుండే ఈ రెండు సంపుటాలు రవీంద్ర దర్శనానికి సాధికార ప్రమాణంగా తెలుగువారికి ఎంతగానో ఉపకరిస్తున్నాయి. 1921 నాటికే రఘుపతి వేంకటరత్నం నాయుడి ప్రేరణతో రవీంద్రుడి తండ్రి దేవేంద్రనాథ టాగూర్ స్వీయచరిత్ర తెలుగులోకి వచ్చింది.

రవీంద్రుడి పేరు తలచుకోగానే మొట్టమొదట గుర్తుకువచ్చేది 'గీతాంజలి'. 1916 నాటికే అది తెలుగులోకి అనువాదం పొందింది. ఆ తర్వాత ఇంచుమించుగా ఇప్పటికి నూరు అనువాదాలు వచ్చి ఉంటాయి. కొన్ని వందలసార్లు తెలుగు సాహిత్యంలో ఆయన ప్రస్తావనలు కనపడతాయి. తెలుగునాట పెద్ద సాహిత్య సంచ

లనం సృష్టించిన చలం, భావగీతికా వచనంగా గీతాంజలిని తెలుగుచేశాడు. దీనికి సంజీవ్‌దేవ్ ప్రశస్తమైన పీఠిక రాశాడు. రవీంద్రుడి పూర్వీకుల కుటుంబ సంప్రదాయం, వారసత్వం గురించి ఎంతో భావుకతతో సంజీవదేవ్ ఈ పీఠికలో సమీక్షించాడు. దీనికి ఆయన 'అనుమేళన' అని పేరు పెట్టాడు. రవీంద్రుడి గీతాంజలి లయ సహిత గద్యమనీ, చలంకూడా తెలుగులో అట్లా చెప్పటానికి కృతకృత్యుడైనాడని సంజీవదేవ్ అభిప్రాయం. గీతాంజలి తెలుగు అనువాదాల పరిచయాలలో సంజీవ్‌దేవ్‌ది అత్యంత ప్రశస్తమైనది. 'గీతాంజలిలాంటి గాఢమైన, గూఢమైన, మార్మిక తాత్త్విక కవితల్ని అనువదించటం ఎంతో అంతర్ దృష్టి, చైతన్యసాధనతో కూడుకొన్న విషయం' అంటారు సంజీవ్‌దేవ్. అలాగే 'గీతాంజలిని అనువదించటానికి భాషా పాండిత్యం, పరిణతి మాత్రమే సరిపోదు. దానికి జీవన సాధన అవసరం' అని కూడా ఆయన అన్నారు. సంజీవదేవ్ కూడా కవీ, చిత్రకారుడు సౌందర్య పిపాసి, కళాత్మక హృదయుడు కాబట్టి చలం చేసిన గీతాంజలి అనువాదాన్ని చక్కగా సమీక్షించాడు.

రవీంద్రుడి జాతీయత ఏకదేశీయమైనదీ, సంకుచితమైనదీ కాదు. 'వుంసాముదార చరితానాంతు వసుధైక కుటుంబకం'- లాంటిది అది. ప్రాచ్య, పాశ్చాత్య సంస్కృతుల మౌలిక సౌందర్యవీక్షల సమ్యగవేక్షణం అది. ఆయనపై బ్రహ్మ సమాజ ప్రభావం మిక్కుటం.

రవీంద్రుడి తాత ద్వారకానాథ టాగూర్ అత్యంత సంపన్నుడు. విదేశీ పర్యటనలు చేసినవాడు. బ్రిటిష్ గవర్నర్ జనరల్ లార్డు ఆక్‌లండ్‌కు కలకత్తాలో ఉద్యానవన విందులు ఏర్పాటు చేయగల శ్రీమంతుడు. విక్టోరియా రాణితో కూడా ఆయనకు పరిచయం. ఆయన బ్రహ్మ సమాజ నిర్మాత రాజా రామ్మోహన్ రాయ్‌కి మిత్రుడు.

రవీంద్రుడి తండ్రి దేవేంద్రనాథ టాగూర్ బ్రహ్మ సమాజ ప్రాపకులలో ఆద్యుడు. 'తత్త్వబోధిని' అనే బ్రహ్మ సమాజతత్త్వ ప్రచార ప్రతికను ఆయన నడిపాడు. టాగూర్ కుటుంబ సంపన్న భవన సింహద్వారంపై 'ఈశావాస్య మిదం సర్వం' అనే ఉపనిషదుక్తి ఎంతో ఆకర్షకంగా లిఖితమై, అలంకృతమై ఉండేది. రవీంద్రుడి గీతాంజలి కూడా ఉపనిషత్సార సుందర రుచిర కలశంగా చెప్పవచ్చు.



రచయిత్రి హెలెన్ కెల్లర్‌తో రవీంద్రుడు

రవీంద్రుడికి తెలుగువారిపట్ల మెప్పు, శ్లాఘన ఉండేవనేది ఆయన మనపై కనపరచిన సుహృద్భావం, ప్రశంసల ద్వారా తెలుసుకోవచ్చు. ఆదిభట్ల నారాయణదాసు కోల్‌కతాలో ఒకసారి హరికథ విన్పించగా రవీంద్రుడు హాజరై దాసుగారి ప్రతిభను ఎంతగానో కొనియాడాడు. ఆ తర్వాత చాలా కాలానికి విజయనగరం సందర్శించిన రవీంద్రుడు, తనకు జరిగిన పౌర సత్కారసభలో ఆదిభట్లను స్వయంగా కలసి మీ 'బేహాగ్' రాగాలాపన ఇంకా నా చెవులలో మధువృష్టి కురిపిస్తున్నదని తన్మ

యుడైనాడు.

బళ్ళారి రాఘవ నాటక ప్రదర్శనను చూసి ఇటువంటి నటుడు 'నభూతో నభ విష్యతి' అని పొంగిపోయాడు. పిఠాపురం రాజావారి ఆహ్వానంపై వచ్చిన రవీంద్రుడి స్వాగత సత్కార వైభవాన్ని అద్దేపల్లి లక్ష్మణ స్వామినాయుడు స్వీయ చరిత్రలో, ఇటీవల వెలువడ్డ ఆవంత్స సోమసుందర్ ఆత్మకథ 'కలలు-కన్నీళ్ళు'లో ఎంతో హృద్యంగా వర్ణించారు.



దేవులపల్లి కృష్ణశాస్త్రి అప్పటికి యువకుడు. రవీంద్రుడు ప్రత్యేక రైల్వే బోగీలో పిఠాపురం వచ్చాడు. అప్పుడు ఆ ప్రాంతీయుల సాహిత్యానంద సంరంభం వర్ణనాతీతం. ఆంధ్రదేశంలో అత్యంత ప్రసిద్ధుడైన పిఠాపురం ఆస్థాన సంగీత విద్వాంసుడు తుమురాడ సంగమేశ్వరశాస్త్రి వీణావాద్య కచేరిని రవీంద్రుడి గౌరవార్థం మహారాజా వారు ఏర్పాటు చేశారు. ఈ సన్నివేశాన్ని ఆ తర్వాత కథలు, గాథలుగా చెప్పుకున్నారు మనవారు. సంగమేశ్వరశాస్త్రిని విడువలేక తనతోపాటు కోల్‌కతా తీసుకొని వెళ్ళారు రవీంద్రుడు. అయితే అక్కడ ఉండలేక రెండు నెలల్లోనే సంగమేశ్వర శాస్త్రి తిరుగు ప్రయాణమయ్యారు.

1937లో విజయనగరంలో 'ఆంధ్రా రీసెర్చ్ యూనివర్సిటీ' అనే విశ్వవిద్యాలయ ప్రతిపత్తిగల విద్వత్సంస్థ రవీంద్రుడికి గౌరవ డాక్టరేట్ ఇచ్చింది. గొప్ప పండితకవి పంతులు లక్ష్మీనారాయణశాస్త్రి రవీంద్రుణ్ణి ప్రశంసిస్తూ శ్లోకాలు రచించారు. రాయప్రోలు సుబ్బారావు 'పంచదళి' పేరుతో పుష్పోపహారం సమర్పించారు. భోగరాజు నారాయణమూర్తి అనే ఆనాటి ప్రసిద్ధ కవి, నవలా రచయిత ప్రశంసా పద్యాలు విన్పించారు. ఈ పరిశోధనా విశ్వవిద్యాలయం రవీంద్రుడికి 'కవి సమ్రాట్' అనే బిరుదునిచ్చింది. ఎమ్. శ్రీరామమూర్తి అనేవారు ఇంగ్లీషులో ప్రశంసాపద్యాలు కూర్చారు. ప్రశంసా పత్రం ఇంగ్లీషులోనే సమర్పితం. రవీంద్రుడి శతజయంతికి అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి విశేష ప్రత్యేక సంచిక ప్రచురించింది. రవీంద్రుడి రచనల తెలుగు అనువాదాలను వెలువరించింది.

తెలుగువారి రాజధాని నగరంలో ప్రతిష్ఠాత్మకమైన సాహితీ మందిరం 'రవీంద్ర భారతి' ఆ మహనీయుని పేరిట వెలసింది. ఇక్కడ ప్రతిరోజూ సాహిత్య సంగీత, కళా సాంస్కృతిక, నాటక ప్రదర్శనల సంరంభంతో సంతోషోత్సాహ తరంగితమవుతున్నది.

తెలుగువారికి రవీంద్రుడెంతో ఆత్మీయుడు. ప్రచురణ సంస్థలకు, వ్యక్తులకు, వీధులకు తెలుగువారు రవీంద్రుడి పేరు పెట్టుకున్నారు.



–అక్కిరాజు రమాపతిరావు
వ్యాస రచయిత



# తరగని అందం సుస్మిత



భారతీయ మహిళ అందంతోపాటు తెలివితేటల్లోను అగ్రగామి అని నిరూపించింది అందాలరాణి సుస్మితాసేన్. చురుకైన సమాధానాలతో 'విశ్వసుందరి' కిరీటాన్ని సునాయాసంగా దక్కించుకుంది. మిలమిల మెరిసే కనుల సోయగం, మిలియన్ డాలర్ల నవ్వు, చక్కటి అంగసౌష్ఠవం, చలాకీతనం ఆమెసొత్తు. ఒకే సంవత్సరంలో మిస్ ఇండియా, మిస్ యూనివర్స్ టైటిల్స్ గెలుచుకున్న బాలీవుడ్ భామ సుస్మిత. 'ఓలే' బ్యూటీ బ్రాండ్‌ల ప్రమోటర్‌గా వెలుగొందిన సుస్మితాసేన్ అనేక అవార్డులు చేజిక్కించుకున్న మేటి నటి. ఆమె పుట్టింది ఆంధ్ర రాజధాని హైదరాబాద్‌లో.. పెరిగింది దేశ రాజధాని ఢిల్లీలో.. ఆమె మిస్ ఇండియా, మిస్ యూనివర్స్‌గా కీర్తిగాంచిన తరువాతనే వెండితెరమీదికి అడుగుపెట్టింది. అందచందాల గురించి ఆమె అనేక చిట్కాలు చెప్తోంది!

★ అందానికి చిరునామా ముఖారవిందమే అయినా దానికి కారణం మిలమిలలాడే చర్మం. చర్మం నిగారింపుతోనే శరీర అందం కొట్టొచ్చి నట్టు కనిపిస్తుంది.

★ శరీరం సుకుమారంగా ఉండాలంటే ప్రయాస పడక తప్పదు. మనసును ప్రశాంతంగా ఉంచుకోవడం, సుఖనిద్ర, తేలికపాటి ఆహారం, ఎక్కువ మంచినీళ్లు తీసుకుంటూ యోగా, ప్రాణాయామాలను అనుసరిస్తుంటే అందం పదిలం.

★ ఎంత షూటింగ్ బిజీలో ఉన్నా.. ఏ అర్ధ రాత్రో అపరాత్రో ఇంటికి తిరిగివచ్చినా నాకంటూ



కొంత సమయాన్ని కేటాయించుకుంటాను. ఇంట్లో ఉన్నప్పుడు చాలా ప్రశాంతంగా గడపటం వల్ల బడలిక బలాదూర్.

★ ఆరోగ్యానికి, అందానికి సమతుల ఆహారమే ముఖ్యం. రాత్రిళ్లు చాలా తక్కువగా, తేలిక పాటి ఆహారం తీసుకోవాలి. ఫాస్ట్ ఫుడ్స్, ఫ్రైడ్స్ అస్సలు నాకు గిట్టవు.

★ మిల్క్, ఆల్మండ్ లిక్విడ్స్ శరీరానికి తగినంత శక్తినిస్తాయి. అలాగే పళ్లు తినడం, పళ్లరసాలు ఎక్కువ తాగడం మేలు.

★ నా చర్మం నిగారింపుకు అసలు రహస్యం బొప్పాయి, నారింజ రసాలు మర్దన చేసుకోవడమే. సడలిన చర్మాన్ని బిగుతు చేసి నిండైన నిగారింపునిస్తాయవి.

★ నా హ్యాండ్‌బ్యాగ్‌లో నిత్యం రోజ్‌వాటర్, లిప్‌బామ్ 'ఓలే', మాయిశ్చరైజర్‌లు ఉంటాయి.

★ జుట్టు పట్టులా ఉంచుకోడానికి 'పెంటిన్ టోటల్'ని ఆశ్రయిస్తాను. రోజూ పదిహేను నిమిషాలు ఫిట్‌నెస్ ఎక్సర్‌సైజులు, యోగా, ప్రాణాయామాలు, షూటింగుకి వెళ్లేముందు ఆయిల్ మర్దన తప్పని సరి.

★ స్విమ్మింగ్ చేసేవాళ్లు జుత్తు నీటిలో తడవకుండా క్లోరిన్ ఎఫెక్ట్ పడకుండా క్యాప్ తప్పనిసరిగా ధరించాలి.

★ చురుకుగా, ఫ్రెష్‌గా వుండేందుకు తేనె, నిమ్మరసం సేవించాలి.

★ షూటింగుల్లో పాత్రకు అనుగుణంగా ముదురురంగు దుస్తులు వేసుకున్నా, లేతరంగులే నాకిష్టం. క్రీమ్, బీజ్, లైట్‌పింక్ రంగులు. నలుపు రంగు శక్తికి ప్రతీక అని నా భావన.

★ ఎవరితోనైనా చాలా ఫ్రీగా, ధైర్యంగా చిరునవ్వుతో మాట్లాడటం చిన్నప్పటినుంచీ నాకలవాటే. పాజిటివ్‌మైండ్‌తో, చురుగ్గా, చొరవగా మెలగడం అతివ అందాన్ని ఇనుమడిస్తాయి. మూడీగా ఉండడం, లోలోనే భావాలను అణచిపెట్టుకోవడం ఎవరికీ, ఎప్పటికీ మంచిది కాదు.

★ శరీర షోషణ, ఆరోగ్యకరమైన ఆహారం, ప్రశాంతతతోపాటు మంచి ఆలోచనలున్న యువతులే అందాల రేసులో ముందంజలో ఉంటారు.

★ నిజానికి మన ఇళ్లల్లో లభ్యమయ్యే పదార్థాలతోనే అందాన్ని పరిరక్షించుకోవచ్చు. అయితే ఈ తరంవారికి వాటిని తయారుచేసుకుని, వాడటం కాస్త శ్రమతో కూడినది. అందుకే రెడీమేడ్ బ్రాండ్‌లపై ఆధారపడుతున్నారు. అలాంటప్పుడు మంచి బ్రాండ్‌ను ఎంపిక చేసుకోవాలి. పదేపదే బ్రాండులను మార్చడమూ మంచిది కాదు.

★ పెరుగుతున్న వయసు, సడలుతున్న సౌందర్యాన్ని చూసుకుంటూ ఎవ్వరూ దిగులు పడనక్కరలేదు ఆరోగ్య సూత్రాలు పాటిస్తుంటే వయసుకు తగ్గట్టే అందాన్ని, హుందాతనాన్ని కాపాడుకోవచ్చు.

★ నా వయసుకు తగ్గట్టు జాగ్రత్తలు తీసుకుంటాను. తక్కువ వయసు కన్పించడానికి రకరకాల సాధనాలు వాడుతూ హైరానా పడను.

★ శారీరక ఆరోగ్యం మానసిక వికాసానికి దోహదం చేస్తుంది. జీవితాన్ని సంతోషమయం చేస్తుంది.

★ అంటీముట్టనట్లు ఉండకుండా నలుగురితో ప్రేమగా మెలగాలనేది నేను నమ్మిన సిద్ధాంతం.

★ శరీర సౌందర్యాన్ని నిలబెట్టుకోవాలన్నా,

# ఆర్కాట్‌వారి ఇంటి ముందరే ..

నిన్నటి నిజం

పట్నం సుబ్రహ్మణ్యం అయ్యర్ మైసూరు సంస్థానాన్ని సందర్శించేందుకు వచ్చిన కొత్తలో బెంగళూరులో ఆర్కాట్ శ్రీనివాసాచార్య భేటీకోసం మొదట వెళ్ళారు. సిటీ మార్కెట్ నుంచి పడమరవైపు చిక్కపేటను కలిపే రాస్తాలో ఉన్న ప్రధాన భవంతి ఆర్కాట్ శ్రీనివాసాచార్యది. ఆయన గొప్ప న్యాయవాది. అయ్యర్ వెళ్ళే సమయానికి ఆ భవంతి ముందు ఒక గుర్రపు బండి వుంది. ఒక పెద్దమనిషి ఓ కాలు దానిలో మోపి నిలబడ్డాడు. ఆయన వెళ్లేందుకు సిద్ధంగా ఉన్నాడు. అక్కడికి వెళ్లిన సుబ్రహ్మణ్యం అయ్యర్‌ను గమనించి, "ఎవరు మీరు?" అన్నారు.

"పట్నం సుబ్రహ్మణ్యం అంటారు నన్ను" జవాబిచ్చాడు అయ్యర్.

"ఓహో! తమరేనా అంతోటి పేరుగాంచినా సంగీత విద్వాంసులు! తమ దర్శన భాగ్యం కలగడం సంతోషం! ఏమైనా కొంచెం అది సాధ్యమా ఇప్పుడు?" ఆశ్చర్యంగా అడిగాడు ఆ పెద్దమనిషి.

"దానికేం? ఇదిగో, కొంచెం ఆలకించండి!" అంటూ సుబ్రహ్మణ్యం అయ్యర్ మధ్యమావతిలో ఒక రాగాన్ని కొంచెం ఎత్తుకొని రెండావర్తములు తానం పాడారు.

ఆయన పాడడం వినగానే ఆ పెద్దమనిషి అయ్యర్‌గారిని ఆనందముతో వాటేసుకున్నారు.



పట్నం సుబ్రహ్మణ్యం అయ్యర్

"ఎవరికోసం వచ్చారు? నాకోసమేనా? ఆర్కాట్ శ్రీనివాసాచార్ అంటారు నన్ను" అన్నారు.

"మైసూరు దేశయాత్ర చేయాలని మొదటిగా బెంగళూరుకు వచ్చాను. ముందుగా మీ దర్శనం కోరి వచ్చాను. ఇదే మన తొలి కలయిక" అన్నారు పట్నం సుబ్రహ్మణ్యం అయ్యర్. శ్రీనివాసాచార్యులు పక్కన నిలబడ్డ గుమసాతో- "ఈ ఫైళ్ళు, పత్రాలు, పుస్తకాలు అన్నీ ఇంట్లో పెట్టు. ఆఫీసుకు వెళ్ళి ఈ రోజు నేను రానని చెప్పు" అన్నారు.

"రండి, ఇంట్లోకి వెళదాం" అంటూ అయ్యర్‌గారిని వాటేసుకుని సాదరంగా తీసుకెళ్లారు.

సుబ్రహ్మణ్యం అయ్యర్‌కు రోజు అక్కడే విడిది, ఆతిథ్యం. శ్రీనివాసాచార్య తన బంధుమిత్రులందరినీ పిలిచి ఆ సాయంత్రమే సంగీత కచ్చేరి జరిపించారు. తదనంతరం ఆహూతులతో మాట్లాడుతూ "ఘన విద్వాంసులు, ఇంత గొప్ప మనిషైన ఈయన మా ఇంటిముందు నిలబడి నేనడగగానే ఎలాంటి భేషజం లేకుండా వీధి భాగవతుడిలా మధ్యమావతి రాగంలో పాడారు! ఎంత సరళ గుణసంపన్నులు!" అని గొప్పగా కొనియాడారు.

నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం.. నిన్నటి నిజం..

నిన్నటి నిజం... నిన్నటి నిజం... నిన్నటి నిజం... నిన్నటి నిజం... నిన్నటి నిజం... నిన్నటి నిజం... నిన్నటి నిజం...

చెడగొట్టుకోవాలన్నా మన చేతుల్లోనే ఉంటుంది. ఆహారాన్ని, వ్యాపకాలను ఎవరికివారు ప్రతిక్షణం గమనిస్తూ తగిన జాగ్రత్తలు తీసుకోవాలి.

★ కృత్రిమంగా కొనితెచ్చుకునే అందంకన్నా సహజ శరీరంపై శ్రద్ధ పెట్టడం మేలు.

★ ఇద్దరు ఆడపిల్లల్ని దత్తత తీసుకుని పెంచుకుంటున్న నాకు వారి అలనాపాలనలోనే చాలా సమయం సంతోషంగా గడచిపోతుంది.

★ నలుగురిలో ఉన్నప్పుడు ప్రతి ఒక్కరినీ ప్రత్యేకమైన వ్యక్తిగా పరిగణించి అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాలి. లోపాలను చూసి ఇతరులను నిందించడం వల్ల పెద్దగా ఒరిగిదేమీ ఉండదు. చుట్టుపక్కలవారితో సరైన సామాజిక సంబంధాలను నెలకొల్పుకోవడం మన మానసిక ఆరోగ్యానికి అతిముఖ్యం.

★ జీవితాన్ని ప్రతి క్షణం ఆనందించాలి. ఇతరులకు హాని కలిగించనంత వరకూ తాము చేసే పనులు గురించి ఎవరేమనుకుంటారోనని సిగ్గుపడక్కర్లేదు. ప్రతిదానికీ భయపడేవారు జీవితాన్ని ఆస్వాదించలేరు. అలాగే ఓ లక్ష్యమంటూ జీవితాన్ని నిర్దేశిస్తే క్రమశిక్షణ అలవడుతుంది.

★ ప్రశాంతమైన మనస్సు, ఉన్నతమైన జ్ఞానం కలిగివున్నవారి ముఖవర్చస్సు ఆకర్షణీయంగా ఉంటుంది. సంకుచిత భావాలతో మెదడుపై ఒత్తిడి పెంచకూడదు.

సేకరణ: రేవతి



'కమ్యూనిస్టు పార్టీ మీకేమిచ్చింది?' అని ఎవరేనా అడిగితే, 'ఓ మనిషిగా, ప్రయోజకుడిగా తీర్చిదిద్దింది, అది చాలదా!' అనేవారు బరంపురం ప్రవాసాంధ్రులు వుప్పల లక్ష్మణరావు. అవును, ఆయనో మంచి మనిషి. గొప్ప సాహితీ ప్రయోజకుడు. ఆ రెండూ ఓ చోట ఉండడం అరుదు. కాబట్టే ఈనాడైనా ఏనాడైనా ఆయన గురించి మనం ఇంతగా చెప్పుకోవడం. విదేశీ వనితను పెళ్లాడి ఇరవై తొమ్మిదేళ్లు సహజీవనం చేసిన ఆ సాహితీమూర్తి వర్ధంతి (మార్చి 23) సందర్భంగా అందిస్తున్న విశేషాలివీ ..

# బరంపురం ప్రభంజనం

బరంపురంలో ఎన్నో విభాగాలలో ఎన్నెన్నో సాహితీ దృక్కోణాలలో, లలితకళల్లో తమ తమ ప్రతిభాపాటవాల్ని చాటిన ప్రవాసాంధ్రులు ఎందరో ఉన్నారు. ఇకముందు ఉంటారు కూడా. కాని అక్కడే పుట్టి, అక్కడి మట్టిలోనే కలిసిన లక్ష్మణరావు పట్టుపట్టి నిలబెట్టిన ఉద్యమస్ఫూర్తి మాత్రం తెలుగు పుట్టుక పుట్టిన ఏ వ్యక్తి అయినా నెత్తిన పెట్టుకోవలసిందే. ఆయన జీవనసరళితో విభజించలేని ఆ సాహితీ కృషి అందుకే అడుగడుగునా ఆలోచనాత్మకం, అవశ్యపఠనీయం.

తెలుగును ప్రేమించిన ఎవరైనా లక్ష్మణరావు రాసిన పుస్తకాలలోని తెలుగును ప్రేమించకుండా ఉండలేరు. ఒక విదేశీ వనితని పెళ్లాడి ఆమెతో ఇరవై తొమ్మిదేళ్లు సహజీవనం చెయ్యడంగాని, ఎన్నో ఏళ్లు విదేశాలలో గడిపారు. అంతేగాక జర్మన్, రష్యన్, ఇంగ్లీష్, ఆఫ్రికన్, లాటిన్, అమెరికన్ భాషల్లో ప్రాభవం సంపాదించినా లక్ష్మణరావుగారికి మాతృభాషపై ఉన్న పట్టుని అవి చెక్కుచెదరనివ్వలేదు. నాలుగు భాగాలుగా అచ్చైన ఆయన డైరీ నవల 'అతడు-ఆమె'గాని, ఆత్మకథ అయిన 'బతుకు పుస్తకం'కాని ఓసారి పట్టుకుంటే చివరిదాకా వదల్లేమనిపించే పఠనీయ సామర్థ్యం కలవి. ఒక పుస్తకం చదవడంలో మునిగిపోయినప్పుడు రెండోది మరచిపోయేటంత మత్తు కలిగించే సత్తా ఉన్నవవి. ఆయన జీవితంలోని ఆద్యంతాలలోని ప్రభావాల్నే తీసుకుందాం. ఆయన వ్యక్తిత్వం రూపుదిద్దుకొనే కాలంలో కుటుంబసభ్యుల ముద్రేం తక్కువకాదు. బాగా చిన్నప్పుడే తాతగారు దిగుమర్తి వేంకటరా

మయ్యపంతులుగార్ని లక్ష్మణరావు ఓసారి అడిగారట, "మీరెప్పుడూ దేవుణ్ణి చూళ్ళేదంటున్నారు కదా, మరెందుకు ప్రార్థిస్తున్నారు? " కుర్రప్రశ్న అని కళ్లెర్ర చెయ్యక, "మన కష్టాల్ని పంచుకొనే వాడొకడున్నాడనే నమ్మకంతో అనుకుంటాన్రా" అనే ఆ సనాతనుడి జవాబులోని నిజాయతీ చూడండి. అంతేకాదు. 'అతడు-ఆమె' మొదటిభాగం రాసి "ఎలా ఉందో చదివి చెప్పండర్రా" అని తల్లికీ పినతల్లులకీ యిస్తే వాళ్లది చదివి "దేశం స్వతంత్రం కోసం పోరాడుతోంటే దాన్ని నేపథ్యంగా తీసుకురాస్తే కొంత విలువ ఉండేదేమో.. కేవలం మొగుడూ పెళ్లాల కీచులాటలు రాస్తే ఏం ప్రత్యేకత ఉంటుందని!" అని పెదవి విరిచారు. దాంతో లక్ష్మణరావు తిరిగి రాయవలసి వచ్చిందట. అంతటి విమర్శాసంస్కారం ఉన్న కుటుంబం నుంచి వచ్చారు గనకనే విశ్లేషణాత్మకమైన భాషాజ్ఞానం ఆయన జీవితాంతం వెంటాడి వెన్నంటి ఉండాలి. తియ్యని ఆ తెనుగు నుడికారం ఎంతగా గుండెకు పట్టుకోకపోతే ఆ రెండు పుస్తకాల్లో అన్నన్నిసార్లు పోతన, పెద్దన, వేమన మొదలు గురజాడలవరకు ఉటంకిస్తారు! అంతేకాదు త్యాగయ్యగారి కృతుల్లోని అన్యభాషా పదాల్ని కూడా వెతికి చూపిస్తూ భావంతో పాటు అర్థం కూడా తెలుసుకుని మరీ పాడాలని పలుచోట్ల ఉదహరిస్తారు!

శాస్త్రవేత్తలా, సాహితీ స్రష్టలా వీరిద్దరిలో ఎవరి వల్ల సోషలిస్టు సామాజిక స్థాపన జరిగి సామాన్య ప్రజకి లాభం చేకూరుతుందని ఆయన మనసు తర్జన భర్జన చేసుకున్నట్టుంది. సి.వి.రామన్, రామానుజంలాంటి మేధావులకన్న వీరేశలింగం, గురజాడలలాంటి సాహితీ దిగ్గజాల వల్లనే ప్రజలెక్కువగా ప్రభావితులయ్యారని తెలుసుకున్నాక లక్ష్మణరావు ఆ ప్రక్రియలోనే విప్లవబీజాలను నాటడానికి పూనుకున్నారు. తోడూ నీడా అయిన సహచరి అస్తమించాక కొన్నేళ్లు మాస్కోలో గడిపినా చివరికి ఆ ఒంటరితనం భరించలేక పుట్టిన ఊరికే తిరిగి వచ్చేశారు. ఎనభై ఏళ్లు పైబడిన వృద్ధుడు పసివాడై తల్లి ఒడిలో చేరినట్లు బరంపురం వచ్చేశారు. అంతేకాదు 'వికాసం' అనే అక్కడి సాహితీ సంస్థలో చేరారు. ఆయన మాటల్లోనే "వికాసం నా చేత కలం తిరిగి పట్టించింది. వికాసంలోని యువకులతో కలసి సారస్వత కృషి చెయ్యడం వల్ల నేనో వృద్ధుణ్ణనే మాట మరచిపోతూంటాను".

ఇంతకీ ఆ 'వికాసం' సంస్థాపక అధ్యక్షుణ్ణి నేనే అని చెప్పుకోడానికి నాకెంతో గర్వకారణం. బరంపురంలో కళ్లికోట కాలేజీలో నేను ఇంగ్లీషు లెక్చరరుగా పనిచేస్తున్న రోజులవి. నవంబరు15, 1970న భీమారావు



పేటలోని మా అద్దెయింటి హాల్లో పది మందితో మొదలైంది అది. ఆ తర్వాత మరో ఆరు నెలలకి ట్రాన్స్‌ఫర్ అయి నేను భవానీపట్నానికి వెళ్లిపోవడం జరిగింది. 71 ఉగాదికి అనుకుంటా 'మనం మనం బరంపురం' అనే కథల సంపుటిని 'వికాసం' తరపున అందించా. నా తర్వాత ఆ సంస్థకి సారథ్యం వహించి చైతన్యం కలిగించిన ఖ్యాతి ఉప్పల లక్ష్మణరావుగారిదే. 'బతుకు పుస్తకం' వెలుగు చూసింది అప్పుడే.

ఈ రచనకి 'బతుకు పుస్తకం' అని పేరు సూచించడమేకాక ఎంతో సహకరించిన బచ్చుదేవి సుభద్రామణికి అంకితమిచ్చారాయన. చేదోడుగా నిలిచిన కె.ఎల్. ప్రసాదు, సేతుపతి ఆదినారాయణలకు కృతజ్ఞతలు చెప్పారు. ఆయన డిక్టేటు చేస్తూంటే రాసిపెట్టిన మరదలు వుప్పల జనాబాయినీ చెల్లెలు వరహగిరి సత్యాబాయినీ పొగిడారాయన. 'బతుకు పుస్తకం' లాంటి మంచి పుస్తకం ఒకటి తెలుగులో వచ్చినందుకు దానికి కారణభూతులైన ప్రతిఒక్కర్నీ మనం చెయ్యెత్తి మొక్కవలసిందే. ఎలాగా వచ్చింది గనక ముందు బతుకు పుస్తకంలోని ప్రత్యేకత తెలుసుకున్న తర్వాతే 'అతడు-ఆమె'లోకి వెళదాం.

ఇంగ్లండ్, జర్మనీ దేశాల్లో చదువుకుని లక్ష్మణరావు బాటనీలో డాక్టరేటు పొందినా, కాకినాడలో కొన్నేళ్లు లెక్చరరుగా పనిచేసినా, ఆంధ్రా ఇంజినీరింగ్ కంపెనీలో కార్యదర్శిగా కొన్నేళ్లు ఉన్నా, తనదైన రాజకీయ భావజాలానికి కట్టుబడిన వ్యక్తిత్వం ఆయనది. సాహిత్యంలో నిజాయతీకి రాజకీయాల్లో నిబద్ధతకీ మారుపేరు ఆయన. అనేక దేశాలు పర్యటించి ఎన్నో విశ్వవిద్యాలయాల్లో విజిటింగ్ ప్రొఫెసరుగా పనిచేశారు కూడా. జీవన విధానంలోనూ సాహితీ సంధానంలోనూ తనదైన ప్రత్యేకతను నిలుపుకున్న లక్ష్మణరావు జీవితంలో స్విట్జర్లాండు వనిత మెల్లీ షోలింగర్ భాగస్వామ్యం బతుకుపుస్తకం పాఠకుల ఆలోచనలకి ఓ మరుపురాని మలుపూ అపురూపమైన కుదుపూ. 'ఆమె జీవిత విశేషాలు' అంటూ ఆ పుస్తకం చివర ఓ అనుబంధం అవసరం లేదన్నంతగా ఆయన మనసులో అల్లుకుపోయిన మల్లీజాబిల్లీ ఆ మహాసాహసి మెల్లీ.

'మహాసాహసి' అనే విశేషణం లక్ష్మణరావు గారికీ దక్కుతుంది. రొడ్డకొట్టుడు పద్ధతిని ఎదిరించే ధైర్యసాహసాలే వారిద్దరినీ కలిపి ఉండాలి. మన వివాహ విధానమే చూడండి. పెళ్లి సంబంధాలు చూసేదీ, నిశ్చయించి తాంబూలాలు పుచ్చుకొనేదీ పెద్దవారే. వధూవరుల మనసులతో సంబంధం లేకుండానే పెళ్ళిళ్ళు జరిగిపోతాయి. ఇక ఆనాటి పురాణాలతోపాటు నేటి సినీ గీతాల్లో సహా 'మొన్న కనిపించింది, నిన్న కరుణించింది, నేడు ప్రసవించింది' అనే జెట్ స్పీడుతో జరిగిపోతాయి. ఇక మెల్లీ, లక్ష్మణరావు గార్ల జంట మాట? అంతకుముందు ఏళ్లపాటు స్టడీ చేశాక మనవాడిని మనువాడదామని ఆమెగారే ప్రపోజ్ చేస్తే ఈయన జవాబేమిటో తెలుసా? "పెళ్లికీ సమష్టి జీవనానికీ అన్యోన్య ప్రేమ కదా పునాది. నువ్వు మా దేశం వచ్చి మా కుటుంబ మర్యాదలు స్వయంగా చూసి తెలుసుకో. నీకు అలవాటైన కాలకృత్యాల సరళికీ మాకూ ఎంతో తేడా. మేం నూతి దగ్గరే స్నానం చేస్తాం. స్నానాలగది అని ప్రత్యేకంగా ఉండదు. ఒక్కొక్కరికీ ఒక్కొక్క గది అంటూ ఉండదు. రాత్రి అందరం ఏ వసారాలోనో వరండామీదో డాబామీదో వరసగా పక్కవేసి పడుకుంటాం. నేలమీద కూచుని విస్తళ్లలో చేత్తో అన్నం కలుపుకు తింటాం. నీ ఊహకి అందని అనారోగ్య పరిస్థితుల్లో ఇక్కడ మావాళ్లు చాలామంది జీవిస్తున్నారు. నీకు అలవాటైన గుర్రపుస్వారీ,

రైఫిలు రేంజీ, సముద్రంలో ఈతా ఇక్కడ జరిగే అవకాశం ఉండదు. ఆలోచించుకో" అసలు అంతకుముందు నుంచే మెల్లీగారికి భారత దేశమన్నా, మహాత్మాగాంధీ అన్నా ఓ విధమైన కుతూహలమూ ఆసక్తీ గౌరవమూ. లక్ష్మణరావుగారంటే సదభి ప్రాయం కూడా ఏర్పడ్డంతో 1930లో ఇండియా వచ్చారావిడ. ఇద్దరూ జాతీయ పోరాటంలోనూ, సబర్మతీ ఆశ్రమంలోని ఖాదీ ఉద్యమంలోనూ కలిసి పనిచెయ్యడం కాక శ్రీకాకుళంలోని ఖాదీ ఉత్పత్తి నాణ్యతల గురించి పరిశోధనలు చేశారు.

అలా ఏడేళ్ళపాటు హిందూదేశ పరిస్థితుల్నీ లక్ష్మణరావుగారి కుటుంబ వ్యవహారాల్నీ క్షుణ్ణంగా పరిశీలించాకే పెళ్లికి లైన్ క్లియర్ ఇస్తూ పెళ్లి మాత్రం మాస్కోలోనే జరగాలన్నారు మెల్లీ. అక్కడే అన్ని రంగాలలోనూ స్త్రీకి పురుషుడితో సమాన ప్రతిపత్తీ సంపూర్ణ స్వాతంత్రమూ ఉంటుందని ఆవిడ చెప్పిన మీదట 1937లో మాస్కోలో పెళ్లి చేసుకున్నారు.

పెళ్లిముందే కాదు పెళ్లి అయ్యాక కూడా వారి జీవన విధానం విలక్షణమైనదే. ముందురాత్రి లక్ష్మణరావుగారిలా అన్నారు- "చిన్నప్పుడు నేను నాలుగో క్లాసు చదువుతున్నప్పుడు నా సహపాఠి వెంకయ్య అనేవాడు ఉండేవాడు. వాడి రూపురేఖలు మా అందరికంటే ప్రత్యేకం. వేరుగా ఉండి 'క్రాసుబ్రీడు' అని స్పష్టంగా తెలియజేసేవి. దాన్తో వాడినందరూ ఏడిపిస్తే ఎంతో అవమానానికి గురయ్యేవాడు. ఆ వేదన నా మనసుమీద బలమైన ముద్ర వేసింది. మనిద్దరం పూర్తిగా వేర్వేరు ప్రాంతాలకి చెందిన వాళ్లం కనక మనకి పుట్టిన పిల్లలు కూడా అలాంటి హింసకు గురికాకూడదు. అంచేత మనకి పిల్లలే వద్దు. సంపర్కం ప్రసక్తే ఉండకూడదు. ఇంద్రియ నిగ్రహం వహించి అసిధారా వ్రతం పాటించాలి. అందుకు నువ్వు సహకరిస్తావనుకుంటాను".

మారుమాటాడక అందుకు సిద్ధమయిన ధీమతి ఆమె. "అయితే చీర కట్టమని నన్ను నిర్బంధించకు, పుస్తెలూ, నగలూ ధరించమని అడక్కు" ఇవీ ఆమె షరతులు. పరస్పర అవగాహనతో ఇరవై తొమ్మిదేళ్లు సహ జీవనం చేశారు వారు.

1939లో బెజవాడలో ఆంధ్రా సిమెంట్ కంపెనీ నెలకొల్పిన తర్వాత జనరల్ మేనేజరుగానూ, సేల్సుమేనేజరుగానూ 15 ఏళ్లు ఉద్యోగం చేశారు లక్ష్మణరావు. ఉద్యోగానంతరం తూర్పు జర్మనీలో గ్రైస్వాల్డ్ యూనివర్సిటీలో ఓ ఏడాది చేశాక బోస్ ఇన్స్టిట్యూట్‌లో చేరి బాటనీలో పరిశోధన పునఃప్రారంభించారు. 1958లో మాస్కో ప్రగతి ప్రచురణాలయం కోరికపై ప్రధాన తెలుగు సంపాదకుడిగా పనిచేశారు. 40 గ్రంథాలను సరళమైన తెలుగులోకి అనువదించారు. ఆయన కృషిలో అత్యుత్తమమని అందరూ చెప్పుకొనేది తెలుగు - రష్యన్ నిఘంటు నిర్మాణం గురించి. ఎన్నో సైద్ధాంతిక, సాహిత్య గ్రంథాలను, కథలను రష్యన్ భాషనుంచి తెలుగులోకి అనువదించారు. 'సోవియట్ దేశం - భూతల స్వర్గం' అన్న గ్రంథం ఆ దేశాన్ని స్వయంగా చూసిన ఆంధ్రుడు రాసిన మొట్టమొదటి పుస్తకం. బ్రెష్ట్ రచించిన 'అమ్మ' అనే జర్మన్ నాటకాన్ని, హైనె కథలను అనువదించారు. అలాగే జర్మన్ పండితుడు వాల్టర్ రూబెన్స్ రాసిన 'ప్రాచీన భారతదేశంలో బానిసల స్థితిగతులు' అన్న గ్రంథాన్ని ఆంధ్రీకరించారు.

1965లో ఓ రోడ్డు ప్రమాదంలో మెల్లీగారు మరణించినా 1971 వరకు అక్కడే ఉండి, బరంపురం వచ్చేశారు. ఇక భరించలేక 1985లో ఆయన స్వగృహంలో కన్నుమూశారు. చివరి పది పద్నాలుగేళ్లలో వికాసం సారథ్యంలో పునరుజ్జీవనం పొంది బతుకునంతా పుస్తకంగా పరచగలి

## చదువులు - పదవులు

సోవియట్ రష్యా తెలుగు రచనా ప్రాచుర్యానికి వారసులుగా, అభ్యుదయవాదిగా. ఉదాత్తవ్యక్తిగా ఉప్పల లక్ష్మణరావు లబ్ధప్రతిష్ఠులు. బరంపురం, మద్రాసు, కోల్ కతాలలో ఉన్నత విద్యలనభ్యసించారు. వృక్షశాస్త్రంలో బీఎస్సీ (ఆనర్స్), ఇంగ్లండ్ ఎడింబరో విశ్వవిద్యాలయంలో ఎం.ఎ., జర్మనీ ట్యూబెన్‌గిన్ విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ చేశారు. జగద్విఖ్యాత వృక్షశాస్త్రవేత్త సర్ జగదీశ్ చంద్రబోస్ విద్యాసంస్థలో లక్ష్మణరావు చేసిన పరిశోధనలు ఎందరో ప్రముఖుల ప్రశంసలు పొందాయి. కాకినాడ సి.ఆర్. కాలేజీలో వృక్షశాస్త్ర ప్రధానాచార్యులుగా, ప్రకృతి శాస్త్ర శాఖ అధిపతిగా, అలీఘర్ విశ్వవిద్యాలయంలో వృక్షశాస్త్ర ఉపన్యాసకులుగా, జర్మనీ డైన్స్‌కాల్డ్ విశ్వవిద్యాలయంలో సీనియర్ పరిశోధకులుగా బాధ్యతలు నిర్వహించారు.

వి.వి.గిరి నాయకత్వంలో బెంగాల్- నాగ్‌పూర్ రైల్వే కార్మికులు సమ్మె చేసినపుడు ఆయనకు లక్ష్మణరావు ఆంతరంగిక కార్యదర్శిగా ఉన్నారు. విజయవాడ ఆంధ్రాసిమెంట్ ఫ్యాక్టరీలో మేనేజరుగా ఆ పరిశ్రమ అభివృద్ధికి కృషిచేశారాయన.

గిన మేధావి ఆయన. తుంటి ఎముక విరిగి మంచాన పడి ఉన్న ఆ రోజుల్లో కూడా ఆయన మనోనిబ్బరం వదలక సాహితీ వ్యాసంగంలో మునిగి తేలుతూ ఉండేవారని ఆయన్ని ఆదుకున్న ఆత్మీయులు చెబుతారు. ఆయన జీవితమూ ఆయన సృష్టించిన సాహిత్యమూ ఒక దానితో మరొకటి వేరుచేయలేనంతగా ముడిపడి ఉంటాయి కనుకనే ఆయన నవల 'అతడు-ఆమె' అత్యుత్తమ అభ్యుదయ రచనగా మనగలిగింది. ఈ నాలుగు భాగాల డైరీ నవలలో ఎన్నెన్నో విశేషాలున్నాయి. మొదటి రెండు భాగాలూ 1964లో అచ్చయ్యాయి. 1971లో బరంపురం వచ్చి స్థిరపడ్డాక 'వికాసం' ఆధ్వర్యంలో రాసిన మూడో భాగం 1976లో వచ్చింది. నాలుగోది 1986లో రచయిత మరణానంతరం వచ్చింది. ఈ నాలుగు భాగాలూ కలిపి 2001లో ఒకే పుస్తకంగా విశాలాంధ్ర వాళ్లు తీసుకురావడం విశాల హృదయం ఉన్న ఆంధ్రులంతా నాలుగు కాలాలపాటు కృతజ్ఞతతో చెప్పుకోవలసిన విషయం.

ఇందులో మొదటిభాగంలో 'అతడు' చిదంబరం 'ఆమె' శాంతం. 2, 3 భాగాల్లో 'అతడు' జనార్దనం అయితే 'ఆమె' సుభ పేరుగల వారి పెంపుడు కూతురు. ఇక నాలుగో భాగంలో 'అతడు' భాస్కరం. 'ఆమె' శాంతం, చిదంబరంల సొంత కూతురు లక్ష్మి. వ్యంగ్య హాస్యసృజనల్లో చేయి తిరిగిన రచయిత అవడంచేత ఎన్ని వందల పేజీల గ్రంథమయినా రీడబిలిటీకీ ఎక్కడా ఢోకా ఉండదు. ఈ 'అతడు', 'ఆమె'లు మారుతూంటారు గనక వారి పేర్లేమిటో భాగాల ముందు ఇచ్చి ఉంటే పాఠకులకి మరింత సుగ్రాహ్యమై ఉండేది. రాజకీయ భావజాలమనేది అంతస్సూత్రమే గాని లక్ష్మణరావుగారు పెద్దపీట వేసింది స్త్రీ జనాభ్యుదయానికే అని ఎవరికైనా బోధపడిపోతుంది. ఎంత 'అ, ఆ'ల వరస వర్ణక్రమం కుదిరినా మార్పు అనేది ఊహించిందీ ఆ విధంగా చిత్రణ జరిగిందీ స్త్రీ పాత్రల ద్వారానే గనక 'ఆమె-అతడు' అని ఉండాలనుకోవడం స్త్రీవాదమే కాదు, పురుషసూక్తం కూడాను.

అయితే అన్నన్ని వెలుగుల ముందు ఇవి అతి చిన్న నెరుసులు.

ఉప్పు సత్యాగ్రహం నుంచి క్విట్ ఇండియా వరకు జాతీయోద్యమంలోని అన్ని కోణాలనూ ప్రతిభావంతంగా చిత్రించిన నవల యిది. చిదంబరం దృష్టి కేవలం తమ బాగుకే అయితే అతని భార్య శాంతమ్మది అందరూ బాగుపడాలనే సంస్కార దృష్టి. వీరిద్దరి మధ్య వచ్చే ఘర్షణ పాఠకుడిలో ఆలోచనలు రేకెత్తిస్తుంది. ఈ క్లిష్టతకు ఏది సమాధానమో తెలుసుకోమని

చదువరిని ప్రేరేపిస్తుంది. సత్యాగ్రహంలో నిజాయితీగా పనిచేసి శాంతం దెబ్బలు తింటే, దాన్ని ఊతగా తీసుకుని భర్త కాంగ్రెస్ టికెట్ సంపాదించాలనుకోడం ఆమె జీర్ణించుకోలేకపోతుంది. ఎంతో ప్రేమించిన భర్తలోని ఊసరవెల్లి లక్షణాన్ని భరించలేక తాత్కాలికంగా ఇల్లు విడిచిపెడుతుంది. అయినా ఈ అనుభవంతో శాంతంలో నవచైతన్యం వెల్లివిరుస్తుంది.

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ చేసిన క్విట్ ఇండియా తీర్మానానికి శాంతం పెంపుడు కూతురు సుభ ప్రభావితురాలవుతుంది. ఆ ఉద్యమంలో తనూ పాల్గొని జైలుకి వెళ్లాలని సుభ ప్రయత్నిస్తుంది. కమ్యూనిస్టు పార్టీతో మమేకం పొందిన చెల్లెలు లక్ష్మి ధోరణిని విమర్శిస్తుంది. ఇలా పోషిస్తు భావజాలం నేపథ్యంలో సామాజిక సమస్యలన్నిటినీ ఈ నవలలోని మూడు విభిన్న ముఖ్య పాత్రల ద్వారా రచయిత విశ్లేషిస్తాడు. నవలా రూపంలో వచ్చిన జాతీయ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో 'అతడు-ఆమె'కు సరితూగే తెలుగు రచనలు ఇంచుమించు మృగ్యం. గర్భస్రావాలు తప్పుకాదనీ వాటిని శాసనబద్ధం చెయ్యటం అత్యవసరమనీ- అలాగే సెక్సు విద్యను పిల్లలకు సుబోధకం చెయ్యాలనీ ఆ రోజుల్లోనే సాహసోపేతంగా ప్రతిపాదించిన తొలి తెలుగు నవల ఇది.

మామూలు నవలల్లో అయితే రచయిత తన భావాలకనుగుణంగా పాత్రలను తీర్చి దిద్దుతాడు. డైరీల సమాహారంగా చిత్రించబడిన ఈ నవలలో పాత్రలన్నీ తమకు తామే చిత్రించుకుంటాయి. ముఖ్యమైన మూడు స్త్రీ పాత్రలేకాక వారితో ముడిపడి ఉన్న మూడు పురుష పాత్రలూ కూడా ఎంతో స్వభావ సిద్ధంగా చిత్రించబడ్డాయి.

'నన్నొక మంచి మనిషిగా మలచి, కమ్యూనిష్టుగా తీర్చిదిద్దేందుకు కృషి చేసిన జీవిత భాగస్వామి మెల్లీ షోలింగర్‌గారికిదే నా ప్రేమాంజలి' అన్నారు అతడు-ఆమె-3 ముందుమాటలో లక్ష్మణరావుగారు.

## గాంధీజీతోనే హోరా హోరీ!

లక్ష్మణరావుగారు జర్మనీలో ఉన్న సమయంలో మెల్లీ షోలింగర్ అనే స్విస్ వనితను మాస్కోలో పెళ్లి చేసుకున్నారు. తరువాత ఆ దంపతులు భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. సబర్మతీ ఆశ్రమంలో గాంధీజీతో కలిసి ఉన్నారు. మహిళల హక్కులకోసం గాంధీజీతోనే తగాదాపడి ఆశ్రమంలోనే సత్యాగ్రహం చేసిన ఉద్దండురాలు మెల్లీ. దేశమంతా కీర్తించే గాంధీజీతోనే పోరాడటం ఆమె స్వతంత్ర ఆలోచనా సరళికి ఒక నిదర్శనం.

'అయితే నీ పెళ్లిమాట ఏమిటి?' అని ఎవరో అడిగితే 'నాకిప్పుడు ముప్ఫైఅయిదు. మొగాడితో కులుకుదామనీ, పిల్లల్ని కనాలనీ నాకే కోశానా లేదు. మొగుడికి సేవ చెయ్యాలనీ, సంసారం చేసుకుని ఓ అరడజను మంది పిల్లల్ని కనాలనే బుద్ధీ నాకెప్పుడూ పుట్టలేదు. ముందు ముందు పుట్టదు కూడా. నా శరీరం, నా మనస్సు నా స్వంతానివి. వాటిని నేనెవ్వరికీ తిలాదానం చెయ్యాలనుకోలేదు' అన్నంత శక్తిమంతంగా నాలుగో భాగం 538వ పేజీలో లక్ష్మిచేత అనిపించారు. ఇంతగా మానవ స్వభావపు లోతుల గురించి పరిజ్ఞానంతో ప్రతిధ్వనించిన ప్రభంజనం వుప్పల లక్ష్మణరావు గారు. బరంపురమే కాదు మనుషులందరం ఆ ఊపులోని ముందు చూపుతో మున్ముందుకి సాగుదాం!



–అవసరాల రామకృష్ణారావు,
వ్యాస రచయిత

పోతే ఎలా?"

"నీకు అసలు సంగతి తెలీదు. ఆయనకి డబ్బిస్తే, దేవుడి హుండీలో వేసినట్లే. తిరిగిరావు. అర్థమైందా?" చెప్పాడు రాజేంద్ర తమ్ముడికి.

"ఆఁ. ఆఁ... అర్థమైంది"

"సరే, ఉంటా! చెప్పింది గుర్తుంచుకో"

"అలాగే అన్నయ్యా!" అన్నాడు ఆదిత్య.

★ ★ ★



రాజేంద్రవాళ్ళకి సుబ్బారావు స్వంత మేన మామ కాదు. దూరపు చుట్టం. ఒకే ఊరిలో వుండడం వల్ల చిన్నప్పటి నుంచి 'మావయ్యా!' అని పిలిచేవారు. తరచుగా ఇంటికి రాకపోకలు న్నాయి.

సుబ్బారావుది మున్సిపాల్టీలో చిన్న ఉద్యోగం. సంసారం పెద్దది. భార్య పిల్లలతోపాటు తల్లిదం డ్రులు ఇంట్లో వుండేవాళ్ళు. అందుకే ఎప్పుడూ డబ్బుకి ఇబ్బంది పడుతూ వుండేవాడు. అప్పు తీసుకుంటే తొందరగా ఇవ్వడనే అపఖ్యాతి వుంది. రాజేంద్రకి ఆ నోటా ఈ నోటా సుబ్బా రావు సంగతులు తెలుస్తుండేవి. అదీగాక రాజేంద్ర చాలా కాలిక్యులేటెడ్‌గా వుంటాడు డబ్బు దగ్గర. అందుకే సుబ్బారావు అప్పు అడి గితే ఇవ్వకపోవడమేగాక, తమ్ముడ్ని గూడా ఇవ్వొ ద్దని ఫోన్ చేసి మరీ హెచ్చరించాడు.

కొంతకాలం గడిచింది.

ఓరోజు సుబ్బారావు రాజేంద్ర ఇంటికొచ్చాడు. మళ్ళీ డబ్బు అడుగుతాడేమోనని ముఖం గంటు పెట్టుకుని కూర్చున్నాడు రాజేంద్ర.

"అంతా బాగున్నారా మావయ్యా! చిన్నోడికి ఎట్లావుంది?" మొఖమాటానికి అడిగాడు.

"ఇప్పుడు బాగా వున్నాడురా! కేన్సర్ మొదటి దశలో వుందని ట్రీట్‌మెంట్ ఇచ్చారు. పూర్తిగా నయమైంది. అంతా దేవుడి దయ. అన్నట్లు మన ఆదిత్య చాలా హెల్ప్ చేశాడు" అన్నాడు సుబ్బా రావు.

"వాడు నీకు హైదరాబాద్‌లో కనిపిం చాడా?" బిత్తరపోతూ అడిగాడు రాజేంద్ర.

"కనిపించడమేమిటి? వాడే సికింద్రా బాద్ స్టేషన్‌కి వచ్చి రిసీవ్ చేసుకు న్నాడు. నేనొస్తున్నట్లు చెప్పావటగా ఫోన్ చేసి"

"ఆఁ... అవునవును..." తడబడ్డాడు రాజేంద్ర.

"కారులో ఇంటికి తీసుకెళ్ళాడు. తర్వాత తనే హాస్పటల్‌కి తీసుకెళ్ళాడు. డాక్టర్లతో మాట్లాడాడు. ఖర్చులకి పదివే లుకూడా ఇచ్చాడు. చాలా థాంక్స్‌రా రాజేంద్రా!" అన్నాడు సుబ్బారావు.

రాజేంద్రకి తమ్ముడి మీద కోపం ముంచుకొచ్చింది. 'వట్టి మూర్ఖుడిలా ఉన్నాడే! సుబ్బారావుకి డబ్బిస్తే తిరిగిరావని ఫోన్‌చేసి చెప్తేగూడా చెవికెక్కలేదా!' అని మదన పడ్డాడు.

సుబ్బారావు వెళ్ళిపోయిన తర్వాత, వెంటనే తమ్ముడికి ఫోన్ చేశాడు.

"ఏరా! నీకు ఫోన్‌చేసి చెప్పానా లేదా? సుబ్బా రావుకి డబ్బిస్తే దేవుడి హుండీలో వేసినట్లేనని. పదివేలు ఇచ్చావట. డబ్బు మరీ ఎక్కువైందా?" కోపంగా అన్నాడు రాజేంద్ర.

"నువ్వే చెప్పావుగా అన్నయ్యా! సుబ్బారావుకి ఇస్తే, దేవుడి హుండీలో వేసినట్లే అని. అందుకే ఇచ్చాను. దేవుడి హుండీలో వేస్తే పుణ్యమే గదా?" అని నవ్వాడు ఆదిత్య.

రాజేంద్ర వెర్రి ముఖం వేసుకుని వుండిపో యాడు. ©



# "చిత్రం! భళారే... విచిత్రం!!

- చింతల చెరువు సువర్చల

ఆదివారం.. ఉదయాన్నే ఫోన్ మోగటం విని.. 'ఎవరబ్బా పొద్దున్నే!' అనుకుంటూ సీమ ఫోన్ తీసింది.

"హలో.. సీమా! నేను.. నవీన.." అంది అవ తలిగొంతు.

"బాగున్నావా! నేనే ఫోన్ చేద్దామనుకుం టున్నా. ఇంతలో నువ్వే చేశావ్" లౌక్యంగా అంది సీమ.

'ఏదో విశేషముంటేగానీ నవీన ఫోన్ చేయదు' అని మనసులోనే అనుకుంది సీమ. అయినా ఆమె బయటపడలేదు.

"మీ బాబు 'ఫలానా' ఫౌండేషన్ స్కూల్లో ఎలా వున్నాడు? " ఏదో మాటవరసకి అడిగింది నవీన.

అసలు విషయం అది కాదని తెల్సు సీమకి.

"ఆఁ బానే వున్నాడు. ఇప్పుడిప్పుడే 'అమ్మా' అంటున్నాడట."

"అవునా? ఆ స్కూల్ ఎలా వుంది? " మళ్లీ అడిగింది నవీన.

"స్కూలుకేం? బ్రహ్మాండంగా వుంది. అక్కడ.. పిల్లలు 'ఊ' కొట్టటం, దోగాడటం, మొదటి అడుగు వేయటం, బొమ్మలతో ఆడు కోటం.. అన్నీ రికార్డ్ చేసి.. ఆ సీడీలను మనకి పంపిస్తారు. పిల్లల్ని చూసేందుకు పేరెంట్స్‌ని ఎప్పుడంటే అప్పుడు అనుమతించరు. వాళ్లిచ్చిన విజిటింగ్ డేస్‌లోనే వెళ్లాలి" అంది సీమ.

"మరి.. మీ పాప? " అని తిరిగి అడిగిందామె.

"అ, ఆ..లు నేర్చుకుంటోంది. ఇప్పుడు తెలుగు కంపల్సరీ అయింది కదా! అందుకే మేం పాపని 'మరేదో' ఇంటర్నేషనల్ స్కూల్లో చేర్చాలనుకుం టున్నాం. మా ఫ్రెండ్సంతా ఆ స్కూల్ సజెస్ట్ చేస్తున్నారు. అది చాలా బాగుందట. అక్కడ సలు ఎక్కువసేపు పిల్లల్ని నిద్రే పోనివ్వరట. 'ఆట' అనే మాట వాళ్ల నోట వస్తే 'తాట' తీస్తా రట. తోటి పిల్లలతో ఎక్కువ మాట్లాడనివ్వరట. పేరెంట్స్‌నైతే ఇయర్లీ వన్స్ మాత్రమే రానిస్తా

రట. అస్సలు డిస్టబెన్సెస్ లేకుండా చూస్తున్నారని పిస్తోంది. పైగా ఇప్పట్నుంచే ఇంటర్నేషనల్ సెమినార్స్‌కి అటెండయ్యే ట్రైనింగిస్తారట. చాలా బాగుంది కదూ!" అంది నవీన.

"బాగుందీ.. కానీ.. ఫీజదీ బాగా ఎక్కువుం టుందేమో!" అడిగింది సీమ.

"చాలా ఎక్కువ. ట్వంటీ లాఖ్స్ పర్ యానమ్. అందుకే మరికాస్త ఎక్కువ ప్యాకేజీ వుండే ఉద్యోగం కోసం ట్రై చేస్తున్నాం మేమి ద్దరం. అవునూ.. మీరు కూడా మీ బాబునిక్కడ చేర్పొచ్చు కదా? "

"మాకంత అఫర్డబిలిటీ లేదు నవీనా. ఇప్పు డున్న స్కూల్లో చేర్పటానికే మేం ఆలోచించుకోవా ల్సొచ్చింది. అందుకే మా బాబుని మూడో నెలొ చ్చాక కానీ చేర్చలేకపోయాం. చాలామంది మా కొలీగ్స్ నెలలోపే చేర్చేశారు తెల్సా? మేం మా ఫైనాన్షియల్ మ్యాటర్స్ ఆలోచించుకొనే సరికే చాలా లేటయ్యింది. అప్పటికే నా కెరీర్ కొంత స్పాయిల్ కూడా అయింది" బోలెడు దిగులు పడిపోయింది సీమ.

"పోన్లే.. దిగులు పడకు. నువ్వో పని చెయ్. నేనామధ్య 'అదేదో' ఇనిస్టిట్యూట్, ఓ కొత్త కోర్స్ ఆఫర్ చేస్తే.. దాన్ని పర్స్యూ చేశా. అందుకే నాకు నా జాబ్‌లో ప్రమోషన్ వచ్చింది. నువ్వూ ఆ కోర్స్ చేయరాదూ? మంచి ఆపర్చ్యునిటీస్ వుంటాయి. పెద్ద పెద్ద మల్టీనేషనల్ కంపెనీస్ పిలుస్తాయ్.. "

"ఏం కోర్సదీ!" ఆసక్తి చూపించింది సీమ.

"ఫలానా కోర్స్! రాత్రి తొమ్మిదింటికి ఆఫీస్ నుంచి వస్తూవస్తూ కూడా వెళ్లొచ్చు మనలాంటి వాళ్లకోసమే ఆ టైమింగ్స్ పెట్టారు. ఆలోచించ కుండా చేరిపో. ముందుముందు ఆ కోర్సుకి మంచి క్రేజ్ వుంది. గొప్ప ప్యాకేజీ ఆఫర్ చేస్తాయి కంపెనీలు. అప్పుడు మీ బాబుని 'మరేదో' స్కూల్లాంటి స్కూల్లో పడెయ్యొచ్చు. వాడి కెరీర్ కూడా చాలా బాగుంటుంది. ఆలో చించుకో" అంది నవీన.

"అలాగే తప్పకుండా. చాలా థేంక్స్ నవీనా!" సీమ అంటూండగానే, "అన్నట్లు సీమా.. చెప్పటం మరిచా.." అంది అసలు విషయా నికొస్తూ నవీన.

"ఏంటదీ!? "

"ఇది విన్నావా? "

"ఏదీ? "

"అదే.. సుగుణ సంగతి.."

"సుగుణా! ఏమైంది తనకి? " సీమ ఆదుర్దాప డింది.

"సుగుణకేమీ కాలేదులే. స్టన్నిస్ బుక్‌లోకి ఎక్కింది. న్యూస్ చూడలేదా? "

"స్టన్నిస్‌బుక్కా.. ఎందుకు? ఎలా? " అడిగింది సీమ.

"ఎలా గేంటి? వాళ్లత్తగార్ని, మామగార్ని ఇంట్లోనే ఉంచుకుంటున్నందుకు"

"అవునా? " ఆశ్చర్యపోయింది సీమ.

"అవును మరి! స్టన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్' ఈ మధ్యకాలంలో ఎవ్వరూ చేయలేని.. అంటే చేయటానికి సాహసం చేయలేని పనులని చేసి చూయించి స్టన్ అయ్యేలా చేస్తే రికార్డ్ ఇస్తోంది. అఫ్‌కోర్స్! చాలా పూర్వం అలాంటి కుటుంబాలుండేవట. అవేనాడో అంతరించి పోయాయిగా. ఇప్పుడవి ఫాలో అవగలగటం చాలా గ్రేట్ అట"

"గ్రేట్ కదా మరి!" అంది సీమ ఏమనాలో తోచక.

"అవునూ.. అంతకు ముందు 'చమ్మా బుక్ ఆఫ్ రికార్డ్స్'లోకి కూడా ఎక్కింది కదూ? " అంది తిరిగి సీమా.

"అవును.. పిల్లల్ని ఎక్కడా రెసిడెన్షియల్ స్కూల్స్‌లో చేర్చకుండా.. రెగ్యులర్‌గా స్కూల్‌కి పంపిస్తూ.. వాళ్ల చేత హోమ్‌వర్క్ స్వయంగా చేయించటంతోపాటు పిల్లల ఫీడింగ్ వ్యవహా రాలు కూడా ఇంట్లోవాళ్లే చేస్తున్నారు. అందుకే 'గ్రేట్ పేరెంట్స్'గా వాళ్లిద్దరూ చమ్మాబుక్ సాధించారు. ఇప్పుడేమో ఈ స్టన్నిస్ రికార్డ్. గొప్పకోసం కాకపోతే అత్తమామల మీద ప్రేమతో చేసిందా యేం? " అంది నవీన

"అంతేనంటావా? "

"అంతకాక? ఏ పనీపాట లేని వాళ్లు చేసే పనులివి. నీకు మాత్రం తెలీదూ? స్టన్నిస్‌బుక్‌లో చేరేవాళ్లంతా ఏం తోచక, ఏం చేస్తే, ఎంత వెరైటీలు చేసి చూపిస్తే ఆశ్చర్యంగా వుంటుందో.. ప్లాన్ చేసుకొని మరీ ఇలాంటివి చేస్తారుకదా!" అంది నవీన వ్యంగ్యంగా.

"అంత చదువు చదువుకొని.. తన కెరీర్ చూసుకోక ఇదేం తెలివితక్కువ పని? " వాపో యింది సీమ.

"నిజంగా తెలివితక్కువదే. ఎక్కడో ఏదో స్కూల్లో పిల్లలకి కథలు, రైమ్స్‌లాంటివి చెప్పొ స్తుందట. తన పిల్లల్నేమో చాలా మామూలు స్కూల్లో చేర్చింది. ఇటు తన కెరీర్ పాడుచేసు

# రచయితలకు, అనువాదకులకు, కార్టూనిస్టులకు
## సూచనలు

★ ఇతివృత్తంలో నూతనత్వం, రచనా సంవిధానంలో వైవిధ్యం గల తెలుగు కథలనూ, అనువాద కథలనూ 'విపుల' ఆహ్వానిస్తున్నది. హాస్య వ్యంగ్య రచనలకు ప్రత్యేక ప్రాధాన్యత. ప్రచురించే ప్రతి తెలుగు కథకు రూ. 500/- పారితోషికం ఉంటుంది.

★ ప్రచురించిన అనువాద కథకు పారితోషికంగా మూల రచయితకు రూ. 250, అనువాదకునకు రూ. 350 లభిస్తుంది. అనువాద కథలు పంపే వారు ఆయా మూల భాషా రచయితల నుండి లిఖితపూర్వక అనుమతి పొంది కథతోపాటే అనుమతి పత్రం కూడా జతపర్చాలి. మొదటి షీటు లోనే 1. మూలభాష 2. ఆ భాషలో ఆ కథ పేరు 3. రచయిత పేరు, చిరునామా 4. ఆ కథను ప్రచురించిన పత్రిక లేదా సంకలనం పేరు, తేదీ 5. ప్రచురణకర్తల చిరునామా 6. అనువాదకుని చిరునామా తెలియజేయాలి.

★ అనువాదకులు మూల రచయిత అనుమతి పొందలేని సందర్భాలలో పై వివరాలు తెలిపితే మేమే అనుమతి పొందగలం.

★ అనువాదానికి ఎన్నుకునే కథలు సమకాలీన రచయితలవే అయితే బాగుంటుంది. తెలుగు పాఠకులకు సుపరిచితులయిన ప్రసిద్ధుల కథలు పంపవద్దని మనవి.

★ ప్రతి రచనకు తగిన స్టాంపులు అంటించి స్వంత చిరునామా గల కవరు జతపరచాలి. అలా జతపరచకపోయినా పోస్టులోగానీ, ఇతరత్రాగానీ రచనలు పోయినా మా బాధ్యత ఉండదు. పోస్టుకార్డులు జతపరచటం అనవసరం.

★ కార్టూన్లు 5×10.5 సెం.మీ. సైజుకు తగ్గించడానికి అనువయిన సైజులో డ్రాయింగ్ పేపరుపై ఇండియన్ ఇంక్‌తో వేసి పంపాలి. కాప్షన్ స్పష్టంగా అర్థమయ్యేలా ఉండాలి. చుట్టూ బార్డర్ తప్పనిసరిగా ఉండాలి. ప్రచురించిన కార్టూన్‌కి రూ. 40 చొప్పున పారితోషికం ఉంటుంది.

# విపుల

'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 500 082
ఈ మెయిల్ : vipula.chatura@gmail.com

కుంది.. అటు పిల్లల ఫ్యూచరూ పాడు చేసేస్తోంది. ఎన్నిసార్లు చెప్పినా వింటేగా? ఇక విసుగు పుట్టి చెప్పటం మానేశా. తనకి మంచి లైఫ్‌ని మిస్సవుతున్నాననే బాధలేదు. పైగా తనదే మంచి లైఫ్ అనుకుంటుంది. హ్యూమన్ రిలేషన్స్, సోషల్ వ్యాల్యూస్, హెల్దీ అట్మాస్ఫియర్, చిల్డ్రన్ రైట్స్ అని ఏమేమో అంటూ.. కెరీర్‌ని పూర్తిగా వదిలేసి.. ఇలాంటి తోచని పనులలో టైమంతా వేస్ట్ చేసుకుంటోంది. తన ఖర్మ! మనమేం చేస్తాం? " వాపోయింది నవీన.

"ఏం చేస్తాంలే నవీన!" నిట్టూర్చింది సీమ.

"ఉంటానేం? చాలా సేపయింది. మళ్లీ ఎప్పుడైనా.. బై" అంది నవీన.

"అలాగే.. బబై" సీమ ఫోన్ పెట్టేసింది.

'రికార్డుకెక్కటానికే చేసిందనుకో! కానీ సుగుణ ఎలా భరిస్తోందబ్బా పిల్లల్నీ, అత్తమామల్నీ ఇంట్లోనే వుంచుకొని!?' అనుకుంటూ ఆ రోజంతా ఆశ్చర్యపడుతూనే వుంది సీమ. అటు నవీన కూడా. మరో రోజు వరకూ అలా ఆశ్చర్యపోదామనుకుంటే వాళ్లకాలోచించే టైమే లేదు. వాళ్లకు వాళ్లు వేసుకున్న పరుగు పందాలలో.. ఒత్తిళ్లలో వాళ్లనివాళ్లే మర్చిపోతుంటారు మరి!! ©



# విన్నర్

- పినిశెట్టి శ్రీనివాసరావు

తిన్నది అరగటానికే అనుకోండి.. 'ఫ్యాట్' కరగటానికే అనుకోండి.. బీపీ, షుగరు వగైరా వగైరా నియంత్రించుకోవటానికే అనుకోండి.. లేదా 'ఫిట్‌నెస్' కోసమే అనుకోండి... మీరేమనుకున్నా నేనేం అనుకోనులెండి. చెప్పొచ్చేదేమిటంటే 'నేను సైతం', అంటూ నేను కూడా ఈ మధ్యే సాయంకాలం ఐదు- ఆరు మధ్య, నలభైనుంచి అరవై నిముషాల వ్యవధిలో, కొత్తగా కొన్న వాకింగ్‌షూస్ వేసుకుని, పాదయాత్ర మొదలుపెట్టా.

మా ఊర్లో 'వాకర్స్' రోడ్డు అని ఒకటుంది. దానికి ఆ పేరు ఎవరు పెట్టారో తెలియదుకాని, జస్ట్ 'ట్వంటీ ఫీట్' రోడ్డులో, వాకర్స్‌కంటే వాహనాల సంఖ్యే ఎక్కువ. పొరపాటున రోడ్డుమీద నడిచారో పోతారంతే, అందుకే పాపం, పాదచారులు రోడ్డుదిగి పక్కన నడుస్తుంటారు.

అయినా సరే, ఆ ట్వంటీఫీట్ రోడ్డు ద్వారానే,

వా'కింగ్'లు, వా'క్వీన్'లు పోటాపోటీలుగా, ఒంటరిగానూ జంటగానూ, సీనియర్ సిటిజన్లయితే గ్రూపులుగానూ ప్రతినిత్యం పాదయాత్రలు చేస్తూనే వుంటారు. కొందరైతే పాపం, వాళ్ల భారీ కాయాన్ని లాక్కుంటూ, రొప్పుకుంటూ 'నడక యాతన' పడుతుంటారు. 'ప్రివెన్షన్ ఈజ్ బెటర్ దేన్ క్యూర్' అన్నట్లు తిండి విషయంలో నియంత్రణ వుంటే ఈ నడకయాతన తప్పుతుంది కదా అనిపిస్తుంటుంది నాకు.

నా విషయానికొస్తే, నాకు 'బ్రిస్క్‌వాక్' ఇష్టం. మనిషి ఏ వయసులోవున్నా యాక్టివ్‌గా వుండాలి. నేను నడుస్తున్నప్పుడు, వెనుకనుంచి ఎవరైనా వచ్చి నన్ను 'ఓవర్‌టేక్' చెయ్యాలని చూస్తే వాళ్ళని ఓడించి, నేను గెలిచేంతవరకూ వొదలను, పోటీతత్వం లేకపోతే మనిషి మనుగడ వృథా.

ఆ రోజు మాత్రం, నేనెందుకో ఓడిపోతున్నాననిపించింది. అతను నాతో సమానంగా, నా పక్కనే నడుస్తున్నాడు. మధ్య మధ్యలో తల తిప్పి నా ముఖంలోకి చూస్తూ 'ఛాలెంజ్' అన్నట్లుగా నన్ను రెచ్చగొడ్తున్నాడు. నాకంటే ఒక అడుగు ముందుకే వుంటూ, నన్ను ఓడించేస్తుంటే, ఏమిటీ ఇతను కాని 'స్ప్రింట్ క్వీన్' పి.టి. ఉష వారసుడు కాదుగదా అన్న అనుమానమొచ్చి, ఇక అతన్ని గెలవటం కష్టమేమోననిపించి, ఏంచెయ్యాలో తెలీక, అతన్నే చూస్తూ గమనిస్తూ నడుస్తున్నాను.

ఎందుకో అతన్ని చూస్తే ముచ్చటేసింది.

నన్ను ఓడించాలని అతనంతగా తాపత్రయపడుతుంటే.. 'పోనీలే ఎప్పుడూ నేనేనా.. ఈసారి అతను గెలిస్తే పోయేదేముంది' అనిపించింది.

ఆ ఆలోచనతోనే కావాలనే నడక వేగం తగ్గించాను. దాంతో అతను నాకంటే ముందుకు వెళ్లిపోయాడు.

ఆఖరుకు అనుకున్నంత పని జరిగింది.

అతనే గెలిచాడు. నేను వెనుకబడ్డాను.

ముందుకు వెళ్లినపోయినవాడు వెళ్ళిపోవచ్చు కదా? వెనక్కు తిరిగి, 'చూశావా నిన్ను ఓడించాను. నేను గెలిచాను' అన్న భావం వచ్చేటట్లు, నా ముఖంలోకి చూసి నవ్వుతుంటే, నాక్కూడా ఓడిపోయానన్న బాధ ఏమాత్రం లేక, అతని దగ్గరకు వెళ్లాను. 'షేక్ హాండ్' ఇచ్చి, 'బై' చెప్పి, ఆప్యాయంగా అతని బుగ్గన ఓ ముద్దిచ్చాను.

అతను..అతనెవరో తెలుసా? వీపున స్కూలు పుస్తకాల సంచిని మోస్తూ, స్కూలునుంచి ఇంటికి వెళ్తున్న ఐదారేళ్ల 'లిటిల్ ఛాంప్'.



# చతుర ప్రవేశిక

**మార్చి 'చతుర' చదివారా?**

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాయగలరేమో చూడండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

1. ప్రసాద్ కొడుకుల్లో తప్పిపోయిందెవరు?
జ :
2. భానును లేవదీసుకుపోయిన వంటవాడు?
జ :
3. జ్యోతిని ప్రేమించి పెళ్లాడింది?
జ :
4. జానకిరామయ్య భార్య?
జ :
5. పల్లవిపై ఆసిడ్ పోసిందెవరు?
జ :
6. సినారెకి జ్ఞానపీఠం తెచ్చిన రచన?
జ :
7. 'అతడు–ఆమె' రచయిత?
జ :
8. రవీంద్రనాథ్ టాగూర్ తండ్రి పేరేమిటి?
జ :
9. మునిమాణిక్యం సృష్టించిన ఇల్లాలి పేరు?
జ :
10. 'కాలుతున్న పూలతోట' ఎవరి రచన?
జ :

పంపినవారి పేరు: ---------------

వయసు (   )

చిరునామా:

-------------------

-------------------------

పిన్‌కోడ్:          ఫోన్ నెం:

చిరునామా : సంపాదకుడు, విపుల, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082

చివరి తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

విపుల వినోదిని, చతుర ప్రవేశిక ఒకే కవరులో పంపవచ్చు.

# మనసున ఉన్నదీ...



★ అప్టన్ సింక్లెయిర్ 'జంగిల్' నవల అమెరికాలోని కబేళాల్లోని దుస్థితిని ఎండగట్టిందని తెలుసుకుని సంతోషమైంది. ఏ రచనకైనా పరమార్థం సాంఘిక మార్పే అయినా దాన్ని రచనల్లో సున్నితంగా సూచించాలి. రచయిత కళాత్మక విలువలతో సామాజిక మార్పును మేళవించి అందించినట్లయితే అలాంటి రచన చరిత్రలో నిలుస్తుంది. సింక్లెయిర్ రచనలను చదవాలనే ఉత్సుకతను ఈనెల 'కాలాతీతం' కలిగించింది. ఈ శీర్షికను అందిస్తున్న చతురకు అభినందనలు.

– *గాయత్రి*, హిందూపురం

★ ఫిబ్రవరి జన్మదిన ప్రత్యేక సంచిక చాలా బాగుంది. సంచారుల జీవితాన్ని ఆర్ద్రంగా, హృద్యంగా రాజలింగం పాత్రద్వారా మా ముందుంచిన రచయిత పెద్దింటి అశోక్ కుమార్‌కు ధన్యవాదాలు. బెర్నార్డ్ షా హాస్యోక్తులు బాగున్నాయి. కాలాతీతంలో 'ది జంగిల్' నవల పరిచయం మాకో వరమనే చెప్పాలి. కొత్తగాలి కవితలు బాగున్నాయి.

– **వాడపర్తి వెంకటరమణ**, విశాఖపట్నం

★ 'సంచారి' నవల మొదలుపెట్టాక భాష, శైలి కాస్తంత ఇబ్బంది పెట్టింది. తర్వాత 'రాజలింగం' ద్వారా రచయిత కథను నడిపించిన తీరు ఆశ్చర్యం కల్గించింది. రాజలింగం మనసులోని మాటలు, పైకి చెప్పిన మాటలూ, ఆయన లౌక్యం ఆకట్టుకున్నాయి. ఇద్దరు పిల్లల కుటుంబాల్నీ నిలబెట్టడానికి ఆయన పడ్డ తాపత్రయం శ్లాఘనీయం. రచయిత అట్టడుగు వర్గాల జీవితాల్ని కథాంశంగా ఎంచుకోవడంవల్ల ఆ పాత్రలపట్ల పాఠకులకు దయ, కరుణ, సానుభూతి కలిగి, సాహిత్యపరంగా ఉన్నతంగా రాణించింది. ఇక కొత్తగాలి కవితలు బాగున్నాయి.

–**జి.జి.కె.రావు**, శ్రీకాకుళం

★ పెద్దింటి అశోక్ కుమార్ నవల 'సంచారి' వాస్తవాలకు అద్దంపడుతూ సంచార జీవితాల బాధామయ జీవితాలను చక్కగా ఆవిష్కరించింది. కథకు తగ్గట్లు బొమ్మలను బాలు చక్కగా వేశారు. కాప్షన్ మీదే పేజీ నవ్విస్తూ, ఆలోచింపజేస్తుంది. మార్చిలోని 'గడ్డిపూలు' నవలకోసం ఎదురు చూస్తున్నాం.

– *ఈ. వేమన*, శ్రీకాకుళం

★ చతుర జన్మదిన సంచిక అమితంగా ఆకట్టుకుంది. సంచారి నవల ఆసాంతం ఒక్క బిగువున ఆసక్తికరంగా చదివింపజేసింది. నిలకడలేని జీవితాలు, సంసారాలు ఎలా విచ్ఛిన్నం అవుతాయనే విషయాన్ని కళ్లకు కట్టినట్లు చూపించారు. కుటుంబ పెద్దల బాధ్యతను చక్కగా తెలియజేసిందీ నవల.

– **మోతి మోహనరంగా**, సూర్యాపేట

ముచ్చట గొలిపే ముఖచిత్రంతో చతురలో వచ్చిన 'సంచారి' నవల ఆసక్తికరంగా చదివించింది. 'వారెవ్వా!' చిత్రాలు హవ్వా అనిపించాయి. బెర్నార్డ్ షా చెణుకులు సరదా సరదాగా సాగాయి. చతుర ప్రపంచం కథనాలు కొంగొత్త అంశాలను పరిచయం చేశాయి.

–**నేమాన సుభాష్ చంద్రబోస్**, శ్రీకాకుళం

★ 'సంచారి' నవలలో పొట్ట చేత పట్టుకుని ఊరూరూ తిరిగి గంగిరెద్దులాడించే వారి జీవితాల్ని రచయిత అద్భుతంగా తెలియజేశారు. ఆయన సునిశిత పరిశీలన, అవగాహనకు ఈ రచన ఓ మచ్చుతునక. వారిపట్ల సానుభూతి కలిగేలా ఈ నవల కొనసాగింది. అయితే నేడు అలాంటి సంచార జీవితాలు కనుమరుగవుతున్నాయి. అందువల్ల ఇప్పుడు అత్యధిక సంఖ్యాక ప్రజలు ఎదుర్కొనే సమస్యలపైన దృష్టి సారిస్తే మంచిదని నా అభిప్రాయం.

– *డి.మీనాక్షి*, బెంగళూరు

---

చిరునామా : మనసున ఉన్నదీ... సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్–500 082
ఈ మెయిల్ :
vipula.chatura@gmail.com

# FORM IV (See Rule 8)

**Statement about ownership and other particulars of CHATURA.**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **RAMOJI RAO, VASUNDHARA PUBLICATIONS** 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2011

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, Plot No. 95 & 96, Gandhinagar, Quthubullapur Village & Mandal, R. R. District., Hyderabad-500 037. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net.

# కాప్షన్ మీదే - 27



ఈనాడు కార్టూనిస్ట్, ప్రముఖ చిత్రకారుడు శ్రీధర్ వేసిన పై కార్టూన్‌కు నవ్వొచ్చే కాప్షన్ రాయండి. చక్కని బహుమతి అందుకోండి!

బాగున్న మరో నాలుగు ఎంపిక చేసి, పంపినవారి పేర్లను ప్రచురిస్తాం.

మీ కాప్షన్లు అందాల్సిన చివరి తేదీ ఈ నెల 17

చిరునామా: సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 082

e-mail : vipula.chatura@gmail.com

## ఉత్తమ వ్యాఖ్య :

**ధూత్తెరి... శాప విమోచనమైనా..**
**సీసా విమోచనం కాదేం..?**

–కోనే నాగవెంకట ఆంజనేయులు
విశాఖపట్నం





## కాప్షన్ మీదే -26

బాగున్న మరికొన్ని కాప్షన్లు :

**సీఎం అయినంత సుళువు కాదు**
**సీసాలోంచి బయట పడటం!**

– వోలేటి శ్రీనివాసరావు, విజయనగరం

**అవకాశం దొరికింది కదా అని**
**తోక జాడిస్తే, ఇలాగే అవుతుంది మరి**

– టి.మహీపాల్‌రెడ్డి, హైదరాబాద్

**ఇదేం ఖర్మ! బయటకే పోనా?**
**లోనకే దూరనా?**

–నేమాన సుభాష్‌చంద్రబోస్, శ్రీకాకుళం

**ముక్తి లభించిందనుకుంటే**
**ఈ భవ బంధమేమిటి ప్రభూ!**

–రంగారావు పెయ్యేటి, హైదరాబాద్

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. HD/965/2009-2011 RNI/32186/78